TPLA101B326

...ర్వేద శిక్ష ప్రథమ స్కంధము

# భారతీయ విజ్ఞానము

వ 4

సంపాదకులు:
భిషగ్రత్న: ఆచంట లక్ష్మీపతిగారు,
బి. ఏ., యం. బి. సి. యం.

1943

ప్రకాశకులు:
ఆంధ్ర ఆయుర్వేద ఫార్మసీ, లిమిటెడ్.
43, హారిస్ రోడ్డు - మౌంట్ రోడ్డు,
మదరాసు.

ముద్రణము:
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల
అ. వెంకటరత్నంగారు, ఎం. ఎస్సి., బెజవాడ.

గ్రంథములకు:
సంపాదకుల పేర - సర్కసు మైదానము,
గవర్నరుపేట, బెజవాడకు వ్రాయవలెను.

చందాదార్లకు రు ౧-౦-౦ పోస్టేజీ సహా.
ఇతరులకు ౧-౮-౦ పోస్టేజీ గాక.

C TPLA103B126

# ఆంధ్ర మహాజనులకు విజ్ఞప్తి

నేను విద్యార్థిగా నుండు దినములలోనే అనగా 1907 సం॥ లో నా మొదటి గ్రంథమగు జీవశాస్త్రమును విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో ప్రచురించి యున్నాను. వెంట వెంటనే కలరా, మలేరియా, అంటువ్యాధులు, చంటిబిడ్డ మొదలగు గ్రంథములు అచ్చుపడినవి. ఈ గ్రంథములను పాశ్చాత్య దృష్టితో ప్రచురించితిని. అప్పటికి ఆయుర్వేదశాస్త్ర పరిచయ మంతగా లేకపోవుటచేత సమయము దొరికినపుడెల్ల భారతీయ సంప్రదాయములను వెక్కిరించుచు వ్రాసిన వ్రాతలను నేను తరువాత చూచి సిగ్గుపడుచు వచ్చితిని. ఇట్టి విరోధశాస్త్రముల యందలి విషయములను విమర్శనలేకుండ ప్రచురించకూడ దను ఉద్దేశముతో వానిని నేను తిరిగి ముద్రణము చేయుటకుగూడ అంగీకరించలేను.

అగాధమగు భారతీయ విజ్ఞానమును చూచిన కొలది అదివఱకు వ్రాయుచుండినట్లు ఏవో వ్రాతలు వ్రాయుటకు కల మాడకపోయెను. అందుచేత నన్ను ఎంతమంది ఒత్తిడి చేసినను నేను ఆయుర్వేదవైద్యగ్రంథమును స్వతంత్రించి వ్రాయుటకు పూనుకొనలేదు. కాని నిఖిల భారతాయుర్వేద మహామండలివారిపాఠ్యక్రమము ననుసరించి "ఆయుర్వేదశిక్ష" అను నొక గ్రంథమును వ్రాయవలె నని సంకల్పముమాత్రము ఉండెను. ఈ గ్రంథరచనకై నేను ఆయుర్వేదాంగము లగు ఇతర శాస్త్రముల జ్ఞానమును విద్వాంసుల పరిచయము మూలమునను, గ్రంథపఠనమూలమునను, సమ్మేళనములు పరిషత్తులు మూలమునను సంపాదించుటకు పది పన్నెండు సంవత్సరముల నుండి ఎక్కువ దీక్షతో కృషిచేయుచుంటిని.

ఈ గ్రంథము హిందూదేశమున కంతకునే గాక ఈ ప్రపంచమునందలి ఇతర దేశముల వారికిని ఉపయోగ పడవలెనను ఉద్దేశముతో ఇంగ్లీషుభాషయందే ప్రకటింపదలచితిని. కాని యుద్ధకారణముగా విదేశీయ ఔషధములు దొరకని ఈ రోజులలో మన గ్రామములందు నివసించు ప్రజలకును, వైద్యులకును, చికిత్సాసౌకర్యములు అత్యవసరము లని తలచి ఆంధ్రభాషయందు ప్రప్రథమమున ప్రచురించుటకు నిశ్చయించితిని. అవసరమైనంతవఱకు పాశ్చాత్యవిజ్ఞానముకూడ ఇందు ఇముడ్పబడును.

కాగితములు మునుపటి వెలకంటె నాలుగైదురెట్లు హెచ్చిన ఈ దినములలో ఇంతవ్యయము చేయుట అవసరమా? అను ప్రశ్న పుట్టెను. ప్రస్తుతపరిస్థితులను బట్టియు, ఇంకను ముందు రాబోవు పరిస్థితులను బట్టియు ఆయుర్వేదమే ఈ దేశమందలి పాశ్చాత్యవైద్యులకుగూడ శరణ్యము కాబోవుచున్నదని సూచన లున్నందున తొందరపడి ఈ గ్రంథ ముద్రణమునకు దిగుచున్నాము. ఈ గ్రంథరచనయందు నాకు చాలమంది వైద్యవరులు సహాయము చేయుచున్నారు. వారి కందరకు కృతజ్ఞుడను.

ఆంధ్రమహాజనులు మునుపటివలె తమ తోడ్పాటును జూపి నన్ను ప్రోత్సాహపరచెదరని నమ్ముచున్నాను.

బెజవాడ
25—10—42.

ఇట్లు,
ఆచంట లక్ష్మీపతి.

# పీఠిక

ప్రస్తుతము ఆయుర్వేద విద్యార్థులు చదివెడి చదువు సరియైన పునాదులమీద ఆధారపడి యుండకపోవుటచేత ఆ శాస్త్రమునందలి ముఖ్యవిషయములు విద్యార్థుల హృదయమునందు దృఢముగ నాటుకొనుట లేదు. అందు కొఱకై ఆయుర్వేద శాస్త్రము ఏకాలమునఁ బుట్టినదో ఆకాలమునందలి దేశచరిత్రయు, సంప్రదాయములును తెలిసికొనుట అవసరము.

ఈ భారతీయ విజ్ఞానము అను ప్రథమస్కంధము ప్రత్యేకము ఆయుర్వేద విద్యార్థుల నిమిత్తమే వ్రాసియున్నను— హిందూస్థానమున వర్ధిల్లిన ఏశాస్త్రము నైనను చక్కఁగా తెలిసికొనవలె ననిన యెడల ఈ విజ్ఞానము అవసరము.

ఇందుచే నూతనదృక్పథము ఏర్పడి పాశ్చాత్య వ్యామోహము తగ్గి నిజమైన శాస్త్రజ్ఞానము కలుగుటకు ఈ భారతీయవిజ్ఞానము సహాయపడగల దని ఆశించుచున్నాము.

ఉగాది : స్వభాను
5—4—43

ఆచంట లక్ష్మీపతి,
సంపాదకులు.

# సమర్పణమ్.

స్వస్తిశ్రీ వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే ౫౦౪౩ తమ
వత్సరే శాలివాహనశకే ౧౮౬౪ తమవత్సరే చిత్రభాన్వాశ్వయుజ
బహుళ త్రయోదశ్యాం శ్రీ ధన్వంతరి జయంతి పుణ్యదినే

జంబూద్వీపే భరతవర్షే భరతఖండే ఆంధ్రరాష్ట్రే శ్రీశైలస్య ఈశాన్య
ప్రదేశే శ్రీ కృష్ణవేణ్ణా మహానద్యుత్తరవాహిని పుణ్యతీర విలసితే
అమరావతీ పుణ్యతీర్థ సమీపే భారద్వాజాశ్రమ సన్నికటే శ్రీ
ముక్తేశ్వర పురస్థ శ్రీ భవానీ ముక్తేశ్వరస్వామి సన్నిధౌ,

భారతదేశీయానాం సర్వవిద్యానాం కలానాం చ పునరుద్ధరణ బద్ధకంక
ణానాం విశేషేణాయుర్వేద శాస్త్ర సముద్ధరణ దీక్షా దీక్షితానాం,

శ్రీశ్రీశ్రీ రాజా వాసిరెడ్డి వంశకలశోదధి పూర్ణరాకానిశాకరాణాం

శ్రీమచ్చింతలపాటివంతు సంస్థానాధీశ్వరాణాం శ్రీ చినవెంకటాద్రి
నాయుడు బహద్దరాణాం ప్రపౌత్రాణాం శ్రీశ్రీశ్రీ భవానీ ముక్తేశ్వర
ప్రసాద బహద్దరాణాం పౌత్రాణాం, శ్రీశ్రీశ్రీ రాజా ఉమామహేశ్వర
ప్రసాద్ బహద్దరాణాం పుత్రాణాం శ్రీశ్రీశ్రీ రాజా చంద్రమౌళీశ్వర
ప్రసాద బహద్దర్ మన్నెసుల్తాన్ ఇత్యాది బిరుదావళీ విభ్రాజితానాం
కరకమలయోః

గోదావరీ పుణ్యనదీ గోతీర్థ సమీపవర్తి మాధవవర గ్రామనివాసినః -
యజుశ్శాఖాధ్యాయినః ఆపస్తంబ సూత్ర సాంఖ్యాయనసగోత్ర పవిత్ర
అచంట వంశపారావార పూర్ణచంద్రమసః సుబ్బరాయశర్మణః
పౌత్రేణ, శ్రీజానకీగర్భ శుక్తిముక్తాఫలేన శ్రీరామశర్మణః జ్యేష్ఠపుత్రేణ
ఆంగ్లాయుర్వేదోభయవైద్యవిద్యాభిలాషిణా ఆయుర్వేదార్పిత సర్వ
స్వకేన చెన్నపురి సమీపస్థ అనంతనారాయణదీక్షితకృతయజ్ఞ పుణ్య
భూమి విలసదావడ్యారోగ్యాశ్రమ నివాసినా

భిషగ్రత్న, ప్రాణాచార్య, బి. ఎ., యం. బి. సి. య మిత్యాది బిరుదాంకి
తేన లక్ష్మీపతి శర్మణా -

సవినయం కృతజ్ఞతాపూర్వకం సమర్పిత మిదం -

ఆయుర్వేద శిక్షాయాం సూత్రస్థాన నామకం గ్రంథరాజమ్.

ఇతి శుభమ్ :



శ్రీ ముక్త్యాల సంస్థానాధీశ్వరులు :

శ్రీ శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీ చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుగారు

వెనుక నిలుచున్నవారు :

శ్రీ శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీరామ గోపాలకృష్ణమహేశ్వర
ప్రసాద బహద్దరుగారు

# విషయసూచిక

## ఆయుర్వేద శిక్ష - సూత్రస్థానమందు

## ప్రథమ స్కంధము

# భారతీయ విజ్ఞానము

| విషయము. | పుట. |
|---|---|

## 1 వ అధ్యాయము
### ఆయుర్వేద నిర్వచనము.



## 2 వ అధ్యాయము
### హిందూస్థాన సంగ్రహ చరిత్ర

## 3 వ అధ్యాయము

## హిందూస్థానమున విద్యావ్యాప్తి

## 4 వ అధ్యాయము

## వాఙ్మయము



## 5 వ అధ్యాయము

## సంఘ నిర్మాణము



## 6 వ అధ్యాయము

## ఆర్థికస్థితి

## 7 వ అధ్యాయము

## ఆశ్రమ, గ్రామ, నగర నిర్మాణము



## 8 వ అధ్యాయము

## విద్యలు - కళలు

---

అకారాది విషయసూచిక

గ్రంథమునకు చివర పేజీలలో చూడనగును.

# ఆయుర్వేద శిక్ష

## [A Text-Book of Ayurveda]

## సూత్రస్థానము

## (Fundamental Principles)

ప్రథమస్కంధము

## భారతీయ విజ్ఞానము

శ్లో. రాగాదిరోగాః సతతానుషక్తా నశేషకాయప్రసృతా నశేషాః
ఔత్సుక్య మోహారతిదా జ్జఘాన యోఽపూర్వ వైద్యాయ నమోస్తు తస్మై.*

## 1 వ అధ్యాయము

## ఆయుర్వేద నిర్వచనము

[విషయసంగ్రహము: ఆయుర్వేద నిర్వచనము - విశాలదృష్టి - సుఖదుఃఖములు - హితాహితములు - సంపూర్ణశాస్త్రము - సర్వశాస్త్రసారము - వైద్యుడు బహుశ్రుతుడగు పండితుడు కావలెను.]

ఆయుర్వేద వైద్యమునకును, పాశ్చాత్యవైద్యమునకును చాల తేడా ఉన్నది. ప్రస్తుత పాశ్చాత్యవైద్యము కేవలము

* ఎల్లప్పుడు శరీరముతో సంబంధించియుండునవియు, పాదాది శిరః పర్యంతమైన సకలశరీరమునకు వ్యాపించియుండునవియు, (సమస్త

భౌతిక దేహమునుగూర్చి చర్చించును. పాశ్చాత్య విజ్ఞాన వేత్తలు భౌతికపదార్థములనుగూర్చి మాత్రమేగాని ఆధ్యాత్మిక (ఆత్మకు సంబంధించిన) విషయములను గూర్చి అంతగా చర్చింపరు. ఇట్లు మిక్కిలి ముఖ్యమగు విషయములలో భేద ముండుటచే ఆయుర్వేదము పాశ్చాత్యవైద్యశాస్త్రమువలె కేవలము భౌతికశాస్త్రముగా అభ్యసించుటకు వీలులేదు. ఈ రెండు శాస్త్రములకును పునాదులు వేరు. పాశ్చాత్య వైద్యశాస్త్ర మంతయు ఆయుర్వేదములో ఇముడ్చవచ్చునుగాని ఆయుర్వేద మును పాశ్చాత్య వైద్యశాస్త్రములో అంతర్భాగముగా నిముడ్చుటకు వీలులేదు. ఏల యనగా నీతి, మత సంబంధమైన మానవజీవిత మంతయు ఆయుర్వేదములో చేరును.

## విశాల దృష్టి

ఆయుర్వేదముయొక్క దృష్టి మిక్కిలి విశాలమైనది. పాశ్చాత్యవైద్యశాస్త్రముయొక్క దృష్టి మిక్కిలి సంకుచిత మైనది. ఇతర వైద్యశాస్త్రములు దీర్ఘాయువు (Long life) ను, సుఖాయువు (Happy life)ను సంపాదించుటకు ప్రయత్నించును.

---

జీవులయొక్క శరీరమునందు వ్యాపించియుండునవియు) మానసోద్రేకము, స్పృహతప్పిపోవుట, విసుగుజెందుట మొదలగు అసాధ్యలక్షణములతో కూడియుండునవియు నైన రాగాదిరోగములు అనగా అను రాగ, లోభ, క్రోధ, మోహ, మద, మాత్సర్యములను రోగములను నిశ్శేషముగ పోగొట్టునట్టి ఆదివైద్యుడగు పరమాత్మకు నమస్కరించెద. లేక ఆశ్చర్యకరుడై యితర వైద్యుల బోలని వైద్యుడని గూడ తాత్పర్యము. ఇతర వైద్యులు శారీరకములును, అందులో సుసాధ్యములగు రోగములనే కుదుర్చెదరు. అసాధ్యములను మానసికములను గూడ నీ వైద్యుడు పోగొట్టును. (వాగ్భటము)

ఆయుర్వేదశాస్త్రము హితాయువు (Benificial life) నిచ్చుటను కూడ నేర్పును. ఇది ఈ రెండు శాస్త్రములకును గల తారతమ్యము.

ఆయుర్వేదముయొక్క చరిత్రము ఈ సృష్టియొక్క-చరిత్రముతో ప్రారంభ మగుచున్నది. సృష్టి ఎప్పుడు ప్రారంభించినదో అందలి జీవరాసులు ఎప్పుడు పుట్టినవో అప్పటినుండి ఆయుఃవుయొక్క-చరిత్ర ప్రారంభమగును (అనాదిత్వాత్). ఆయుఃవును గూర్చి తెలుపు శాస్త్రము ఆయుర్వేదము. ఆయువు అను పదము యొక్క నిర్వచనము ఈ ప్రకారముగా చేసి యున్నారు.

♦ "శరీరేన్ద్రియ సత్వాత్మ సంయోగో ధారి జీవితమ్
నిత్యగ శ్చానుబన్ధశ్చ పర్యాయై రాయురుచ్యతే."

శరీరము, ఇంద్రియములు, మనస్సు, ఆత్మ-వీనిసంయోగమే ఆయువు. మరియు ఆయువు అనగా—"ఆయుః చేతనానువృత్తిః" అని—చేతనము అనువర్తించి యుండుట - ప్రాణముతో కూడి యుండుట అని అర్థము.

ప్రాణముగల ద్రవ్యములకు హితము, అహితము, సుఖము, దుఃఖము అను గుణములు గలవు.

సుఖదుఃఖములకు మనస్సే కారణము. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" * బంధమే దుఃఖము; బంధవిముక్తియే మోక్షము; ఇదియే పరమసుఖము.

## సు ఖ దుః ఖ ము లు

సుఖ అనగా ఆయుర్వేదమునందు ఈ ప్రకారము నిరూ

♦ చరక. సూ. అ. 1.42. (వావిళ్ల). * భగవద్గీత.

పింపబడినది. మనశ్శరీరములకు సంబంధించిన రోగములచే పీడింపబడనివాడును, విశేష యౌవనము గలవాడును, తన శరీరమునకు చాలినంత సంపూర్ణ బలమును, వీర్యమును, పౌరుష పరాక్రమములను గలవాడును, ఆధ్యాత్మికజ్ఞానమును, భౌతిక పదార్థజ్ఞానమును రెండును గలవాడును, కండ్లు, ముక్కు, చెవులు, నాలుక, చర్మము వీనియందు ఏ లోపమును లేక సంపూర్ణత గలిగియుండువాడును, ఈ ఇంద్రియములను తృప్తి చేయుటకు తగిన సమస్తసంపదలుగలవాడును, మనోహరములై రమ్యములై పలు తెరంగులైన భోగముల ననుభవించువాడును, తా దలచిన కార్యముల నెల్ల సాధింప సమర్థతగలవాడును, తన కిచ్ఛవచ్చినవిధమున నడుచుకొనుటకు సర్వస్వతంత్రశక్తి గలవాడును అగునట్టి మానవునకు ఆయువు సుఖకరమైయుండు ననియు,ఇట్టివిలేనివాని జీవితము దుఃఖకరమనియు చెప్పబడినది.* "ఇదిలేదు" "అదిలేదు" అనక తాను కోరిన వన్నియు లభించుట సుఖము. మంచిదైనను చెడ్డదైనను సరే తాను కోరునది లభించకపోవుటయే దుఃఖము. కాబట్టి సుఖదుఃఖములకు మూలము కోరిక. దీనినే తృష్ణ అందురు.

'ఇచ్ఛాద్వేషాత్మికా తృష్ణా సుఖదుఃఖాత్ ప్రవర్తతే' ♦

అన్ని కోరికలకును కారణము మనస్సు.

శరీరమునకును మనస్సునకును ఆత్మకును గల సంబంధమును గూర్చి ఆయుర్వేదము విపులముగా బోధించును. పైన వివరించబడిన వివిధములైన కోరికలనుండి మనస్సును మరల్పగలిగిన

* చరక. సూత్ర. అ. 30–సూ. 19. ♦ చరక. శారీర. అ. 1–సూ. 134

యెడల అదియే గొప్పసుఖము. ఇదియే నివృత్తిమార్గము. ఇది మోక్షమను పరమసుఖమునకు సాధనము.

## హి తా హి త ము లు

హిత మనగా మంచిది అని అర్థము. సుఖమనునది తనకు చెందును. హిత మనునది పరులకుగూడ చెందును. ఒకానొక ప్పుడు తనకు హితమైనది పరులకు అహితము కావచ్చును. తనకు అహితమైనది పరులకు హితము కావచ్చును. తన సుఖముకొరకైనను పరుల హితమును కోరవలసివచ్చును. ఇందు కుదాహరణము :—భార్యాపుత్రాదులకు సుఖము లేనియెడల తన సుఖము కూడ కొఱతవడును. ఇట్లే ఒక గ్రామమునందు తాను సుఖముగా నుండినను గ్రామములో దొంగలు పడి దోచుకొనుచు వచ్చినయెడల తాను ఊరకయుండినచో తనకుగూడ ఒకానొక నాటికి కష్టము రావచ్చును. కాబట్టి తన హితమునుబోలె పరుల హితమును గూడ కోరుచుండుట శ్రేయస్కరము. ఈ సాంఘికహితమునకే ధర్మ మని చెప్పుదురు. ఇట్లు సుఖాసుఖములను, ధర్మాధర్మములను గూర్చి తెలుసుకొనుటయే ఆయుర్వేదముయొక్క ముఖ్యలక్ష్యము. ఇట్టి జ్ఞానము ఆయువుయొక్క సుఖాసుఖములకును హితాహితములకును వృద్ధిక్షయములకును అవసర మగుచున్నది. ఈ వ్యాఖ్యాన మిట్లుండగా సామాన్యముగా సుఖ మనగా ఆరోగ్యమనియు,అసుఖ మనగా రోగ మనియు, హిత మనగా శరీరమునకు పథ్యమగు ఆహారవిహారము లనియు, అహిత మనగా అనారోగ్యకరములగు పరిస్థితు లనియుగూడ చెప్పవచ్చును.

**ఆయుర్వేదములో హితాయువు అను పదమునకు ఈ ప్రకారము వ్యాఖ్యానము చేయబడినది.**

"సర్వప్రాణుల సుఖము గోరువాడును, పరులసొమ్ము నాశించని వాడును, సత్యవంతుడును, ఓర్పుగలవాడును, కార్యముల పట్ల యుక్తాయుక్తముల విచారించి పనుల చక్కగ చేయువాడును, జాగరూకుడును, ధర్మార్థ కామముల నొకటి కొకటి విరోధము గాకుండ ననుభవించువాడును, పూజింప దగిన పెద్దల యథోచితముగ పూజించువాడును, జ్ఞాన మనగా అధ్యాత్మిక జ్ఞానమును, విజ్ఞాన మనగా శాస్త్రీయ జ్ఞానమును కలవాడును, శాంతియుతుడును, సదాచార సంపన్నుడును, పెద్దల సేవించువాడును, ఆశ, క్రోధము, ఈర్ష్య, మదము, అహంకారము, వీటివేగములను జయించిన వాడును, ఎల్లప్పుడును అనేకవిధములగు దానధర్మములను చేయుటయందు ఆసక్తి గలవాడును, తపస్సునందును బ్రహ్మజ్ఞానమునందును, ఇంద్రియ నిగ్రహమునందును ఎడలేని చిత్తవృత్తి గలవాడును, ఆత్మజ్ఞానియు, బ్రహ్మానుసంధానమునందు ఆసక్తిగలవాడును, ఇహపరలోకములకు సంబంధించిన విషయములు గమనించువాడును, చక్కని జ్ఞాపకశక్తి గలవాడును అగు మానవునియొక్క ఆయువు హితాయువు" అని* చెప్పియున్నారు.

దీనికి వ్యతిరేకముగ నుండువాని జీవితము అహితాయువు అగును.

పైన వివరించిన సుఖదుఃఖములును హితాహితములును గాక ఒక మానవుడు జీవించుకాలపరిమాణమును గూర్చికూడ ఈ శాస్త్రమునందు చర్చించబడును.

## సంపూర్ణ శాస్త్రము

ఈ వివరణమునుబట్టిచూడగా ఆయుర్వేదము పాశ్చాత్య పద్ధతివలె ఒక్క రోగారోగ్యవిషయములు మాత్రముగాక మానవునకు సంబంధించిన నీతిమతసంబంధమైన సర్వవిషయములను గూర్చి బోధించు సంపూర్ణశాస్త్ర మగుచున్నది. అందుచే ఈ శాస్త్రము అపారమైనదియు, అనాదియైనదియు, ఎప్పటి కప్పుడు వృద్ధిచెందుచు "పురాణం చ పునర్నవమ్" అని ♦ప్రాతది

* చరక. సూత్ర. అ. 30 – సూ. 19. ♦ చరక. సిద్ధి. అ. 12 – సూ. 76

మైనను కాలానుగుణముగ క్రొత్తరీతుల నభివృద్ధినొందు శాస్త్ర మనియు చెప్పబడినది.

"హితాహితం సుఖం దుఃఖం, ఆయుః, తస్య హితాహితం
మానంచ తచ్చ యతోక్తం, ఆయుర్వేద స్స ఉచ్యతే. *

హితము, అహితము, సుఖము, దుఃఖము అనునాల్గు ప్రకారములు గలది ఆయువు. అట్టి ఆయువుయొక్క హితాహితములను (అనగా పథ్యాపథ్యములను) పరిమాణమును, హితాహిత సుఖదుఃఖరూపమగు నాయుఃస్వరూపమును ఏశాస్త్రమునందు చెప్పబడునో ఆ శాస్త్రమునకు ఆయుర్వేదము అని పేరు.

## సర్వశాస్త్ర సారము,

ఇంత విశాలమైన దృష్టిగల ఈ శాస్త్రమునందు అన్ని శాస్త్రముల సారమును చేరుటకు అవకాశము గలదు. మానవులకు నాల్గు పురుషార్థముల (ధర్మార్థకామ మోక్షముల) లో దేనిని సంపాదించవలయు ననినను ఆరోగ్యము ప్రధానము. రోగములు అట్టి ఆరోగ్యమును అపహరించినయెడల జీవితము యొక్క సర్వశ్రేయస్సులు చెడును.

సర్వశాస్త్రసారమగు ఆయుర్వేదముయొక్క ఘనతను గూర్చి తెలుసుకొనవలె ననినయెడల ఆయుర్వేదము అభివృద్ధి చెందిన నాటి దేశచరిత్ర, విద్యావ్యాప్తి, విద్యావిధానము, విశ్వవిద్యాలయములు, శాస్త్రములు, కళలు,నాగరికత, రాజనీతి, సంపత్తు, ప్రజల ఆదర్శములు మొదలగు విషయములనుగూర్చి తెలుసుకొనుట ఆవశ్యకము. ఒకరత్నముయొక్క సంపూర్ణమైన శోభ తెలుసుకొనవలెనన్న చో,దానిని విడిగా పరీక్షించుటకంటె

* చరక. సూ. అ. 1-మూ. 40

తగురీతిని ఉచితమగు స్వర్ణము మొదలగు ఇతర సంపుటములో ఇమిడ్చి ఒక నగగా తయారుచేసినప్పుడు దానియొక్క నిజమైన శోభ తెలియును. ఇదేప్రకారము ఆయుర్వేదమునకు పునాదులగు ఇతరశాస్త్రములను చక్కగా గ్రహించినప్పుడే ఈ శాస్త్రముయొక్క విలువ బైటపడును.

ఇందు మొదటిభాగమునందు వైద్య విద్యాభ్యాసమునకు పూర్వము తెలుసుకొనవలసిన ఇతరశాస్త్రములనుగూర్చి సంగ్రహముగా వివరించబడును. అన్ని శాస్త్రములయొక్క విజ్ఞానము లేనిదే ఆయుర్వేదమునందలి సిద్ధాంతములు బోధపడుట కష్టము. సాంఖ్యము, వైశేషికము, వేదాంతము, జ్యోతిషము మొదలగు ఇతరశాస్త్రములకు సంబంధించిన విషయములు తరుచు ఆయుర్వేదమునందు ఉదాహరింపబడుచుండును.

వైద్యుడు బహుశ్రుతుడగు పండితుడు కావలెను.

"నహి ఏకస్మిన్ శాస్త్రే శక్యః సర్వశాస్త్రాణాం అవరోధః కర్తుం." *

ఒక్కశాస్త్రమునందు సర్వశాస్త్రముల విషయములును సుబోధక మగునట్లు వ్యాఖ్యానము చేయుట సాధ్యము కాదు. కావున అన్ని శాస్త్రసంప్రదాయములను ఆయా పండితులవద్ద వైద్యశాస్త్రము నభ్యసించు విద్యార్థులు తెలుసుకొనవలెను. ఈ విషయమే ఈ క్రిందిశ్లోకమున సుశ్రుతమునందు గలదు.

"ఏకశాస్త్ర మధీయానో న విద్యాత్ శాస్త్రనిశ్చయమ్
తస్మా ద్బహుశ్రుతః శాస్త్రం విజానీయా చ్చికిత్సకః. ♦

---

* సుశ్రుత. సూత్ర. అ 4 - 6. ♦ సుశ్రుత. సూత్ర. అ 4-7.

ఒక్క శాస్త్రము చదివినవాడు శాస్త్రార్థ నిశ్చయమును తెలుసుకొనజాలడు. కావున వైద్యుడు సర్వశాస్త్రములను తెలుసుకొనవలెను.

బహుశ్రుతః అని చెప్పుటచేత వైద్యుడు తాను వైద్యుడు గాకముందే పండితుడై యుండవలెను. అనగా ముందు పండితుడైయుండి తరువాత వైద్యవిద్యార్థి కావలెను.

"స్వతంత్రకుశలో అన్యేషు శాస్త్రార్థే ష్వబహిష్కృతః
వైద్యో ధ్వజ ఇవాభాతి నృపతద్విద్య పూజితః.*

తన వైద్యశాస్త్రమునందు నేర్పుగలిగి ఇతరశాస్త్రార్థము లందు చతురుడైన వైద్యుడు రాజులచేతను, ఇతర వైద్యుల చేతను పూజింపబడినవాడై జెండావలె ప్రకాశించును. అనగా ప్రతివైద్యుడును ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కామ శాస్త్రము, మోక్షశాస్త్రము అని నాలుగు విధములుగా నిర్ణయింపబడి తాత్కాలిక సుఖమును గూర్చియు, నిత్యసుఖమును గూర్చియు బోధించు సమస్తశాస్త్రములను తెలిసిన పండితుడై యుండవలెను.

అందుకొరకై ఆయుర్వేదవిద్యార్థికి అవసరమగు ఇతర శాస్త్రములనుగూర్చి సంక్షేపముగా చర్చింపబడును. ఇవి ఆయుర్వేదశాస్త్రమునకు పునాదివంటివి.

---

* సుశ్రుత. సూత్ర. అ. 34 - 15.

## 2వ అధ్యాయము

# హిందూస్థాన సంగ్రహ చరిత్ర

విషయసంగ్రహము:— హిందూస్థాన సంగ్రహచరిత్ర - పురాతన యుగము - పూర్వసముద్రము - ఆర్యయుగము - ఆర్యుల సంతతి - దేశములు - భాషలు - సర్వమానవ జాతికి పుట్టినిల్లు - పురాతన నగరములు-ఇండ్లు-మతము-కర్మకాండ - బౌద్ధయుగము - బౌద్ధమతము - జైనమతము - వైష్ణవమతము - శైవమతము- రామాయణ మహాభారతములు- మతవిప్లవము - బౌద్ధమతపతనము - పౌరాణికయుగము - ఆంధ్ర రాజులు - కనిష్క మహారాజు - సముద్రగుప్తుడు - విక్రమాదిత్యుడు - శిలాదిత్యుడు - శ్రీ హర్షుడు - పురాణరచన - శాస్త్రాభివృద్ధి - హాజ్య యము - శిల్పకళాభివృద్ధి - కుమారిలభట్టు - శంకరాచార్యులు - రేణుకా చార్యులు - రామానుజాచార్యులు - మధ్వాచార్యులు - దేవాలయములు - హిందూరాజ్యముల విస్తీర్ణము - వలసరాజ్యములు - భక్తియుగము - శైవసిద్ధాంతము - శాక్తము - నింబార్కుడు - వల్లభాచార్యులు - శ్రీ చైతన్యుడు - తుకారాము - హిందూమతమునందు గలిగిన మార్పులు - మహమ్మదీయమతము - మహమ్మదీయమత వ్యాపకము - సూఫీమతము - సిక్కుమతము - క్రైస్తవమతము - యూదులు: వారి ఆచారములు - పారసీకమతము - ఆధునికయుగము - జాతీయోద్యమము - ఐకమత్యము - అహింస.

---

ఆయుర్వేద విద్యార్థులు ప్రాచీన సంప్రదాయములను తెలిసికొను నిమిత్తము మనదేశము యొక్క చరిత్రను, సంగ్రహముగ నయినను తెలిసి కొనుట అవసరము. పౌరాణిక గ్రంథములలో మనదేశము భరతఖండ మని వ్యవహరింపబడియున్నది. దుష్యంతుని కుమారుడగు భరతునిచే పాలింపబడి నందున ఈదేశమునకీ పేరు కలిగియుండవచ్చును.* ప్రస్తుతము వాడుకలో

---

* వేదములలో 'భరత దౌష్యంతి' అని కూడ కనబడుచున్నది.

నున్న హిందూపదము సింధు అనురూపమున నున్నది. మన ప్రాచీన గ్రంథములలో 'హిందు' శబ్దము పారసీక (అవెస్త) భాషలోనిది. 'హిందు' పదము కొంతకాలమైన పిమ్మట మేరుతంత్రము పద్మ పురాణములలో నున్నట్లు తెలియుచున్నది. వేదములందు సప్తహిందు అని ఆర్యులు నివసించిన దేశమునకు పేరుండెను. ఈ సప్తహిందునకు 'హప్తహిందు' అని పారసీక భాషలోనున్నది. ఖండాంతరవాసులు సింధుశబ్దమునే హిందుశబ్దముగ మార్చి యీ దేశీయులను హిందువులనియు, దేశమును హిందూస్థానము హిందూ దేశము, ఇండియా అనియు వాడుచువచ్చిరి.

భరతఖండము యొక్క చరిత్రను మేము 6 భాగములుగ విభజించి, ఆయా కాలము ననుసరించి వర్ణించుచున్నాము.

1. పురాతనయుగము – అనాదినుండి క్రీ॥ పూ॥ 50,000 సంవత్సరముల వరకు
2. ఆర్యయుగము క్రీ॥ పూ॥. 50,000 నుండి 600 వరకు
3. బౌద్ధయుగము క్రీ॥ పూ॥ 600 నుండి క్రీ॥శ॥ 300 వరకు
4. పౌరాణిక యుగము క్రీ॥ శ॥ 300 నుండి 1000 వరకు
5. భక్తియుగము క్రీ॥ శ॥ 1000 నుండి 1858 వరకు
6. ఆధునిక యుగము క్రీ॥ శ॥ 1858 నుండి...

## 1. పురాతనయుగము

(అనాదినుండి క్రీ. పూ. 50,000 వరకు)

### పూర్వ సముద్రము

'అవినాశచంద్రదాసు' అను చారిత్రకపరిశోధకుడు భూగర్భశాస్త్ర పరిశోధనల నాధారపరచుకొని ఉత్తరమున పంజాబునకును, దక్షిణమున వింధ్యపర్వతపంక్తికిని మధ్య నొక సముద్ర ముండెననియు, అది ఇప్పటి రాజపుత్రస్థానము మొదలు తూర్పున బీహారు, బెంగాలుల వరకు గంగానదికి దక్షిణమున గల భూభాగమంతయు నాక్రమించుచుండెననియు, కాలక్రమమున హిమాలయములనుండి క్రిందికి ప్రవహించెడి నదులయొక్క ఒండ్రుచే పూడిపోయి భూభాగమయ్యెననియు, ఋగ్వేదమునందు (10-130-5) పూర్వ సముద్రమని వ్యవహరింపబడినసముద్ర మిదియె అనియు తెలిపి, అప్పటి

కాలపు మనదేశపటము నొకదానిని ఋగ్వేదమునందు వర్ణించిన రీతిని ఇచ్చి యున్నాము.

ఋగ్వేదమునం దుదాహరింపబడిన పూర్వసముద్రము ప్రస్తుతపు బంగాళాఖాతము కాదని మాత్రము నిరూపించుట కనేకనిదర్శనములు గలవు. ఋగ్వేదమునందు వర్ణింపబడిన ఎడారులను బట్టి రాజపుత్రస్థానమంతయు ఒకప్పుడు ఉప్పునీటి సరస్సులతోను, ఎడారులతోను నిండియుండి, అపుడపుడు ఉప్పెన వచ్చినపుడు సముద్రరూపమును బొంది ఉత్తరమున నున్న పంచనదదేశమును దక్షిణదేశమునుండి ప్రత్యేకపరచుచుండెననియు తెలియగలదు. మరియు, రాజపుత్రస్థానమునందు భూగర్భమున పంజాబు నందువలె ప్రాచీనకాలపు నాగరికతను తెలియజేయగల చిహ్నము లెవ్వియు లభించకపోవుటయు, సైంధవలవణము, సోడియం సల్ఫేటుల గనులు అతి విస్తారముగ నుండుటయు, ఈ దేశము ఒకప్పుడు సముద్రముయొక్క అడుగుభాగ మని దృఢపరచుచున్నవి. మరియు, దక్షిణదేశమునకు బోవుటకు నిరోధముగ నుండి గాథలలో అగస్త్యునిచే నిర్జలము గావింపబడిన సముద్రమిదియే అయియుండవచ్చునని నమ్మవచ్చును. భూగర్భశాస్త్రజ్ఞులందరును ఇట్టి సముద్ర మొకటి మనదేశమునం దుండెనని ఏకగ్రీవముగ నంగీకరించి యున్నారు. 'వాడియ'* అను భూగర్భశాస్త్రకారుడు తన గ్రంథములో నిట్టి సముద్రమును గురించి తెలిపియున్నాడు. 'హెచ్. జి. వెల్స్'♦ అను మరియొక చరిత్రకారుడు అతని గ్రంథమునందు 50,000 సంవత్సరములకు పూర్వము మనదేశమున పడమట అరేబియా సముద్రము మొదలు తూర్పున బంగాళాఖాతమువరకును విస్తరించి పంచనదదేశమును దక్షిణదేశమునుండి వేరుపరచుచు ఒకసముద్ర ముండెనని తెలిపి అప్పటి ప్రపంచనైసర్గికస్వరూపపటము నొకదానిని ఇచ్చియున్నాడు. తరువాత 30,000 సంవత్సరముల కాలపునాటి మనదేశపు నైసర్గికస్వరూపపటము మరియొక దానిని ఇచ్చి అందు నీ సముద్రముండిన ప్రదేశములలో భూభాగమును జూపియున్నాడు. ఈ 20,000 సంవత్సరములలో సముద్రము భూమిగా మారినదని యీతని అభిప్రాయము.

---

* Geology of India, London 1919. ♦ Outline of History.

## ఆర్య యుగము

### క్రీ॥ పూ॥ 50,000 మొదలు 600 వరకు

ఆధునిక చరిత్రకారులు సామాన్యముగ మనదేశచరిత్రను వేదములతో ప్రారంభింతురు. ఈ దేశమున నివసించిన ప్రజలను గూర్చి వేదములనుండి తప్ప ఇతర మార్గములనుండి మన కేమియు తెలియకుండెను. కాని, ఇటీవల సింధుదేశమునందు మోహంజోదారో, పంజాబునందు హారప్ప మొదలయిన ప్రదేశములందును, వాని పరిసరప్రాంతములందును త్రవ్వబడిన పురాతన దృశ్యములనుండిఇక్కడ నివసించిన ప్రజలయొక్క నాగరికతను గురించి ఇప్పుడు ఎక్కువగా తెలియుచున్నది.

ఆర్యులు మధ్య ఆసియానుండి యీదేశమునకు వచ్చిరనెడి సిద్ధాంతమును చరిత్రకారు లంగీకరించుటలేదు. ఋగ్వేదమునందలి వర్ణనలను బట్టి ప్రథమమున ఆర్యులు పంచనదప్రదేశమునం దుండిరనియు తదుపరి ఉపనిషత్తులు, బ్రాహ్మణములను బట్టి కాలక్రమమున తూర్పున విదేహము (బీహార్) వరకును, దక్షిణమున వింధ్యపర్వతములను దాటి అచ్చటచ్చట కొంతవరకును నాక్రమించిరని తెలియుచున్నది. ఇటుల ప్రసరించునపుడు వారు అచ్చటచ్చట కొన్నిరాజ్యములను స్థాపించిరి. అట్టివానిలో కురు, కాశి, కోసల, విదేహరాజ్యములు ప్రధానమయినవి. ఇట్టి ఆర్యుల వ్యాపకమునకు పైన సూచించిన భూగర్భశాస్త్రసంబంధమయిన నిదర్శనములను బట్టి 20,000 సంవత్సరములకు మించిన కాలము పట్టి యుండవచ్చునని తోచుచున్నది. ఆర్యులుండిన దేశమునకు ఆర్యావర్తము అని పేరు.

## ఆర్యుల సంతతి

ఆర్యశబ్దము గుణవాచకము గాని, జాతివాచకము కాదు. ఆర్యులనగా సాధుత్వము (మంచితనము) గలవారు. తాము నాగరికులమనియు కిరాతులు మొదలగు ఇతరజాతులవారు అనాగరికులనియు వీరు చెప్పుకొనుచుండుట వేదములలో చూడగలము. దైవసంపత్తు, అసురసంపత్తు అని మానవుల స్వభావములను ఆచారములను విభజించి భగవద్గీతలో * చక్కగా వర్ణింపబడియున్నవి. దేవతలు, రాక్షసులు ఒకజాతివారే. తండ్రిఒక్కడే; తల్లులు

* గీత 16 అ 1–8.

వేరు. వారల గుణదోషమును బట్టి తెగలు మారినవి. ఒక తెగవారు సౌమ్యులు. రెండవ తెగవారు క్రూరులు.

ఆర్యులలో కొన్ని తెగలవారు సింధునది ప్రాంతమునుండి గంగానది ప్రవహించెడి పల్లపుమార్గమున, తూర్పున బెంగాలు వరకును పోయి, వింధ్యపర్వతపంక్తిని తూర్పువైపుగా అచ్చట దాటి, తూర్పు కనుమలకును, సముద్రమునకును గల మధ్యమార్గముద్వార దక్షిణమున కన్యాకుమారి వరకును పోయి చేరిరని నమ్ముట కనేక నిదర్శనములు గలవు. ఒక నిదర్శన మెద్ది అనగా వీరు తూర్పునకును, దక్షిణమునకు పోవునపుడు వీరిలో కొన్ని తెగలవారు అచ్చటచ్చట నిలచిపోయిరి.* ఇప్పటికిని ఇటుల నిలచిన వారి వంశీయులు ఆ యా ప్రదేశములలో నివసించుచున్నారు. బెలూచిస్థానమున "బ్రాహుఇ" భాషలోను, తూర్పున బెంగాలు, ఒరిస్సా, ఆంధ్రరాష్ట్రములందును అందుండి దక్షిణమున కన్యాకుమారి వరకును దక్షిణహిందూ స్థానమున ప్రస్తుతము వ్యాప్తమైయున్న వివిధ దేశములవారు మాట్లాడుభాషలలోను కొన్ని సమానపదములను బట్టి వీరు ఆర్యావర్తము నుండియే వచ్చి రని యూహింపదగియున్నది. ఈ భాషాసామ్యమువలన వారు పయనమయివచ్చిన మార్గమును నిర్ణయింప బడినది.

## దేశములు, భాషలు

ఇదేప్రకారము రానురాను జనసంఖ్య అభివృద్ధియైన కొలది క్రమముగా చీలి హిందూదేశమునందు 56 దేశములును 56 భాషలును ఏర్పడెను. వీరందరు ఒకప్రజ అని ఋజువు పరచుటకు హిమాలయము మొదలు కన్యాకుమారి వఱకు ప్రతిదినము వీరు ఉపయోగించు ఈ క్రింది మహా, సంకల్పమే నిదర్శనము.

"అంగ, వంగ, కళింగ, (కాళింగ) కాశ్మీర, కాంభోజ, (కామరూప) సౌవీర, సౌరాష్ట్ర మహారాష్ట్ర,(బంగాళ) మగధ, మాళవ, నేపాళ, కేరళ, చోళ, పాంచాళ, గౌళ, మళయాళ, సింహళ, ద్రవిళ (ద్రావిళ), కర్ణాట, నాట, కర్నాట, మర్వాట, పానాట, పాండ్య,

* The Regional and Linguistic Structure of India. The Cultural Heritage of India Vol. 3. Page 123.

పుళిన్ద, అన్ధ్ర, హూణ, దశార్ణ, భోజ, కుక్కుర, కురు, గాంధార, విదర్భ, విదేహ, బాహ్లీక, బర్బర, కేకయ, కోసల, కున్తల, కిరాత, శూరసేన, సేవన, కొంకణ, కొంకణ, మత్స్య, మద్ర, పార్శ్వ, ఘూర్జర, యవన, జాలాంధ్ర, సాల్వ, చేది, సింధువత్యాద్యనేక విశేష దేశ భాషా భూమిపాలచిత్రితే......భరతఖండే*

ఇట్లు భరతఖండము అనేక దేశభాషలతోను భూమిపాలురతోను విరాజిల్లునట్లుల వర్ణింపబడియున్నది. ఇందును బట్టి హిందూదేశము క్రమముగా కల్పసూత్రముల నాటికి (క్రీ. పూ. 1000 మొదలు 500 వఱకు) 56 దేశములు గలిగి ఒకే ప్రజకు సంబంధించిన ఒకటే సంయుక్త రాష్ట్రమని తెలియుచున్నది.

ఐరోపా ఖండమువలె గాక భరతఖండము నైసర్గికముగా ఒకటే దేశము. అందలి కులములు, భాషలు వేరైనను హిందూస్థానీయత లేక భారత జాతీయత అనునది యొకటే. అది సనాతన మగు ఎడతెగని ప్రవాహము. ఈ ప్రవాహము నందు ఉపనదులుగా ఎన్నిమతములు, పంథలు, లేక మార్గములవారు చేరినను, ఒకటేప్రవాహమై, వారి వారి అచార వ్యవహారములలో అనేక భేదములున్నను, భారత జాతీయత అను మహాప్రవాహమున నేకమయి నప్పుడు, సముద్రమున నీటి బిందువు కలిసిపోయినట్లు, వ్యక్తిత్వము నశించి పోవును.

## సర్వమానవజాతికి పుట్టినిల్లు

భూగర్భ శాస్త్రజ్ఞుల బట్టికూడ దక్షిణదేశము మిక్కిలి పురాతనమైనదనియు, సింధుదేశము, అఫ్రికా, అస్ట్రేలియా, ఇవి యన్నియు దక్షిణ హిందూస్థానము, సింహళము, మలయా దీవులతో చేరి "లెమూరియ" యను ఒక పెద్ద భూఖండముగా నుండె ననియు, ఈ భూఖండములో చాల భాగము ఇప్పుడు సముద్రపుటడుగున నున్నదనియు తెలియుచున్నది. అరవభాషలోనున్న గాథలు గూడ కన్యాకుమారికి దక్షిణభాగ మంతయు మునిగిపోయి నట్లు చెప్పుచున్నవి. మెసపొటోమియాలోని సుమేరియనుల పురాతన నాగరికతకును, దాక్షిణాత్యుల పురాతన నాగరికతకును సంబంధము కనబడుచున్నది. ఈ సంబంధమును బట్టియు, అరవ

* కల్పసూత్రములు, వివాహకల్పము. (ఇందు పాఠభేదములు గలవు.)

భాషలోని ప్రక్రియగాధలను బట్టియు చూడగా హిందూదేశమునుండి కొంతమంది పశ్చిమమునకు పోయి సుమేరియను లైరనియు, మరికొందరు దక్షిణమునకుపోయి ద్రావిడులై రనియు తెలియుచున్నది. ఈ పురాతన నాగరికత ప్రస్తుతము కన్యాకుమారికి దక్షిణముననున్న సముద్రపు టడుగున పడిపోయి యుండవచ్చును.

అందుచే ఈజిప్టుదేశీయులు తమ పురాతననివాసములు తూర్పున నుండె ననియు, క్రీ.పూ. 4000 సంవత్సరముల క్రిందట ఈజిప్టునకును దక్షిణహిందూదేశమునకును వర్తక వ్యాపారములు జరుగుచుండెననియు చెప్పుకొందురు. ఇదిగాక అరవభాషయొక్క అతిపురాతనత్వము చూడ అది స్వల్ప కాలములో అభివృద్ధినందిన భాషయని చెప్పుటకు వీలులేదు. పాండ్యరాజుయొక్క గొప్ప రాజ్యభాగమును, అనేకపర్వతపంక్తులును, "పహ్రాలీ" అను పేరుగల నదియు, పురాతన మగు వాఙ్మయముతో పాటు సముద్రముయొక్క మహాకోపముచే మ్రింగబడిన వని చెప్పెడు అరవపురాణగాధలలో కొంత సత్యము కలదని తోచుచున్నది. పాండ్యరాజులు పాండవుల సంతతి వారను ప్రతీతికూడ ద్రావిడులు (తమిళులు.) కూడ ఆర్యులలో ఒక తెగ వారనెడి సిద్ధాంతమును బలపరచుచున్నది.*

తిరునల్వేలిజిల్లాలో త్రవ్వబడిన ఆడిచనల్లూరు♦ అను గ్రామమునందలి పురాతన కాలపుగుర్తులనుబట్టి క్రీ॥ పూ॥ 5 లక్షలు మొదలు 50,000 సంవత్సరముల మధ్యకాలమున ఇచ్చట మానవులు నివసించినట్లు భూగర్భశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. మన పంచాంగములను బట్టి సృష్ట్యాదినుండి ఇప్పటికివరకు (1942) 195, 58, 85,043 సంవత్సరము లైనది. కలియుగాదినుండి 5,043 సంవత్సరములైనట్లును తెలియుచున్నది. హిందూదేశమే సర్వమానవజాతికి ప్రప్రథమమైన "పుట్టినిల్లు" అను అభిప్రాయము ధ్రువమగుచున్నది.

## పురాతన నగరములు

మోహన్‌జోదారో, హరప్పా మొదలగు పురాతన పట్టణములు భూమిలోనుండి బయలుదేరిన తరువాత హిందూదేశపు చరిత్ర తిరిగి వ్రాయ

* ది కల్చరల్ హెరిటేజ్ అఫ్ ఇండియా. పేజి 677. మూడవ సంపుటము. ♦ డిటో పేజి 64 Palæolithic age, ప్రాచీన శిలాయుగము.

వలసి వచ్చినది. వేదములు మూడు వేల సంవత్సరములనాటి వని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసినవ్రాతలు నిరాధారములైన వని ఇప్పుడు ఋజువు పడినది. ఈ వేదములు కనీసము పదకొండు వేల సంవత్సరములకు పూర్వపు వని ఒక విధముగా సిద్ధాంతీకరింపబడినది. పదకొండు వేలు అనవేల? వేదములలో కొంతభాగమున వర్ణించినది చూడగా ఇప్పటికి 50 వేల సంవత్సరములకు పూర్వమున్న తూర్పు సముద్రము ఆర్యావర్తమునకు దక్షిణపు సరిహద్దుగా నున్నట్లు కనబడుచున్నది. కాబట్టి, వేదములు 50 వేల సంవత్సరములకు పూర్వపువి ఐనను కావచ్చును. తరువాత కాలపు కొన్ని వర్ణనలు చూడగా సముద్రము మాయమై ఎడారులు బయటపడుటచూచి యుంటిమి.

## ఇండ్లు

మోహంజోదారో అనే దిబ్బ ఇప్పుడు భూమిపై 70 అడుగుల ఎత్తు ఉన్నది. అందు 7 పొరలుగా ఒక పొరపై మఱియొక పొర చొప్పున బహుజనసంకీర్ణము లగు పట్టణములు పుట్టి, పెరిగి, నశించినట్లుగా కనబడుచున్నది. ఈయేడు పొరలలో అడుగు పొర 120 అడుగులలోతున నున్నది.

హారప్పాలో ఒక్కొక యిల్లు పునాదులలో 162 అడుగుల పొడుగు గలిగి, అందు కొన్ని గదులు 57 అడుగుల పొడుగును, 17 అడుగుల వెడల్పును గలిగి మధ్య మధ్య చిన్నచిన్న గదులతో కూడియుండెను. అందు ఒక పెద్ద సభామంటపమునకు క్రిందినుండి పైకి మెట్లు కనబడినవి. ఈమందిరముల గోడలు కొన్ని పునాదులలో 9 అడుగుల దళసరిగ నుండి కాల్చిన ఇటుకలతో కట్టబడి యున్నవి. రెండు ఇటుక ఆవములుగూడా కనబడినవి. ఈ ఇండ్లలో చక్కని స్నానపు గదులును, ఒక్కొక్క గదిలో నుండు తూము కాలువలును ఇప్పటికిని కనబడుచున్నవి. ఈ గదులు చక్కగా చప్టా చేయబడి తూము కాలువలు ఉన్న వైపునకు వాటముగా కట్టబడి యుండి, వెలుపలకు పోయిన కాలువ వీథిలోని కాలువకు చేర్చి కాల్చినకుండ గొట్టములతో, ప్రస్తుతపు పట్టణములలో నుండు మురికి కాలువలగొట్టముల వలె నిర్మింపబడి యున్నవి. కొన్నిచోట్ల పై అంతస్థునన్న స్నానపు గది యొక్క తూము కాలువలో నుండి క్రింది అంతస్థులో నుండు స్నానపు గదిలోని కాలువకును, అక్కడనుండి వీథిలోని కాలువకును గొట్టములు గలవు. ఒకచోట 6 అడుగుల ఎత్తు లోపలికొలత గల పెద్ద మురుగు కాలువ భూమిలో కనబడినది. ఈ కాలువను ఇటుకతో కట్టి దీని ప్రక్క

గోడ ఎంతో చతురతతో నిర్మించిరి. ఇంత విచిత్రమైన ఇండ్ల వసతులు ఆ కాలమునాడే హిందూస్థానమునందుండెను అని చెప్పిన తరువాత అప్పటి నాగరికతను ఇంకను ఎట్లు వర్ణింపనగును? ఈ వర్ణనలు చూడగా చరకములోని ఉపకల్పనీయ అధ్యాయమునందలి ఆతురాలయముల నిర్మాణమును, అందలి వర్చస్థానము, స్నానభూమి, మహానసములును జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఇందు కొన్ని మందిరములు ఆతురాలయములు (Hospitals) కావచ్చును.

## మతము

అప్పటి వారి మతములనుగూర్చి గూడ అభిప్రాయభేదములు ఉన్నవి. వర్షాధిపతియగు ఇంద్రుని, ఋతువుల కధిపతియగు సూర్యుని, నీటి దేవతయగు వరుణుని, సర్వపావనులగు అగ్నివాయువులను, ఓషధుల కధిపతి యగు చంద్రుని, దేవతావైద్యులగు అశ్వినీకుమారులను భిషక్తమ భిషక్ *అగు రుద్రుని ఆర్యులు స్తుతించుచు వచ్చిరని వేదముల నుండి మనకు తెలియుచున్నది. ఐతే మోహంజోదారోలో దొరికిన వస్తువులను బట్టి చూడగా, కొందఱు విగ్రహారాధకులును, వారితో బాటు శక్తిపూజాపరులును, యోగాభ్యాసకులును, లింగము, పానవట్టమును పూజించు శైవమతస్థులును, నాగులను పూజించువారును - ఇట్లు అనేక సంప్రదాయములకు చేరినవారు ఈ పట్టణమునందు ఆ కాలమున నివసించి నట్లు అక్కడ దొరికిన విగ్రహములు, బొమ్మలు, ముద్రలను (సీళ్లను)బట్టి ఊహింపదగియున్నది. పెద్దపెద్ద మంటపములను చూడగా ఇవి యజ్ఞ మంటపము లని తోచుచున్నది. యజ్ఞపరికరములను జ్ఞాపకమునకు తెచ్చు గుర్తులును కొన్ని కలవు. ఒకచోట ఒకయోగి ఏకాగ్రచిత్తముతో తల, మెడ, వెన్నెముక నిటారుగా నిగిడించి కూర్చొని, కండ్లు సగము మూసుకొని, నాసికాగ్రమున దృష్టి నిలిపి, తపస్సు చేయుచున్నట్లు ఒక సున్నపురాతి విగ్రహము గలదు. ఇదంతయు చూడగా హిందూస్థానమునందు పది పదునైదువేల సంవత్సరములకు పూర్వమే అనేకమతస్థులును, అనేకతరగతుల నాగరికత గలవారును, తమ తమ సంప్రదాయములను బట్టి వివిధమతాచారముల నవలంబించుచు, ఇప్పటివలెనే ఒక్కచో

* వైద్య శ్రేష్ఠులకు వైద్యుడు.

నివసించి యుండిరని తెలియుచున్నది. యజ్ఞములు చేయువారును విగ్రహారాధకులును ప్రక్క-ప్రక్కల నుండిరి.

అప్పటికే నావికా వ్యాపారములు జరుగుచున్నట్లును, దక్షిణదేశమునుండి ముత్యములు, కురువిందములు మొదలగు మణులను రప్పించు చుండిరనియు, పశ్చిమదేశములకుగూడ వ్యాపారము నిమిత్తమై పోవుచు వచ్చుచుండిరనియు నిదర్శనములు గలవు. గాజులు, కంకణములు, హారములు మొదలగు నగలను స్త్రీలు తఱచు ఉపయోగించు చుండిరని తెలియుచున్నది. లిపి, ముద్రలుగల నాణెములు మొదలగువవి వాడుకలో నుండెను. కుడినుండి ఎడమకు వ్రాయునదియు, ఎడమనుండి కుడికివ్రాయునదియు రెండు లిపులున్నట్లు తోచుచున్నది.

అశ్వత్థ వృక్షము, బిల్వపత్రముకూడ పవిత్రములుగా నుండినట్లు కనబడుచున్నది. హిందూనాగరికత పాశ్చాత్యదేశములనుండి వచ్చినదని చెప్పువారలు ఇవియన్నియు పశ్చిమదిక్కు-నుండియే హిందూదేశమునకు వచ్చినవని చెప్పుట సాహసము. ఇచ్చటి ప్రజలు తూర్పునకేగాక, దక్షిణమునకును, పశ్చిమమునకును, ఉత్తరమునకునుగూడ తమ నాగరికతను వ్యాపింపజేసి యుందురని చెప్పుట సమంజసము.

## కర్మకాండ

మోహంజోదారో మొదలగు శిథిలములైన పట్టణములనుండి మనము తెలసుకొను విషయములు అటుండగా, వేదములనుండి మనము గ్రహింపదగిన విషయములను విమర్శించుటచే అప్పటి ప్రజలు మొట్టమొదట సూర్యచంద్రాది నైసర్గిక దేవతలను స్తుతించు వారైనను, క్రమముగ యజ్ఞయాగాది కర్మకాండయొక్క- ఆర్భాటము హెచ్చైనట్లు కనబడు చున్నది. బ్రాహ్మణములను బట్టి చూడగా ఈ క్రతువులను చేయు తంతు క్రమ క్రమముగా పెరిగిపోయినట్లును, ఒక్కొ-క్క-రు వారివారి ఇండ్లలో చేసికొను శ్రౌతకర్మలు విరివియై ఒకపురోహితునికి బదులు మొదట నలుగురును, తరువాత ఏడుగురును, క్రమముగా పదహారుగా పెరిగి, బ్రాహ్మణుల అధికారము ఎక్కు-వయ్యెను. కొంతకాలమునకు పశువధ మున్నగు హింసాకరములగు కర్మలు ప్రజలలో అసంతృప్తి గలుగుటకు హేతుభూతములయ్యెను. అంతట ఋషులు కొందఱు ఈపద్ధతిని వదలి వేదాంత

మార్గమును ఉపనిషత్తుల మూలముగా ప్రచారపరచుటకు ప్రారంభించిరి.

"ఏకం సద్విప్రా బహుధా వదంతి"*

ఆదిత్యునే ఇంద్రునిగాను, వరుణునిగాను, మిత్రునిగాను, అగ్నినిగాను రుద్రునిగాను చెప్పుదురు. మేధావంతులు ఒకే సత్పదార్థమును (పరమాత్మను) అనేక విధములుగా వర్ణింతురు అని అర్థము.

ఇట్టి వాక్యములతో యజ్ఞయాగాదులను నిరసించి, నిర్గుణుడగు పరబ్రహ్మమును తెలుసుకొనుటయే ముఖ్యమని ఉపనిషత్తులలో ధ్రువపరచిరి. ఉపనిషత్తుల ప్రబోధము ఎక్కువైన కొలదిని, కర్మకాండము యొక్క ప్రాముఖ్యము ఈ దేశమున తగ్గినట్లు కనబడుచున్నది.

---

# 3. బౌద్ధయుగము.

(క్రీ. పూ. 600 - క్రీ. శ. 300)

---

[విషయసంగ్రహము: బౌద్ధయుగము - 1. బౌద్ధమతము: హిందూ బౌద్ధధర్మముల సామ్యము - కర్మ - ఆత్మ - ముక్తికి ఉపాయములు గృహస్థులగు ఉపాసకులు - 2. జైనమతము - 3. వైష్ణవమతము - పాంచరాత్ర సిద్ధాంతము - 4. శైవమతము - శాక్తము - రామాయణ, మహాభారతములు - హీనయాన, మహాయానములు - నాగార్జునుడు - మతవిప్లవము - సూత్రములు - షడ్దర్శనములు - ఆంధ్రరాజులు - కనిష్క మహారాజు - బౌద్ధమతపతనము].

---

మనకు తెలిసిన చరిత్రాత్మకమైన సరిహద్దు పాణినికృతమైన వ్యాకరణ మని చెప్పవచ్చును. ఈతని కాలము క్రీ. పూ. 750 అని డాక్టరు భండార్కరుగారు నిర్ణయించియున్నారు. ఇప్పటినుండి చరిత్రాంశములు

* ఋగ్వేద 1—164.

నిశ్చయముగా తెలియుచున్నవి. బౌద్ధయుగమును ఈ కాలమునుండి రమారమి క్రీ. శ. 300 సంవత్సరముల వఱకు నిర్ణయించి యున్నాము.

## (1) బౌద్ధమతము

గౌతమబుద్ధుఁడు అదివఱకే ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన అహింసామార్గమును గూర్చియే ప్రచారము చేసినను, వేదముల ప్రమాణము అంగీకరించక పోవుటచే, అతని మతము క్రొత్తమతముగా ఏర్పడెను. బుద్ధుడు నీతిమార్గములకు ప్రాముఖ్యమును ఇచ్చుటచేతను, అతడు ఉపదేశించిన మోక్షమార్గము సులభముగా కనిపించుటచేతను, బుద్ధుని మతము అతివేగముగా దేశమందంతటను వ్యాపించెను. బుద్ధుని నిర్వాణము క్రీ పూ. 473 అని చెప్పబడుచున్నది. ఇతడు 80 సంవత్సరములు జీవించినట్లు నిదర్శనములు గలవు. ఇతడు 35 వ సంవత్సరమున బుద్ధత్వము చెందినట్లు తెలియుటచేత బుద్ధుడు ప్రచారము చేసిన కాలము క్రీ. పూ. 528 మొదలు 473 వఱకు ఉండవచ్చునని తోఁచుచున్నది. కొందరు బుద్ధుడు క్రీ.పూ. 543 లో నిర్యాణము చెందెనందురు.(గీ. ర. ఆంగ్ల. 802)

## హిందూ, బౌద్ధధర్మముల సామ్యము

భగవద్గీతలోని హిందూధర్మములకును, బౌద్ధ గ్రంథములలోని ధర్మములకును గల పోలికను కొంచెము శ్రద్ధగా పరిశీలించినయెడల బౌద్ధమతము హిందూధర్మములమీద ఎంతవఱకు ఆధారపడియున్నదో తెలియగలదు. నిర్వాణమునకు అర్హతనొందిన బౌద్ధయతి కుండెడి లక్షణములు ధమ్మపథ (360–423) మందును, స్థితప్రజ్ఞ (20. 5-72), బ్రహ్మనిష్ఠ (4. 19–23; 5. 18 – 28), భక్తియోగి(12. 13-19)—వీరికి గీతయందును ఒకటిగా కనబడుచున్నవి. బౌద్ధభిక్షువుయొక్క లక్షణములలో శాంతము, నిష్కామత, నిర్మమ, నిరాశత, సుఖదుఃఖసమత్వము, అనారంభము, అనికేతత్వము (ఇల్లులేకుండుట) సమనిందాస్తుతిత మొదలగునవి ధమ్మపద (40, 41 – 91) సుత్తనిపాతము (సుత్త 7-14), వినయపిటిక, చుల్లవగ్గ (7. 47) లందు గలవు. ఈ పదములన్నియు భగవద్గీతలోను బౌద్ధ గ్రంథములలోను సమానముగ నున్నవి.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ"*
'జ్ఞానికి ఏది ప్రకాశవంతమో అదే అజ్ఞానికి చీకటిగానుండును' అనే అర్థమే ద్వయతానుపస్సన్నసుత్తమునందు 40 వ శ్లోకములో కనబడుచున్నది. ఇటులనే అనేకస్థలములందు గీతయందు కనపడుభాగములు బౌద్ధగ్రంథములందు విరివిగా కనపడుచున్నవి.

తండ్రినుండి తనకు కావలసినదంతయు తీసికొని విడిపోయిన కుమారుడెట్లో - అట్లే బౌద్ధమతస్థులుగూడ హిందూమతమునుండి తమకు ఏవి కావలసియున్నవో అవి అన్నియు తీసికొని, విడిపోయి తరువాత వారి ఇష్టప్రకారము మార్పులు చేసికొనియున్నారు. గౌతమబుద్ధుడు బుద్ధత్వము నొందక పూర్వము సన్యాసిరూపమును ధరించి అరాడ కాలపుడు, రుద్రిడు మొదలగు ఆచార్యులవద్ద హిందూశాస్త్రమును చక్కగా నభ్యసించెను. బౌద్ధగ్రంథములనుండి చూడగ బుద్ధుడు చతుర్వేదములయందును, వేదాంగములయందును, వ్యాకరణ, జ్యోతిష, ఇతిహాస, నిఘంట్వాది (వైద్యశాస్త్రము) శాస్త్రముల యందును పండితులైన బ్రాహ్మణ సన్యాసులతో చర్చించి, వారలను తన మతములో కలుపుకొనెనని గలదు. అందుచేత ప్రవృత్తిమార్గమగు కర్మకాండయును, నివృత్తిమార్గమగు జ్ఞానకాండయును రెండును తఱచిచూచి తుదకు నివృత్తిమార్గమును అనగా సన్యాస మార్గమును బుద్ధుడు స్వీకరించెనని చెప్పవచ్చును.

## కర్మ

"కమ్మనా వత్తతీ లోకో, కమ్మనా వత్తతీ పజా (ప్రజా)
కమ్మ నిబంధనా సత్తా (సత్వాని),రథ స్సాఽణీవ యాయతో"
(సుత్తని: వాసేఠసుత్త 61.

అర్థము : ప్రపంచమును, అందలి ప్రజలును కర్మవిపాకముచే కాలమును గడుపుచుందురు. పరుగెత్తుచుండు రథముయొక్క గమనము దాని ఇరుసు నాధారము చేసుకొని ఎట్లు ఏర్పడుచున్నదో అదే ప్రకారము సృష్టియందలి సమస్త పదార్థములును కర్మచే బంధింపబడు చున్నవి. ఈ ప్రకారము బౌద్ధులు కర్మసిద్ధాంతమును; బ్రహ్మ, ఇంద్రుడు, మహేశ్వరుడు,

* భ. గీ. 2—69.

యముడు మొదలగు వైదిక దేవతలను; స్వర్గ, పాతాళాది లోకములను అంగీకరించిరి. అందుచేతనే వేదాంతమునందలి నామరూపములు, కర్మవిపాకము, అవిద్య, ఉపాదానము, ప్రకృతి మొదలగు శాస్త్రీయపదములను, వేదములందలి కొన్ని పురాతన సంప్రదాయములను బౌద్ధగ్రంథములలో చూచుచున్నాము.

## ఆత్మ

నామరూపాదులుగల సంసారము అనిత్యమై నశించుననియు, కర్మచే బద్ధమై జగత్తంతయు పరిణమించు చున్నదనియు బుద్ధుడు అంగీకరించినను, దీని కంతకును కారణముగా నిత్యమై, సర్వవ్యాపియైన పరమాత్మ తత్వమును మాత్రము బుద్ధుడంగీకరించలేదు. ఇదియే రెండుమతములకు గల భేదము. "ఆత్మ లేక బ్రహ్మము కేవలము మిథ్య. ఆత్మానాత్మవిచారము చేయుచు ఎవరును కాలమును వృథాపుచ్చకూడదు" అని బుద్ధుడు చెప్పెను. (సబ్బాసవ, సుత్త 9-13). మిళింద ప్రశ్నమునందు కూడ ఆత్మ సత్పదార్థము గాదని చెప్పబడియున్నది. * (2-3-6;0-7-15).

## ముక్తికి ఉపాయములు

దుఃఖమయమగు సంసారచక్రమునుండి విముక్తినొందుటకు బుద్ధుడు ఈక్రింది ఉపాయములను చెప్పెను. చతురతగల వైద్యుడు రోగములను కుదుర్చుటకు పూర్వము రోగకారణములను తెలుసుకొనిన తరువాత చికిత్సకు ప్రారంభించునట్లే, బౌద్ధజిజ్ఞాసువు సంసారదుఃఖము లనెడి రోగములు కుదుర్చుకొనుటకు ముందు, ఆ దుఃఖములకు మూలకారణములను తెలిసికొని ఆ మూలకారణములను విచ్ఛేదము చేయవలెను. జగత్తునందున్న సర్వదుఃఖములకు తృష్ణ (కోరిక) లేక వాసన మూలకారణము. ఇంద్రియనిగ్రహము చేతను, ధ్యానముచేతను, వైరాగ్యముచేతను తృష్ణ పూర్ణముగ నశించిన పిదప, భిక్షువుగ మారుట యనునదియే సత్యమగుమార్గము. సన్న్యాసముచేతనే స్థిరమగు శాంతిసుఖము ప్రాప్తమగును అని బుద్ధుడు చెప్పెను. ఉపనిషత్తులలోగూడ బ్రహ్మయందు ఆత్మను లయముచేసికొనుట అనగా మనస్సుయొక్క నిష్కామావస్థనే ఆత్మనిష్ఠ, బ్రహ్మసంస్థ, బ్రహ్మనిర్వాణము

* "మీనాండర్" అను గ్రీకురాజు నాగశయనుడను బౌద్ధభిక్షువు వలన పొందిన ఉపదేశములు - ఇది మిళిందప్రశ్న. (కీ. పూ. 150)

(గీత 5-17-25; ఛాం. 2-23-1) అని చెప్పియున్నారు. బుద్ధుడు దానికి కేవలము నిర్వాణము అని మాత్రమే పేరుపెట్టి, దీపము ఆరిపోయినట్లు వాసనలు నశించునని బోధించెను. నిర్వాణమనునది మరణముయొక్క మరణము; ఉపనిషత్తులలో చెప్పినటుల మృత్యువును దాటుటకు గల మార్గము. ఈ స్థితిని బొందిన వానికి, వదలివేయబడిన కుబుసముపై పామునకు ఎట్లు మమకారము ఉండదో - అట్లే తన శరీర మను ఊహ కూడా ఆత్మనిష్ఠుడైన పురుషునకు ఉండదని బృహదారణ్యకోపనిషత్తులో 4-4-7 లో ఈయబడిన దృష్టాంతము బౌద్ధభిక్షువులు "సుత్తనిపాతము" అను గ్రంథమునందు "ఉరగసుత్త"లో స్వీకరించిరి.

## గృహస్థులగు ఉపాసకులు

ఇట్లు సన్న్యాసపరముగా బుద్ధుని ధర్మములు ఉన్నను, గృహస్థాశ్రమమున నుండువారు గూడ "బుద్ధం శరణం గచ్ఛామి" "ధర్మం శరణం గచ్ఛామి" "సంఘం శరణం గచ్ఛామి" అని సంకల్పముచెప్పి, ఈ మాటియందును విశ్వాసము గలవారు సన్న్యాసాశ్రమము గ్రహింపకయే, ఉపాసకులుగా చేరవచ్చును. అహింస, సత్యము, అస్తేయము, సర్వభూతదయ, ఆత్మౌపమ్యదృష్టి, శౌచము, సత్పాత్రదానము మొదలగు ధర్మములను ఉపాసకులకు బుద్ధుడు బోధించెను. బుద్ధధర్మములందు వీనికి శీలము అని పేరు. ఈ ధర్మములను బుద్ధుడు ప్రాచీన స్మృతి గ్రంథములనుండి గ్రహించెనని మనము కొంచెము విచారించిన తెలియగలదు. బుద్ధుడు "బ్రాహ్మణ ధమ్మిక సుత్తము"నందు ప్రాచీన బ్రాహ్మణులస్తుతిని స్వయముగనే చేసియున్నాడు. మనుస్మృతియందలి ఈ క్రిందిశ్లోకములు అక్షరమైన మార్పు లేకుండ ధమ్మపదమందు కనబడుచున్నవి. *

"అభివాదన శీలస్య, నిత్యం వృద్ధోపసేవినః
చత్వారి తస్య వర్థంత, ఆయుర్విద్యాయశోబలమ్" (మను.2-121)

నిత్యమును వృద్ధులను సేవించువారికని. . పెద్దలకు అభివాదనము (మర్యాద) చేయువారికిని, ఆయువు, విద్య, యశస్సు, బలము - ఈ నాలుగును వృద్ధియగును.

* ధమ్మపద 109-131

"యోఽహింసకాని భూతాని హిన స్త్యాత్మసుఖేచ్ఛయా,
స జీవంశ్చ మృతశ్చైవ న క్వచి త్సుఖ మేధతే" (మను. 5-45)

ఎవడు ఇతరులను ఉపద్రవపెట్టని జింకలు మొదలగు జంతువులను తన సుఖము కొరకై హింసించునో, అట్టివాడు జీవించియుండియు మరణము జెందినవాడే. అట్టివాడు బ్రతికియుండియు, చచ్చియు ఎచ్చటను బాగుపడడు.

దీనిని బట్టిచూడ బౌద్ధమతము కొన్నిమార్పులతో నేర్పడిన హిందూ మతమే అని స్పష్టము కాగలదు.

## (2) జైనమతము

రమారమి ఇదే సమయమున వర్ధమాన మహావీరుడు జైనమతమును ప్రచురపరచెను. మహావీరునకు పూర్వము 23 రు తీర్థంకరులు ఉండిరనియు అందు 23 వ తీర్థంకరుడు మహావీరునకు పూర్వము 250 సంవత్సరములకు ముందు ఉండెననియు జైనసంప్రదాయపు చరిత్రలు చెప్పుచున్నవి.

మహావీరుడు వైశాలిపురమునందు క్రీ. పూ. 555 సంవత్సర ప్రాంతమున క్షత్రియ కుటుంబమున జన్మించెను. ఈతడు 30 ఏండ్ల వయస్సున సర్వసంగత్యాగము చేసి పారసనాథులను సన్యాసులతో కలిసి రెండు సంవత్సరములుండెను. తరువాత నాతడు, స్వతంత్ర మతమును స్థాపించి నలుబది యేండ్లవరకును ధర్మోపదేశము చేసెను. క్రీ పూ. 490 లో పరమపదము నొందెను. జైనులు (1) వేదములను నమ్మరు. (2) వీరి సిద్ధాంతము ప్రకారము సర్వేశ్వరు డొకడు కలడు. అతడు సర్వశక్తిమంతుడయ్యును, తటస్థునివలెనుండును. మనలను రక్షింపడు. శిక్షింపడు. మన సదాచారములు, దురాచారములే మనలను రక్షించును, శిక్షించును. (3) సృష్టియు జీవులును అనాదులు. వినాశము చెందునవి కావు. (4) తీర్థంకరులను, గురువులను దేవతలకంటె నెక్కుడుగా భావించి వారి ప్రతిమలను వీరు పూజింతురు. (5) అహింసయనునది అన్ని వ్రతములలో వీరికి గొప్పది. రాత్రి భోజనము చేసినచో చీకటిలో జీవకోటికి హింసకలుగునేమో అని సూర్యాస్తమయము కాకపూర్వమే భోజనము చేయుదురు. వడియబోయని నీరును త్రాగరు.

వీరిలో మొట్టమొదట జాతిభేదములు లేక పోయినను, కొంత కాలమునకు దిగంబరులనియు, శ్వేతాంబరులనియు రెండు తెగలు ఏర్పడెను. ఈ మతము క్రమముగా దక్షిణదేశమునకు ప్రసరించి, 9వ శతాబ్దమున పశ్చిమ తీరమునను, మైసూరురాజ్యము నందును ప్రబలము చెందెను. అరవ, కన్నడ భాషలయందు జైనులు చక్కని గ్రంథములను వ్రాసియున్నారు.

## (3) వైష్ణవ మతము

కృష్ణుడను పేరు ఛాందోగ్యోపనిషత్తులో మొట్టమొదట కనబడుచున్నది. ఇతడు దేవకీ కుమారుడనియు ఘోర ఆంగిరసుని శిష్యుడనియు తెలియుచున్నది. కృష్ణుడు తన గురువువద్ద నేర్చుకొనెనని చెప్పినవిషయములలో భగవద్గీతలోనున్న ముఖ్యసిద్ధాంతములు కనబడుచున్నవి. ఈ సిద్ధాంతములే భాగవతమతమునకు పునాదులుగా తోచుచున్నవి. ఛాందోగ్యోపనిషత్తులో కృష్ణునిగూర్చి చెప్పిన దానినిబట్టి చూడగా జిన, గౌతమబుద్ధులకు చాల కాలము పూర్వమే, అనగా క్రీ. పూ. 1400 లకు పూర్వమే (గీ. ర. తె. 752) ఈ భాగవతమతము ఉండెనని తెలియుచున్నది. కృష్ణుడు చారిత్రక పురుషుడు కాడని కొందరి మతము. ఐనను, మధురానగరనివాసి యగు వాసుదేవకృష్ణుడు సాత్వతులు అను క్షత్రియజాతికి చెందిన యాదవకుటుంబములోని మానవుడే యనియు, ఈ యాదవ కుటుంబము పేరు బ్రాహ్మణములలో గూడ గలదనియు,ఇప్పుడు చారిత్రకమైన నిదర్శనములు కనబడుచున్నవి. కాని గోపికాలోలుడును, రాధాప్రియుడును అగు కృష్ణుడు-హరివంశము, పురాణములలోనే తప్ప అంతకు పూర్వము కనబడుటలేదు. కాబట్టి వైష్ణవ మతమునందు రమారమి 1000 సంవత్సరముల తరువాత గలిగిన ఈ మార్పుల గమనింపనగును.

ఇదికాక భాగవత మతముయొక్క మూలసిద్ధాంతములు అసలుభారతములో (క్రీ. పూ. 1000) నారాయణోపాఖ్యానము నందు కనబడుచున్నవి. భగవద్గీతయు ఈ భారతము నందు కలదు. క్రీ. పూ. 400 నాటికి భారతము మహాభారత మయ్యెను. భగవద్గీత నాటికే వేదములలో చెప్పిన కర్మకాండయందు అసంతృప్తియు, వేదముల యొక్క ప్రామాణ్యమును నిరసించుటయు కొంతవఱకు స్పష్టముగా తెలియుచున్నవి. నిర్గుణుడగు పరమాత్ముడు

బను లు సగుణు డగు ఈశ్వరుని భక్తితో నారాధించుటయు, ఉపనిషత్తుల లోని కేవల జ్ఞానమార్గముకంటె భక్తిమార్గమున మోక్షమును సంపాదించుట సులభమైన ఉపాయమనియు, జంతుహింసతో గూడిన యజ్ఞయాగాదుల వలన అంతగా ప్రయోజనములేదనియు, భాగవతులుఎక్కువగా ప్రచారము లోనికి తెచ్చిరి. కాని, భాగవతులు బౌద్ధులవలె వేదబాహ్యులు గాక సంప్రదాయసిద్ధమైన వర్ణాశ్రమ ధర్మములను బలపరచిరి. అందుచేత కొంత వఱకు వేదములపై తిరుగుబాటుగా నుండినను, హిందూధర్మములో వైష్ణవ మతము సంపూర్ణముగా తరువాత లీనమగుటకు అవకాశముండెను. వీరి మత గురువగు శ్రీకృష్ణుడు భగవంతుడగు విష్ణువుయొక్క అవతారముగను, నర నారాయణులే అర్జున కృష్ణులుగ ఎంచబడిన పిమ్మట ఈ భాగవతమతము వైష్ణవమతముగా హిందూమతములో పూర్తిగా లీనమై పోయెను.

## పాంచరాత్ర సిద్ధాంతము

పాంచరాత్రిలసిద్ధాంత మనగా విష్ణువుయొక్క చతుర్ముఖ వ్యూహము నంగీకరించిన సిద్ధాంతము. వీరి సిద్ధాంతము ప్రకారము వాసుదేవుడు పరమేశ్వరుడనియు, సంకర్షణుడు జీవుడనియు, ప్రద్యుమ్నుడు మనస్సు అనియు, అనిరుద్ధుడు అహంకారము అనియు చెప్పుదురు. అందు వాసుదేవుడు శ్రీకృష్ణుడు. సంకర్షణుడు బలరాముడు. ప్రద్యుమ్నుడు శ్రీకృష్ణుని కుమారుడు. అనిరుద్ధుడు మనుమడు. భాగవత మతము శ్రీకృష్ణు డుదయించిన యాదవకులము వారిచే ప్రచారము చేయ బడినది. శ్రీకృష్ణుడు సాత్వతవంశమునకు చేరుటచే సాత్వతమత మనియు చెప్పబడుచు వచ్చెను. శ్రీకృష్ణుడు తన మిత్రుడగు అర్జునునకు ఈ భాగవతమతమునే ఉపదేశించెను గాని ఈ మతము అంతకు పూర్వమే నారాయణీయమత మనియు, పాంచరాత్రమత మనియు వివిధనామము లచే చెప్పబడుచుండిన పూర్వకాలపు భాగవతమతమే గాని క్రొత్తమతము గాదు అని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. *

## (4) శైవ మత ము

శ్వేతాశ్వతరఉపనిషత్తులో శైవమతము నందలి సగుణుడగు ఈశ్వ

* గీతారహస్యము, ఇంగ్లీషు, 756 పేజి.

రునిగూర్చి ప్రారంభసూచనలు గలవు. ఋగ్వేదమునందు రుద్రుడు ఒక క్రూరదేవతగా వర్ణింపబడి అతని కోపము తీర్చుటకై కొన్ని స్తుతికీర్తనలు గలవు. తైత్తిరీయసంహితలో రుద్రుడు క్రూరుడుగాను, మంగళకరుడుగాను కూడ వర్ణింపబడియున్నాడు. శుభముల నిచ్చు సందర్భమున శివశబ్దము పర్యాయపదముగా వాడబడినది. తరువాత చారిత్రకముగా శైవమతము రెండవశతాబ్దమునకు చెందిన పతంజలినాటికి (క్రీ. పూ. 150) స్పష్టముగ కనబడుచున్నది. అప్పటికి వీరికి శివభాగవతు లనిపేరు. మహాభారతములో నారాయణీయోపాఖ్యానమున పాశుపతశాఖకు చెందిన శైవులగూర్చి గలదు. ఉమాపతి యగు శివుడు స్వయముగా వీరి మతధర్మములను బోధించినట్లు గలదు. స్వయముగా అని చెప్పుటచే ఈ ఉమాపతి మానవుడే యనియు, తరువాత శివునిఅవతారముగా నీతడు అంగీకరింపబడెననియు చెప్ప వచ్చును. వాయుపురాణము 23 వ అధ్యాయమునందును, లింగపురాణము 24వ అధ్యాయమునందును యదువంశమున వాసుదేవుడు పుట్టినప్పుడు శివుడు బ్రహ్మచారిగా "నకులేశు"డను పేర బరోడా ప్రాంతములో ఇప్పుడు "కర్వన్"అను స్థలముగా నిర్ణయింపబడిన "కాయావర్ధన"మను గ్రామము నందు అవతరించెనని గలదు.*

శివునియొక్క మానవరూపమైన విగ్రహము క్రీస్తు తరువాత మొదటి శతాబ్దమధ్యమున వేమకేడ్ ఫిసిస్ అను చక్రవర్తి యొక్క నాణెములలో కనబడుచున్నది. ఇది శివుని అవతారమైన నకులేశుని యొక్క విగ్రహ ముగా తలపవచ్చును.

దక్షిణదేశమున క్రీ. వె. మొదటి శతాబ్దమున జరిగిన 3 వ మధుర సంఘమునకు "నక్కీరి"యను శైవాచార్యు డాధిపత్యము వహించెను. క్రీ.శ. 1,2 శతాబ్దములలోనే కాళహస్తి కొండలమీద శివభక్తుడగు కన్నప్ప యొక్క చరిత్ర భక్తి పూరితముగా నున్నది. ఇతడు వేటకాడగు రాజు. శివునికి అతిభక్తితో తాను తెచ్చిన మాంసాదులను అర్పించుచుం డెను. ఒకనాడు భక్త్యావేశముచే తన కంటి నొకదానిని పెరికి, శివునకర్పించి, రెండవకంటెని తీయుటకు సిద్ధపడుచుండగా, ఈశ్వరుడు ప్రత్యక్షమై, అతని భక్తికి మెచ్చి మోక్షమిచ్చెను. ఇతడు అరవదేశమున 63 శివభక్తులలో

*దికల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా, 3 వ సంపుటము, 16 పుట.

నొకడు. దీనినిబట్టి శైవమతమును, శివభక్తియు క్రీ. శ. 1-2 శతాబ్దముల నాటికి దక్షిణ దేశమున ఎక్కువగా ప్రచారములో నున్నట్లు తెలియగలను.

## శాక్తము

శక్తి సంప్రదాయమునందు శివుని భార్యయగు శక్తి ముఖ్యము. శాక్త సిద్ధాంతమును బట్టి పురుషుడు (శివుడు) ఏపని చేయడు. ప్రకృతి (శక్తి) సమస్తము పుట్టించునది; చేయునది. అందుచే శివునికంటెశక్తి బలవత్తరమైనది. ఈ శక్తిని, కాళి, తారా, షోడశి, దుర్గ, అన్నపూర్ణ, జగద్ధాత్రి, శారద, శ్రీవిద్యా, చండి, చాముండి మొదలగు అనేక పేర్లతో పూజింతురు. ఇందు కొందరిని శైవులు వైష్ణవులుకూడ పూజింతురు.

ఈసంప్రదాయమున మానవ శరీరమున మిక్కిలి సూక్ష్మమగు, అనేక నాడులును, ఒకదానిపైని నొకటిగా 6 చక్రములును కలవనియు, మంత్రశక్తిచే ఈ నాడులను మేల్కొలిపి అనేక మహిమలను పొందవచ్చుననియు చెప్పెదరు. శక్తిపూజ యందు జంతుబలులు, నరబలులుగూడ ఇచ్చెదరు. ముఖ్యముగా చక్రపూజయందు ఎందరు పురుషులుందురో అందరు స్త్రీలతో గూడ వలయాకారముగ కూర్చొని మంత్రముల నుచ్చరింప వలెను. మద్యము, (సారాయి) మాంసము, మత్స్యము, పేలాలు, స్త్రీ సంభోగము అను పంచతత్త్వములను అనుభవించవలెను అని చెప్పుదురు. దీనికి వామాచారము అని పేరు. ఈ వామాచారము నందు గూఢార్థములు ఎన్నియో కలవు. వీరికి మంత్రము (శబ్దము)లు, యంత్రములు, (రేఖాచిత్రములు, ముగ్గులు) ముద్రలు, (కరన్యాసములు,) నాదములు ప్రధానము. తంత్రశాస్త్ర గ్రంథములయందు వీటి వివరములు అన్నియుగలవు. వేదాంతమునందు వలెనే సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మలో లీనమగుట సాధకునికి అవశ్యము. వీరి సంప్రదాయమునందు ఉపయోగించు పదముల గూఢార్థములు తెలియనివారికి శాక్తానుకరణము అపాయకరము. తెలిసిన వారికి సులభమైన మోక్షమార్గము. శాక్త సంప్రదాయమునకు తాంత్రిక సంప్రదాయమనియు పేరు. సర్ జాన్ వుడ్రాఫ్ అను వారిచే రచియింపబడిన 'సర్పెంట్ పవర్' అను ఇంగ్లీషు గ్రంథమునందు కుండలినీయోగమునుగూర్చి వివరములు చూడగలరు. రాబోవు ద్వితీయ ఖండమున వర్ణనములందు కుండలినీయోగము చూడుడు.

ఈ సంప్రదాయమున సిద్ధిని పొందినవారు మంత్రశక్తిచే ఆశ్చర్యకరమైన మానవాతీతములైన కార్యములను చేయగలరు. శ్రీరామకృష్ణ పరమహంస తాంత్రిక సాధనానుసారముగా అద్వైత నిర్వికల్పమును "తోతపురి" అను మహాత్ముని గురు ప్రసాదమువలన పొందగలిగెను. జ్ఞానమార్గమునకు తాంత్రికమార్గము కర్మపథాభ్యాసమువంటిది. ఈ తాంత్రిక మార్గముకూడా అనాదినుండి హిందూస్థానమునందు ప్రచారములో నున్నట్లు నిదర్శనములు కలవు.

## రామాయణ, మహాభారతములు

ఇప్పటికే మహాభారతమును, రామాయణమును, క్రీ. పూ. 1000 నాటికే పుట్టి కొద్దిగా వ్యాప్తమయి యున్నను, పౌరాణికయుగము ఇంకను ప్రారంభము కాలేదు. క్రీ. పూ. 400 నాటికి ఈ రెండు గ్రంథములును బాగా ప్రచారములో నున్నట్లు కనపడుచున్నది. శ్రీ భగవద్గీత మొదటి భారతములోనిదే అనుటకు నిదర్శనములు గలవు. రామాయణములో గూడ ఒకటి, ఏడు కాండములలో మాత్రము శ్రీరాముడు విష్ణువుయొక్క అవతారముగ వర్ణింపబడియున్నాడు. ఈ కాండములు తరువాత పూర్తిచేయబడి సంపూర్ణముగా వైష్ణవగ్రంథమయినదని చెప్పవచ్చును. ఇందు గ్రీకులు, పార్థియనులు, శకవంశజులు అగు పరదేశీయుల నామము లుండుటచే ఈభాగము క్రీ. పూ. 2-వ శతాబ్దమునకు పూర్వపుది కాదని చెప్పవచ్చును. ఇవియును, ఇతర పురాణములును హిందూధర్మమును ప్రజలలో వ్యాపింపజేయుటకు ఎక్కువ కారణములయినవి అని ముందు అధ్యాయమున చూడగలరు.

## హీనయాన, మహాయానములు

ఇదేసమయమున (క్రీ. పూ. 321-296) చంద్రగుప్త చక్రవర్తి తాను జైనుడయి, జైనమతమును హిందూస్థానమందంతటను వ్యాపింపజేసెను. ఇతని మనుమడు అగు అశోక చక్రవర్తి (క్రీ పూ. 272 - 230) ఇంతకంటె హెచ్చుగా బౌద్ధమతమును ఎక్కువప్రోత్సాహముతో హిందూస్థానమునందే గాక ప్రపంచమంతటను వ్యాపింపజేసెను. కాని కనిష్కుని కాలమునాటికి (క్రీ. శ. రెండవ శతాబ్దము) బౌద్ధసిద్ధాంతములలో విభేదములు హెచ్చాయెను. క్రీ. పూ. నాలుగు, మూడు శతాబ్దముల నాటి పాళీగ్రంథముల ననుస

రించి హీనయానమతమును, తరువాత పుట్టిన సంస్కృత గ్రంథముల ననుసరించిన మహాయానమతమును వేర్వేరగుచు వచ్చెను.

## నాగార్జునుడు

ఈ మహాయానమతమునకు ప్రధానప్రవర్తకుడు ఆంధ్రదేశమున ప్రసిద్ధిజెందిన నాగార్జునుడు. ఈయన హిమాలయము దాటి బౌద్ధమతమును వ్యాపింపజేసిన వారిలో ముఖ్యుడు. గొప్ప రసాయనవేత్త. సుశ్రుతమునకు సంస్కర్తయు నీతడే అని చెప్పుదురు. ఇతడు క్రీ. పూ. మొదటి శతాబ్దమునందు ఉండెనని ఊహించుచున్నారు.

* ఈ నాగార్జునుడు రాహులభద్రుని శిష్యుడు. రాహులభద్రుడు ప్రథమమున బ్రాహ్మణుడై పిమ్మట బౌద్ధమత స్వీకారము చేసెను. నాగార్జున మహాయాన మతప్రచారమునకు ఇతని ఉపదేశములే కారణములని చెప్పుదురు.

హీనయానమతము ననుసరించి సృష్టికర్తయగు దేవుడులేడు. గౌతమ బుద్ధుడే పరమోత్తమపురుషుడు. అతని వాక్యముల ననుసరించుటచే మోక్షము (నిర్వాణము) గలుగును. మహాయానమతము ననుసరించి బుద్ధునే దేవుని అవతారముగ నెంచి అతని విగ్రహములను పూజించుట మోక్షసాధనమునకు ముఖ్యమని యెంచబడెను. హీనయాన మతమునందువలె కఠినమైన తపస్సు, యోగనిష్ఠ మొదలగునవి అవసరములేదు. మహాయాన మతమునందు మానవ సౌభ్రాతృత్వము, భూతదయ, అహింస మొదలగు నీతి మార్గములు ముఖ్యముగా నెంచబడుచుండెను. పరమార్థము అప్రత్యక్షమగు నిర్వాణము గాక కరతలామలకమగు మోక్షముగా మారెను. ఇట్లు క్రమక్రమముగా మహాయాన బౌద్ధమతములకును హిందూ మతమునకును విశేషమైన భేదము లేకుండనయ్యెను.

---

* గుంటూరుజిల్లాలో నాగార్జునకొండలో ఇతని అధ్యక్షతను విశ్వవిద్యాలయము ఒకటి స్థాపింపబడి విఖ్యాతిగాంచి యుండెను. తరువాత టిబెట్టులోని లాసానగరమున స్థాపింపబడిన విశ్వవిద్యాలయభవనము ఆంధ్ర విశ్వవిద్యాలయ భవనము ననుసరించినట్లు శాసన మొకటి అచ్చట చెక్కబడి యున్నదట. కాబట్టి ఆంధ్రదేశపు ఈ నాగార్జునుడే మహాయానమత ప్రచారకుడని స్పష్టమగుచున్నది.

## మ త వి ప్ల వ ము

యజ్ఞయాగాదులు హింసాపూర్వకము లని వేదములను నిరసించిన వారిలో మొదటవారు భాగవతులు. పిమ్మట బౌద్ధులు, అదేసమయమున జైనులును: మఱియొక ప్రక్కను శైవులును, చార్వాకులును, శాక్తులును ఎవరి దారిని వారు క్రొత్త క్రొత్త సిద్ధాంతములను ప్రచురించుచుండిరి. ఎక్కడ జూచినను చర్చలు జరుగుచుండెను. సగుణుడగు విష్ణుని భక్తి ప్రధానముగా పూజించు వైష్ణవులు ఈ విప్లవమును ముమ్ముందు ప్రారంభించిరి. బౌద్ధులు కర్మ కాండను నిరసించుటయేగాక దేవుడే లేడనిరి. చాతుర్వర్ణ్య విభాగము కూడదనిరి. అప్పటికి విప్లవము వృద్ధిజెందెను. మోక్షసంపాదనకు నీతి మార్గము ముఖ్యమని బౌద్ధులు బోధించుచుండగా, చార్వాకులు సుఖమే ప్రధానము గాని నీతులతో తమకు నిమిత్తము లేదనియు, జీవించి నంతవఱకు సుఖముగా నుండుటయే ప్రధానమనియు బోధించుచు,ఈవిప్లవమును సంపూర్ణము జేసిరి. జైనులుకూడ మోక్షసంపాదనకై తపస్సు ప్రధాన మైనదనియు జీవాత్మలు నిత్యమైనవనియు చెప్పుచు అహింసా వ్రతమునే బోధించిరిగాని, వేదములయొక్క ప్రమాణమును ఒప్పుకొనక పోవుటచే వారును హిందూమత విప్లవమునకు సహకారులైరి.

## సూ త్ర ము లు

### (క్రీ. పూ. 1000–500)

ఇంతట శ్రోత్రియులు కండ్లు తెరచి తమ ఇల్లు చక్కబెట్టుకొనుటకు ప్రారంభించిరి. ఇందులకు ప్రథమ ప్రయత్నముగా తమ విజ్ఞానము నంతను పరిశోధించి సూత్రరూపముగా రచించుటకు ప్రారంభించిరి.

సూత్రములనగా నెంతయో అర్థమును కొద్దిలో నిమిడ్చి చెప్పెడి చిన్న వాక్యములు. ఆర్యులలో భిన్నశాఖలవారికి ప్రత్యేక సూత్రములు గలవు. శ్రౌతసూత్రములందు యజ్ఞయాగాది కర్మలు చేయువిధము వర్ణింపబడును. గృహ్యసూత్రములందు గృహస్థుడు చేయవలసిన షోడశ కర్మలను చేయు నిబంధన లుండును. వివాహాది కార్యములను ఏ సూత్రమువారు ఆ సూత్రానుసారము జరుపుకొనవలెను. ఋగ్వేదమునకు ఆశ్వలాయన హిరణ్యకేశీ సూత్రములును, యజుర్వేదమునకు ఆపస్తంబ, బౌధాయన సూత్రములును

ముఖ్యము లైనవి. బౌధాయన ఋషి క్రీ. పూ. 500 నాటికిని, అపస్తంబఋషి క్రీ. పూ. 500 నాటికిని ఉన్నట్లు తెలియుచున్నది. అందు ఆంధ్రదేశమున అపస్తంబ సూత్రములు మిక్కిలి గౌరవించబడుచున్నవి. ఇప్పటికికూడ ఎవరి గోత్రమును, సూత్రమును వారు వంశపారంపర్యముగ తెలుసుకొనుచు వారి వారి వంశచరిత్రలను ప్రవరలో చెప్పుకొని కాపాడుకొనుచున్నారు. ఉదా:- నేను సాంఖ్యాయన ప్రవరాన్వితః, సాంఖ్యాయనసగోత్రః, అపస్తంబ సూత్రః యజుశ్శాఖాధ్యాయీ అని ప్రతిదినమును చేయు ప్రార్థనలలో చెప్పుకొనుచు నా వంశావళి చరిత్రను కాపాడవలె నను నియమము ఇప్పటికిని ఆచారములో నున్నది. శ్రౌతగృహ్య సూత్రముల గాక ధర్మసూత్రములును మనువు మొదలగువారి స్మృతులును గలవు. పాణిని కృతమైన "అష్టాధ్యాయి" అను వ్యాకరణ గ్రంథము ఈ సూత్ర కాలము నాటిది (క్రీ. పూ. 750). తరువాత కాత్యాయనుడు ఈ సూత్రములపై వార్తికములు వ్రాసెను. పిమ్మట పతంజలి ( క్రీ. పూ, 170 ) పాణిని సూత్రములపై మహాభాష్య మను పేర భాష్యమును వ్రాసెను.

## స్మృతులు

శ్రుతివాక్యములకు అవిరోధముగా ఋషులచే స్మరింపబడినవి గావున వీనికి స్మృతులు అని పేరు. మూలస్మృతులు 18.

1. స్వాయంభువ మనుస్మృతి, 2. బృహస్పతి స్మృతి, 3. వసిష్ఠ స్మృతి, 4. కశ్యప స్మృతి, 5. భారద్వాజ స్మృతి, 6. గౌతమస్మృతి, 7. యాజ్ఞవల్క్య స్మృతి, 8. భృగుస్మృతి, 9. నారదస్మృతి, 10. కపిల స్మృతి, 11. పరాశర స్మృతి, 12. వ్యాస స్మృతి. 13. కాత్యాయన స్మృతి, 14. అపస్తంబ స్మృతి, 15. అశ్వలాయన స్మృతి, 16. కణ్వస్మృతి, 17. అత్రి స్మృతి, 18. హారీత స్మృతి.

ఈ స్మృతులను అనుసరించు ఉపస్మృతులును గలవు. వీనిని బట్టి హేమాద్రి, నిర్ణయ సింధువు, ధర్మప్రవృత్తి, స్మృతిరత్న మహోదధి, స్మృతి చంద్రిక, షట్కర్మచంద్రిక మున్నగు అనేక స్వతంత్రగ్రంథములు కూడా గలవు

మనుస్మృతికి వ్యాఖ్యానము కుల్లూకభట్టీయము. యాజ్ఞవల్క్య స్మృతికి వ్యాఖ్యానము విజ్ఞానేశ్వరీయము; సరస్వతీ విలాసము. పరాశర

స్మృతికి వ్యాఖ్యానము ఉజ్జ్వల దత్తీయము. ఇటులనే అనేకవ్యాఖ్యానములు పుట్టియున్నవి. ప్రతి స్మృతియందును ఆచారకాండము, ప్రాయశ్చిత్తకాండము, వ్యవహారకాండము అని మూడు భాగములు గలవు. ఈ స్మృతులనుండి మనకు ఆ కాలపుదేశస్థితి, సంఘస్థితి, ఆచారవ్యవహారములు, వర్ణాశ్రమ ధర్మములు, రాజధర్మములు, న్యాయవిచారణ మొదలగు విషయములు అన్నియు తెలియును.

## షడ్దర్శనములు

ఇప్పుడు అనగా క్రీ. పూ. 400 మొదలు 200 సంవత్సరముల లోపల (1) న్యాయ, (2) వైశేషిక, (3) సాంఖ్య, (4) యోగ, (5) పూర్వమీమాంస (6) వేదాంతములను షడ్దర్శనములు ప్రచారములోనికి వచ్చెను. షడ్దర్శనములను గురించి రెండవఖండమునందు చూడనగును. ఈ కాలమున శైవులును, భాగవతులును హిందువులలో జేరిపోయిరి. పురాణములును వీరికి సహకారు లాయెను. బౌద్ధ, జైనులమతములు మాత్రము ప్రత్యేకముగా నిలిచిపోయెను. అట్లు నిలిచిపోయిన పరమతములను ప్రతిఘటించి షడ్దర్శనవాదులు ప్రబల ప్రయత్నములు జేసి ఏ ప్రకారము హిందూమతమును స్థాపించిరో - శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యులు బ్రహ్మసూత్రములకును, భగవద్గీతకును, ఉపనిషత్తులకును తమతమ భాష్యములను రచియించి హిందూమతమును (సనాతన ధర్మమును) మత విప్లవముల నుండి ఎట్లు రక్షించిరో ముందు చూడగలరు.

## ఆంధ్ర రాజులు

ఆంధ్రులను పేరు మొట్టమొదట ఐతరేయబ్రాహ్మణములో గానవచ్చుచున్నది. (క్రీ. పూ. 1000 సంవత్సరములు) ఇందలి వర్ణనలు చూడగా ఆంధ్రులు కొందరు ఆర్యులతో పోరాడి లేచివచ్చి దండకారణ్యములో అనార్యజనమధ్యమున నివసించుచుండెడి యొక తెగవారగు ఆర్యులనియే తోచుచున్నది*. రామాయణ, మహాభారతములయందు ఆంధ్రదేశవర్ణనలు గలవు. క్రీ. పూ. 300 సంవత్సర ప్రాంతమున ఆంధ్రరాజ్యము మహోన్నత దశయందున్నట్లును, చంద్రగుప్తుని రాజ్యము తరువాత ఆంధ్రరాజ్యమును మించిన మఱియొక రాజ్యములేదనియు "మెగాస్తనీస్" అను గ్రీకురాయబారి

* కె. వి. లక్ష్మణరావుగారు.

వ్రాసియున్నాడు. ఆ కాలమున ఆంధ్రరాజ్యమునందు ముప్పదిదుర్గములును, లక్ష కాల్బలమును రెండు వేలగుఱ్ఱపు సైన్యమును, వేయి ఏనుగులును ఉండెను. వీరు క్రీ. పూ. 256 లో అశోకునికి సామంతులై యుండినట్లు శాసనములు గలవు♦ అశోకుని మరణానంతరము క్రీ.పూ. 231 లో ఆంధ్రరాజులు పూర్తిగా స్వతంత్రులైరి. అంతట వీరు విజృంభించి కృష్ణా, గోదావరినదుల ముఖమున ఆంధ్ర సముద్రము మొదలు మగధదేశమువఱకు నాక్రమించుకొనిరి. వీరికి తూర్పున శ్రీకాకుళమును, పశ్చిమమున ప్రతిష్ఠాన (పైఠణ్) పురమును రాజధానులుగా నుండెను. శ్రీకాకుళము కృష్ణానది ముఖమువద్ద చల్లపల్లి జమీందారీలో ఉన్నది. ఈ యాంధ్రరాజులు ముప్పదిమంది 456 సంవత్సరములు రాజ్యము చేసిరి. వీరికి శాతవాహను లనియు, శాతకర్ణు లనియు పేర్లు కలవు. శాత వాహనులనగా సింహమును వాహనముగా కలవారు. శాతకర్ణులనగా నూరు చుక్కానులు అనగా పడవలు కలవారు. ఈ చక్రవర్తులలో నొకడగు శాలివాహనుడు పరరాజుల నోడించి, శాలివాహన శకము క్రీ. శ. 78 లో స్థాపించెను. ఇప్పటికిని మన పంచాంగములలో ఈ శకము వాడబడు చున్నది. వీరు మిక్కిలి బలవంతులై విదేశరాజులపరితాపము నడగించుచు రాగా తుదకు క్రీ. శ. 126 సంవత్సరములో "విలవాయకురుడు"† అను ఆంధ్రరాజాగ్రగణ్యు డన్యదేశీయు లగు రాజు లనేకుల నాశన మొందించి పారతంత్ర్యమునుండి దేశమును తొలగించి స్వరాజ్యమును, స్వధర్మమును నిలిపె నని క్రీ. శ. 144 లో నొక శాసనముగలదు. ఆంధ్రరాజ్యమం దప్పుడు సౌరాష్ట్రము, (కాఠియవాడ్) మాళ్వా, కచ్ఛము (కచ్) సింధు దేశము, కొంకణము మొదలగు రాజ్యములన్నియు చేరి యుండెను. ఆంధ్రరాజుల వంశవృక్షమందు 24వ వాడగు రెండవ 'పులమాయి' (క్రీ. శ. 130-158) తన రాజధానిని ప్రతిష్ఠానపురమునకు మార్చెను. తరువాత రాజులలో 'యజ్ఞశ్రీ' అను నాతడు ఓడయొక్క ముద్ర గల వెండినాణెములను చేయించెను. (క్రీ. శ. 184 - 213). అందువలన ఈతని కాలమున సముద్రవ్యాపారములు విశేషముగానున్న ట్లూహింపవచ్చును. శ్రీ కాకుళము గాక తరువాత ఆంధ్రులకు ధాన్యకటకము రాజధానిగా నుండినట్లు తెలియుచున్నది. ఇది ధనకటకము, ధరణికోట అనికూడ చెప్పబడును. ఈ

---

♦ 13 వ శిలాశాసనము. † "గౌతమీపుత్ర శాతకర్ణి"

నగరము గుంటూరుజిల్లాలో కృష్ణానదియొడ్డున గలదు. ఇచ్చట నీకాలమున అమరావతి విశ్వవిద్యాలయము అభివృద్ధిలో నుండెను.

క్రీ. శ. 3 వ శతాబ్దమందు హిందూస్థానచరిత్ర అంధకారబంధురమై ఆంధ్రవంశ మెట్లంతరించినది తెలియదు. ఇది తునకలుతునకలై పలురాజులచే ఆక్రమింపబడినట్లు కనబడుచున్నది. మొట్టమొదట ఆంధ్రరాజులు బౌద్ధమతస్థులుగానుండి అమరావతి, జగ్గయ్యపేట మొదలగు స్థలములలో బౌద్ధస్తూపముల గట్టించిరనియు తరువాత హిందూమతస్థులుగ మారిరనియు తోచుచున్నది. ఆంధ్రదేశమున క్రీ. శ. 225-6150 వరకు పల్లవులును, ఇతరసామంతరాజులును ఏలుచుండిరి.

## కనిష్క మహారాజు

### (క్రీ. శ. 120-150)

అలెగ్జాండరు తరువాత హిందూదేశముయొక్క పశ్చిమ సరిహద్దునందు "బ్యాక్ట్రియా" యను రాజ్యమును గ్రీకురాజు లేలుచుండిరి. ఆంధ్రరాజులు మహావైభవముతో నున్నంతకాలము ఈ బ్యాక్ట్రియను లచ్చటచ్చట ఈ దేశమునందు చిన్నచిన్న రాజ్యముల నేర్పరచుకొని కొన్ని దినములకు హిందువులలో కలిసిపోయిరి. మాళ్వాదేశమున రాజ్య మేలుచుండిన శకరాజులను హిందువులు క్రీ. పూ. 57 లో "కారూరు" వద్ద నోడించుటచే ఆ సంవత్సరమునుండి విక్రమశకము ప్రారంభమాయెను *శకరాజులను పల్లవులను (పార్థియనులును), పల్లవులను కుశను వంశపు రాజులును జయించిరి. కుశను వంశమున కనిష్కుడను రాజు విఖ్యాతి జెందెను. అశోకుని తరువాత బౌద్ధధర్మమును మిక్కిలి యభివృద్ధికి తెచ్చెను. ఇతని రాజధాని పెషావరు పట్టణము (పురుషపురము). ఇతడు తన రాజ్యమును ఉత్తరమున టిబెట్ నందును, పశ్చిమమున "యార్కన్" "ఖోటాన్" మొదలగు చైనాలోని దేశములవరకును వ్యాపింపజేసెను. ఇతని నాణెముల మీదనున్న సూర్యచంద్రప్రతిమలనుబట్టి మొదట యవను డనియు, పిమ్మట బౌద్ధమతస్థుడయ్యెననియు తెలియ గలదు. ఈతని కాలమునందు బౌద్ధాచార్యుల నాల్గవ పరిషత్తు జరిగెను. ఇతడు క్రీ. శ. 150 ప్రాంతమున మృతుడయ్యెను.

* కె. వి. లక్ష్మణరావుగారు.

ప్రస్తుతము ముద్రితమైన చరకసంహితలో ఈ అన్యదేశీయుల పేర్లున్నియు కానవచ్చుచున్నవి. కావున ఈ గ్రంథము ఈ కాలమునాటి దని కొందఱి అభిప్రాయము. ఈ కాలమున తక్షశిలానగరమున విశ్వవిద్యాలయమునందు ఆయుర్వేదము అభివృద్ధి జెందెను.

## బౌద్ధమతపతనము

హిందూదేశమున బౌద్ధమతపతనమునకు ముఖ్యమైన కారణము రాజపోషణము లేక పోవుటయే. ఇది గాక అనాగరికు లగు పరదేశీయులు మహాయానమతములో మొట్టమొదట రాజపోషణ యుండిన కాలములో తండోపతండములుగా జేరుచు వచ్చిరి. వారి నాకర్షించుటచే అట్టి అనాగరికుల దురాచారములు కొన్ని ఈమతములోనికి సంక్రమించెను. అందుచే బౌద్ధమతము జనసామాన్యముయొక్క ఆదరమును సహితము క్రమక్రమముగా గోల్పోయెను. ఈ కారణముచేతకూడ రాజపోషణ లోపించెను. తాంత్రిక సంబంధమైన అనాచారములును, స్త్రీ లోలత్వమును, బౌద్ధ విహారములందు మతమును పేర వృద్ధియై తుదకు ఏడవశతాబ్దము నాటికి బౌద్ధమతము హిందూదేశమున నామమాత్రావశిష్టమయ్యెను. జైనమతము మొట్ట మొదట వేదబాహ్యముగా బయలుదేరినను, తుదకు శ్రీ కృష్ణుడు విష్ణువుయొక్క అవతారముగ అంగీకరింపబడినతోడనే హిందూమతములో చేరిపోయెను. అటులనే బుద్ధునిగూడ విష్ణునవతారముగ హిందువు లంగీకరించిన పిమ్మట ప్రపంచమంతయు వ్యాప్తమైన ఈబౌద్ధమతమునకు హిందూదేశమున ప్రత్యేకముగ ఒక నిలముగానైన నిలుచుటకు ఆస్కారము లేకపోయెను. కాని జైనులుమాత్రము తమయొక్క ప్రధాన సూత్రములను కాపాడుకొని తాంత్రిక దురాచారములలో పడక నిలిచియున్నను, ఉత్తరమున వైష్ణవమతమును, దక్షిణమున శైవమతమును, ప్రబలముగా వ్యాపించుటచేతను, రాజపోషణ లేక పోవుటచేతను, క్రూరతపోనిష్ఠలచేతను, జైనమతముకూడ ప్రజాసామాన్యము నాకర్షింపజాలక, పశ్చిమ హిందూస్థానమున కొంత ప్రదేశమునందు మాత్రము అదృష్టవశమున కొందరు ధనికుల సంఘములలో ఇప్పటికిని అభివృద్ధి నందుచున్నది.

# 4. పౌరాణిక యుగము

(క్రీ. శ. 300 నుండి 1000 వఱకు)

---

[విషయసంగ్రహము:— పౌరాణికయుగము -- సముద్రగుప్తుడు - రెండవ చంద్రగుప్తుడు - ధర్మవైద్యశాలలు - విక్రమాదిత్యుడు- నవరత్నములు - శిలాదిత్యుడు - శ్రీ హర్షుడు - పురాణములు - ఉపపురాణములు : నానిలక్షణములు - సర్గము - ప్రతిసర్గము - కాలపరిమాణము - మన్వంతరములు - ప్రళయములు - శాస్త్రాభివృద్ధి - వాఙ్మయము - శిల్పకళాభివృద్ధి - శైవసిద్ధాంతము - రేణుకాచార్యులు : వీరశైవము - అరవదేశపు శివభక్తులు - తిరుమూలర్ - మాణిక్యవాచకర్ - అప్పర్ - సంబంధర్ - సుందరమూర్తి - శ్రీశివభక్తురాండ్రు - శివభక్తులు - వైదిక సంప్రదాయపువారు - హిందూమత పునరుద్ధరణము - కుమారిలభట్టు - శంకరాచార్యులు - రామానుజాచార్యులు - మధ్వాచార్యులు - బసవేశ్వరుడు - హిందూమతవ్యాపకము - దేవాలయములు - హిందూరాజ్యముల విస్తీర్ణము, వలసరాజ్యములు. రాజ్యపద్ధతి : రాజనీతి- హిందూస్థానము సంయుక్తరాష్ట్రము - ప్రజాసత్తాక రాజ్యములు - క్షత్రియధర్మము - చాతుర్వర్ణ్యవ్యవస్థ - రాజపుత్రులు - దక్షిణదేశమున క్షత్రియులు - బ్రాహ్మణులు క్షత్రియధర్మమును అనుసరించుట, క్షత్రియధర్మము తగ్గుట, ఐకమత్యములేక పోవుట.]

---

ఈ యుగమునందు స్మృతులును, పురాణములును అభివృద్ధి చెంది హిందూమతమును తిరిగి స్థాపించుటచే పౌరాణికయుగ మని పేరు వచ్చినది. గతయుగాంతమునందు ఆంధ్రరాజ్యము క్షీణించిన పిమ్మట, హిందూ రాజులు కళాహీనులై ఐకమత్యములేక అనేక శాఖలు బయలుదేరి ఒకరి నొకరు ద్వేషించుకొను సమయమున శకవంశజులు, హూణులు, యవనులు, పల్లవులు, బ్యాక్ట్రియనులు మొదలగు పరదేశీయులు ఉత్తర పశ్చిమములనుండి ఒకరివెంట నొకరు మౌర్యవంశము శిథిలము కాగానే చొరుచుకొని నిరాదొడగిరి.

## సముద్రగుప్తుడు (క్రీ. శ. 325-326)

ఇతడు గుప్తవంశమునకు చెందినవాడు. ఇతడు ఉత్తరహిందూదేశము లోని యనేక రాజ్యములను జయించి, దక్షిణమున రామేశ్వరము వరకును దిగ్విజయము చేసెను. ఇతడు హిందూస్థానము నంతయు తన పరిపాలన క్రిందికి తెచ్చి, తన విజయమును జగత్తునకు తెలుపుటకై అశ్వమేధయాగము చేసెను. మరియు, అశోకుడు ప్రయాగలో వేయించిన శాసనము గల స్తంభము మీదనే తన దిగ్విజయములను గురించి శాసనము వ్రాయించెను. ఇతడు హిందువు డయ్యును బౌద్ధులను ప్రోత్సహించెను. ఇతని పిమ్మట గుప్తరాజులు క్రీ. శ. 480 వఱకును రాజ్యము చేసిరి.

## రెండవ చంద్రగుప్తుడు

ఈ వంశమునందలి రెండవ చంద్రగుప్తుని (క్రీ. శ. 375-413) రాజ్య సమయమున చైనాదేశస్థుడగు బౌద్ధ యాత్రికుడు (ఫాహియాన్) (క్రీ. శ. 405-411) వ్రాసిన వ్రాతలను బట్టి ఈతని రాజ్యము రామరాజ్యముగా నున్నట్లు కానవచ్చుచున్నది. ఈతడు హిందూరాజ్యమును ఉత్తరమున పంజాబు, పశ్చిమమున గుజరాతు, తూర్పున బెంగాలు వఱకును వ్యాపింపజేసి విక్రమాదిత్యు డను బిరుదు పొంది తన విజయమును శాశ్వతముగ ఢిల్లీలో ఉక్కు స్తంభముమీద వ్రాయించెను. అది యిప్పటివఱకు నున్నది.

## ధర్మ వైద్య శాలలు

ఈతని పరిపాలన సమయమున పాటలీ పుత్రమునందు ఉన్న ఒక ధర్మవైద్యశాలను "ఫాహియాన్" ఇట్లు వర్ణించియున్నాడు. "లోకోపకార పారీణులును విద్యావంతులును అగు పౌరులు పాటలీపుత్రమునందు ఒక ధర్మవైద్యశాలను స్థాపించిరి. రోగములుగల బీదలందరును నిచ్చటికి వచ్చెదరు. ఈ యౌషధశాలలో వారిని చేర్చుకొని వైద్యు డెట్టి రోగమున కైనను మందిచ్చును. వారికి అన్నపానాదులన్నియు అచ్చటనే యీయబడును. అచ్చట వారు రోగము కుదురు వఱకు ఉండి బాగైన తోడనే ఇండ్లకు పోవుదురు".

ఇట్టి ఔషధశాలలు ఆకాలమున హిందూదేశమునందు తప్ప ప్రపంచమునం దెచ్చటను లేవని చెప్పవచ్చును. 10 వ శతాబ్దమునందు కాబోలు! ఐరోపా దేశమున ఔషధశాలలు పుట్టెను. ఈ కాలమునాటికి

వేలకొలది బౌద్ధసన్యాసులు గల విహారములు దేశము పొడుగునను గలవని వ్రాసియున్నారు.

ఇతడనేక హిందువులతో కూడి యొక వర్తక నౌకనెక్కి 90 దినములకు జావా చేరినట్లును, అచ్చట బ్రాహ్మణులు అనేకులుండినట్లును, హిందూధర్మమచ్చట మిక్కిలి అభివృద్ధిలో నుండినట్లును ఫాహియాన్ వ్రాయుచున్నాడు.

## విక్రమాదిత్యుడు (525-583)

మాళ్వ దేశములోని ఉజ్జయిని రాజధానిగా విక్రమాదిత్యుడు రాజ్యముచేసెను. దీనికే అవంతిదేశ మనికూడ పేరుగలదు. అతడు హూణశక నృపతులను జయించుటయేగాక అస్సాముసుండి పశ్చిమ సముద్రమువఱకు గల దేశములనెల్ల జయించి రాజాధిరాజను బిరుదమునంది యేకచ్ఛత్రాధిపత్యముగ రాజ్యము నేలెను. ఇతని సభయందు నవరత్నము లనబడుతొమ్మిదిమంది పండితులుండిరి.

శ్లో. ధన్వంతరిః క్షపణ కామరసింహశంకు
వేతాలభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య.

ఇందు ధన్వంతరి వైద్యశాస్త్రవేత్త. క్షపణకుడు ముహూర్తవిదుడు. అమరసింహుడు శబ్దశాస్త్ర విశారదుడు శంకుడు శిల్పశాస్త్ర నిపుణుడు. వేతాలభట్టు మంత్రశాస్త్రజ్ఞుడు ఘటకర్పరుడు భూగతద్రవ్యశాస్త్రజ్ఞుడు. కాళిదాసు మహాకవి. వరాహమిహిరుడు జ్యోతిశ్శాస్త్ర పారంగతుడు. వరరుచి ప్రాకృత భాషాశాసనుడు. క్షపణకుడు జైనుడు. అమరసింహుడు బౌద్ధుడు. కడమవారు బ్రాహ్మణులు. ఇంతమంది సుప్రసిద్ధశాస్త్రజ్ఞులకు కళాపములకు నాశ్రియము నిచ్చిన చక్రవర్తి క్రీ. శ. 583లో మృతుడయ్యెనని ఊహించుచున్నారు. మన కింతకంటె ఎక్కువ ఏమియు తెలియనందుకు మన మెంతయు చింతిల్లవలసియున్నది,

## శిలాదిత్యుడు (క్రీ. శ. 583-606)

ఇతడు బౌద్ధమతమునందు అత్యంతాభిమానము గలవాడు. ఆ దిన

ములలో హిందువులును, బౌద్ధులును ఒకరితో నొకరు కలిసి మెలసి వైరభావము లేక యుండిరి. రెండు ధర్మములును రాజులచేతను ప్రజల చేతను గూడ గౌరవింపబడుచుండెను. ఒక కుటుంబములో నొకడు హిందువుగను, మఱియొకడు బౌద్ధుడుగను నుండుట సంభవించుచుండెను. ఉభయమతముల విద్వాంసులును ఒక్కచోట గూడి మతచర్చలు చేయు చుండిరి.

## శ్రీహర్షుడు (క్రీ. శ. 606-645)

శ్రీ హర్షునకు రెండవశిలాదిత్యుడనియు, హర్షవర్ధను డనియు నామాంతరములు గలవు. ఇతడు అరవైవేల ఏనుగులను, ఒకలక్ష గుఱ్ఱములను గల సైన్యమును చేర్చుకొని 35 సంవత్సరముల వరకు దిగ్విజయయాత్రకు వెడలు చుండెను. ఇత డనేక రాజులను గెలిచినను దక్షిణమున చాళుక్యవీరుడైన రెండవ పులకేశిని గెలువలేక పోయెను. అందుచే దక్షిణమున నర్మదానది సరిహద్దుగా నేర్పరిచుకొని, ఉత్తరమున నేపాళరాజులను, తూర్పున కామరూప మనబడు అస్సాం రాజులను, పశ్చిమమున వల్లభిరాజులను నితడు లోబరచుకొనెను. ఇత డొక బ్రాహ్మణుడైన రాయబారిని చీనా దేశమునకు పంపెను. ఇతడు స్వయముగా గొప్ప విద్వాంసుడును విఖ్యాతకవియు నై యున్నాడు. రత్నావళి, ప్రియదర్శిక, నాగానందము అను నాటకములను సంస్కృతమున రచియించెను. ఈతడు రాజ్యము చేయునప్పుడు హుయెన్‌స్యాంగు అను బౌద్ధయాత్రికుడు ఈతని రాజధాని యగు "కనౌజ్" పట్టణమునకు వచ్చెను. అప్పుడు ఈమహారాజు అతివైభవముతో పాంచవర్షికమని బౌద్ధసత్రమును (యజ్ఞము) చేయుచుండెను. (క్రీ.శ.644) ఈసత్రము 75 దినములవఱకు జరిగి యిందు బౌద్ధులు, జైనులు, హిందువులు మొదలగు అన్ని మతములవారును హిరణ్యాది దక్షిణలచే గౌరవింపబడిరి. ఒక్క కాసైనను లేకుండ రాజు తన సొత్తునంతయు దానము జేసె నని వ్రాయబడియున్నది.

## పురాణములు

ఈ యుగమున క్రమక్రమముగా పురాణములు రచింపబడెను. ఇవి పదునెనిమిది. ఉపపురాణము లని మరిపదునెనిమిది కూడ కలవు. వేదముల లోని నైసర్గిక దృశ్యములను,కొన్ని చారిత్రక విషయములను కలిపి పురాణ

ములయందు కథలుగా వర్ణింపబడియున్నవి. వేదములు ఎల్లరకును అర్థము గాక పోవుటచేతను, సామాన్యజనులకు అందరాని వగుటచేతను, వారి నిమిత్తమై రామాయణ భారతాది ఇతిహాసములును, భాగవతాది పురాణాదులును రచింపబడెను. మహాభారతమునకు వేదములతో సమానమైన స్థానము నిచ్చి, పంచమ వేదముగా గణించుచుండిరి. పురాణములు కల్పసూత్రములవలె అతిసంగ్రహముగా నుండక, ఇప్పటి నవలలవలె వివరిగా నుండును. శైలి మిక్కిలి సులభముగానుండి, స్వరోచ్చారణ కష్టములేకయుండును. స్త్రీలుకూడ సామాన్యముగ పఠించుటకు వీలగునటుల విషయములు విస్తృతముగా బోధింపబడియున్నవి. వీనిని కూడ వ్యాసమహర్షియే రచించెను. ఈ పురాణముల పేర్లు అనేకు లనేకవిధములుగ తెలిపియున్నారు. పురాణముల నామములను వానియందు గల శ్లోకముల సంఖ్యయు ఇటుల తెలియుచున్నది.*

| పురాణము పేరు. | శ్లోకసంఖ్య. | పురాణము పేరు | శ్లోకసంఖ్య |
|---|---|---|---|
| 1. బ్రహ్మపురాణము | 10 వేలు | 10. బ్రహ్మవైవర్తపురాణము | 18 వేలు |
| 2. పద్మ ,, | 55 ,, | 11. లింగ ,, | 11 ,, |
| 3. వైష్ణవ ,, | 23 ,, | 12. వరాహ ,, | 24 ,, |
| 4. శైవ ,, | 24 ,, | 13 స్కాంద ,, | 81,100 |
| 5. భాగవత ,, | 18 ,, | 14. వామన ,, | 10 వేలు |
| 6. నారదీయ ,, | 15 ,, | 15. కూర్మ ,, | 17 ,, |
| 7. మార్కండేయ ,, | 9 ,, | 16. మత్స్య ,, | 19 ,, |
| 8. ఆగ్నేయ ,, | 15,400 | 17. గరుడ ,, | 19 ,, |
| 9. భవిష్యత్ ,, | 18,500 | 18. బ్రహ్మాండ ,, | 12 ,, |

## ఉ ప పు రా ణ ము లు

సనత్కుమార, నరసింహ, నారదీయ, శివ, దూర్వాస, కపిల, మానవ, ఔశనస, వరుణ, కాలిక, సాంబ, నంది, సౌర, పరాశర, ఆదిత్య, మహేశ్వర, భాగవత, వసిష్ఠము లనునవి ఉపపురాణముల పేర్లు. నారాయణుని (భగవంతుని) యందు నిష్ఠకలది శ్రీ భాగవతము. పరాశక్తి (భగవతి)

* ఆర్యవిద్యా రహస్యము. పేజి 22

యందు నిష్ఠకలది దేవీభాగవతము. శైవులును, శాక్తేయులును శ్రీభాగవతమును ఉపపురాణమందురు. వైష్ణవులును, అద్వైతులును దేవీభాగవతమును ఉపపురాణమందురు. మీమాంసకుల ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి అను ఆరు ప్రమాణములు గాక, సంభవము, ఐతిహ్యము అను మరి రెండు ప్రమాణములను కూడ పౌరాణికులు అంగీకరింతురు. మహాపురాణ, ఉపపురాణములు గాక - బసవపురాణము, చెన్నబసవపురాణము, కన్యకాపురాణము అను మరి కొన్ని పురాణములు కలవు.

పురాణములలో ముఖ్యముగా సృష్టిక్రమము వివరింపబడును. కొన్ని చారిత్రకమైన విషయము లున్నను, వీనియందు చరిత్ర ప్రధానము కాదు. అవి బోధించు నీతులు ప్రధానము. కొన్ని ఒక్కొక్క స్థలమునుగూర్చిన కథలను వివరించును. మరికొన్ని సృష్టియావత్తును గూర్చి వివరించును. అందు కొన్ని మనము పిల్లలకు చెప్పుకథల వంటివి. అందలి నీతి ప్రధానము కాని వర్ణనలు ప్రధానము కావు. ఒక్క విషయమును చక్కగా నొక్కి చెప్పుటకై కవు లనేక చిత్రవిచిత్రములగు వర్ణనలు చేయుదురు. పురాణ మనగానే ప్రాతకథలను క్రొత్తవిగా నుండునట్లు చేయుట అని అర్థము. కొన్ని పురాణగాథలు ఇప్పుడు మనకు అర్థము గాకపోయినను, అందు ఎన్నో ముఖ్యములగు విషయములు మనము తెలుసుకోవలసినవి గలవు. పురాణములు ఈ కాలపు సినీమాలవంటివి. కొంత సత్యమును, కొంత కల్పనను చేర్చి చదువరులకు మనోహరముగా నుండునట్లు కథలు సృష్టించి తుద కేదో నీతిని బోధించును.

అగ్నిపురాణమునందు శివుని, విష్ణువును హెచ్చుగా వర్ణించినను, అట్టి వర్ణనలకంటె, అందు మన కుండు రాజనీతి, సాంఘిక శాసనములు, వైద్యవిషయములు ముఖ్యమైనవి. వాయుపురాణమునందు సూర్యచంద్ర వంశపు రాజుల చరిత్రములు గమనింపదగినవి. విష్ణుపురాణమునందు రాజుల వంశావళులు కలియుగారంభమువరకు చెప్పుకొనుచు వచ్చి, తరువాత కలియుగములో ఆంధ్రచక్రవర్తుల యొక్కయు ఇంకను ఇతర రాజుల యొక్కయు చరిత్రములు తెలిపిరి. పద్మపురాణమునందు సాంఖ్యతత్వమును సృష్టిక్రమమును వర్ణింపబడినవి. ఇందు కాలప్రమాణము క్షణము మొదలు బ్రహ్మకల్పమువరకు వివరింపబడి యున్నది. వ్రతముల శ్రాద్ధముల గూర్చియు గయాక్షేత్రమునుగూర్చియు వర్ణనము కలదు. బ్రహ్మపురాణము

నందు పూరిజగన్నాథము వర్ణనము కలదు. గరుడపురాణమునందు గర్భోత్పత్తి క్రమమును, పిండబ్రహ్మాండ న్యాయమును, మరి కొన్ని వైద్య విషయములను విస్తృతముగ నుదాహరింపబడియున్నవి. మొత్తము మీద పురాణములు వేలకొలది సంవత్సరములనుండి హిందూదేశమున ప్రజల చరిత్రమును గూర్చి కథారూపమున బోధించుచున్నవి. భాగవత పురాణము భక్తిని బోధించుచు దేశమునందు ఎక్కువగా ఇప్పటికిని వ్యాప్తమై యున్నది.

## పు రా ణ ల క్ష ణ ము లు

పురాణములయొక్క ముఖ్యలక్షణములు పది యని భాగవత పురాణమునందు కలదు.

(1) సర్గము (ప్రకృతి పరిణామము)
(2) విసర్గము (వికృతుల పరిణామము)
(3) స్థానము (సృష్టిస్థితి)
(4) పోషణము (సృష్టిపోషణము)
(5) మన్వంతరము (మనువుల కాలము)
(6) ఊతి (రక్షణము)
(7) ఈశానుకథ (అవతారములచరిత్ర)
(8) నిరోధము (లీనము చెందుట)
(9) ముక్తి
(10) ఆశ్రయము (గమ్యస్థానము)

అమరకోశమునందు ఐదు లక్షణములుమాత్రము చెప్పబడుచున్నవి.

1. సర్గము 2. ప్రతిసర్గము (విసర్గము) 3. ఈశ్వరానువంశము 4. మన్వంతరము 5. రాజులచరిత్ర. ఈ అయిదు లక్షణములు మాత్రము ముఖ్యమైనవిగా అనేకులచే అంగీకరింపబడుచున్నవి. విష్ణుపురాణము ననుసరించి సర్గవిసర్గము లిట్లున్నవి.

## స ర్గ ము

1. సర్గము:— ఈశ్వరుని అధీనముక్రింద ప్రకృతినుండి బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు * అను నీ యేడును ప్రకృతి, వికృతులుగ పరిణా

* పృథ్వి, అప్పు, తేజము, వాయువు, ఆకాశముల సూక్ష్మావస్థలు పంచతన్మాత్రలు.

మించును. జగత్తు పరిణామము చెందు సమయమున అవ్యక్తము ఈశ్వరు డగును. ఈశ్వరు డనగా సృష్టికర్త. మరియు కర్మతో కలిసిన ప్రకృతితో కూడి ఈశ్వరునకు పరిణామము చెందు వృత్తి కలుగగనే హిరణ్యగర్భుడగును. హిరణ్యగర్భుడు అనగా మానవునకు ఆత్మ ఎట్లో, సృష్టి కంతకును అట్లే ఆత్మ. దీనినే విరాట్ అందురు.

## ప్రతిసర్గము

ప్రతిసర్గ మనగా ప్రకృతివికృతులనుండి వికృతు లేర్పడుట. అది ఈ క్రింది ప్రకారము జరుగును.

ఐదు తన్మాత్రల యొక్కయు మొత్తము సాత్వికాంశము వలన "అంతఃకరణము" పుట్టును.

ఒక్కొక్క తన్మాత్రయొక్క సాత్వికాంశమునుండి ఒక్కొక్క జ్ఞానేంద్రియము చొప్పున పంచజ్ఞానేంద్రియములు పుట్టును.

ఒక్కొక్క తన్మాత్రయొక్క రాజసికాంశమునుండి ఒక్కొక్క కర్మేంద్రియము పుట్టును.

ఐదు తన్మాత్రలయొక్క మొత్తము రాజసికాంశమునుండి ప్రాణము పుట్టును.

పంచతన్మాత్రలయొక్క తామసికాంశమునుండి పంచభూతములు పుట్టును.

పంచభూతములయొక్క పంచీకరణమునుండి వ్యక్తమగు ప్రపంచ మంతయు పుట్టును. పంచీకరణ మనగా ప్రధానభూతము సగమును, ఇతర భూతములు ఒక్కొకటిలో ఎనిమిదవభాగమును చేరి రెండవసగమును కలిసి ఒక మహాభూతము కలుగుట.

ఇప్పటికిని పాశ్చాత్య ప్రకృతి శాస్త్రవేత్తలు నిర్జీవమగు అవ్యక్తము (ప్రకృతి) నుండి ఇంద్రియములు మనస్సు ఎట్లు పరిణమించినవో ఊహింప జాలకున్నారు. అనగా నిర్జీవపదార్థ మగు మూలద్రవ్యము ఎట్లు తనంతట తాను చైతన్యము కలిగి సృష్టిగా పరిణామము చెందినవో చెప్పలేరు. ఈ విషయమై ప్రకృతిపురుషుల సంయోగముచే ఏర్పడిన పంచభూతముల పంచీకరణపద్ధతిని సజీవ, నిర్జీవ సృష్టి అంతయు ఎట్లు ఏర్పడెనో పాశ్చా

కులు పైని చెప్పినట్లు ఊహింపగలిగిరి. వీరు *84 లక్షల జీవయోనులను వర్గీకరించియున్నారు. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు సృష్టియొక్క ఉత్పత్తినిగూర్చి ఏదోయొక విధముగ సిద్ధాంతీకరింపగలిగిరి. 2వ ఖండములో నవీనదర్శనముల క్రింద చూడనగును. కాని, ఈ సృష్టి తిరిగి ప్రళయ కాలమున నామరూపములు లేని బ్రహ్మమునందు ఎటుల లయ మగునో ఊహింపజాలకున్నారు. ఈ విషయమునుగూర్చి పౌరాణికుల సిద్ధాంతములు పరిశీలింపదగినవి.

భాగవత పురాణము నందు సృష్టికర్త యొక్క వర్ణనలేగాక లోక కళ్యాణార్థమై మానవుడుగా అవతరించిన శ్రీకృష్ణుని లీలల ద్వారా తత్వ జ్ఞానము బోధింపబడుచు, భక్తిమార్గప్రధానముగా మోక్షమును పొందు పద్ధతులు చూపబడినవి.

## కాలప్రమాణము

కాలక్రమమున మానవజాతి ఎటుల పరిణమించి నదియు ఈ పురాణములందు గలదు. మరియు వీనియందు కాలప్రమాణ మిటుల వర్ణింపబడియున్నది. కృతయుగ, త్రేతాయుగ, ద్వాపరయుగ, కలియుగము లని నాలుగు యుగములు కలవు. వీనిలో కలియుగము 4,32,000 సంవత్సరముల ప్రమాణమును కలిగియుండును. ఈ నాలుగు యుగములకు కలిసి మహాయుగ మని పేరు. కలియుగమునకు రెండు రెట్లు ద్వాపరయుగమును, మూడురెట్లు త్రేతాయుగమును, నాలుగురెట్లు కృతయుగమును ప్రమాణమును కలిగియున్నవి. అనగా ఒక మహాయుగము పదికలియుగముల కాలమును కలిగియుండును.

## మన్వంతరములు

ఇట్టివి 71 మహాయుగములు కలిసిన ఒక మన్వంతర మగును. (43, 20,000 × 71 సంవత్సరములు). ప్రతి యొక మన్వంతరమును ఒక్కొక మనువు పరిపాలించుచుండును. ఇట్టి మన్వంతరములు పదునాలుగుకలవు. (1) స్వాయంభువ, (2) స్వారోచిష, (3) ఉత్తమ, (4) తామస, (5) రైవత, (6) చాక్షుష, (7) వైవస్వత, (8) సూర్యసావర్ణి, (9) దక్షసావర్ణి, (10) బ్రహ్మసావర్ణి, (11) ధర్మసావర్ణి, (12) రుద్రసావర్ణి,

* గీతారహస్యము.

(13) రౌచ్యదైవసావర్ణి, (14) ఇంద్రసావర్ణి అని మన్వంతరముల పాలించెడి మనువులకు పేర్లు.

## ప్రళయములు

ఇవిగాక ఆరు మహాయుగముల సంధికాలము వీని మధ్య కలదు. ఈ పదునాలుగు మన్వంతరములును ఈ సంధికాలమును (అనగా 14×71+6=1,000 మహాయుగములు) గడచిన వెంటనే బ్రహ్మయొక్క పగటికాలము ముగిసి రాత్రి అరంభించును. బ్రహ్మయొక్క రాత్రియు వెయ్యి మహాయుగముల కాలము పట్టును. బ్రహ్మయొక్క దినాంతమునకే ప్రళయ మని పేరు. ఇట్టి ప్రళయమునకు నైమిత్తికప్రళయ మని పేరు. ఇందు భూ, ర్భువ, స్సువ ర్లోకములు మూడును సంపూర్ణముగ నశించి ప్రకృతియందు లయమగును. అతని (బ్రహ్మ) ఉదయారంభమే సృష్టి ప్రారంభము. బ్రహ్మయొక్క దినమునకు కల్ప మని పేరు. బ్రహ్మ ఇట్టి దినములు గల నూరు సంవత్సరములు జీవించును. బ్రహ్మయొక్క అయుపు పూర్తిఅయిన పిమ్మట ప్రళయము సంభవించి, సప్తలోకములును, తలములును సర్వము నశించి, ప్రకృతిలో లీన మగును. దీనికే ప్రకృతిప్రళయ మని పేరు. ఇదియే అవ్యక్తస్థితి. ఇప్పుడు అవ్యక్తము మాత్రము నిలుచును.

ప్రస్తుతము మనము (చిత్రభాను సంవత్సరమున) వైవస్వత మన్వంతరములో, 28వ మహాయుగము యొక్క, కలియుగ ప్రథమ పాదములో 5042 వ సంవత్సరములో ఉన్నాము. మరియు బ్రహ్మ తనయొక్క 51 వ సంవత్సరములో మొదటి దినమైన శ్వేతవరాహ కల్పమును గడుపుచున్నాడు. మనలెక్కల ప్రకారము సృష్టి అరంభమై ఇప్పటికి నూటతొంబది అయిదుకోట్లు, యాభైఎనిమిది లక్షల, ఎనుబది అయిదువేల నలుబది మూడు (195,58,85,043) సంవత్సరము లైనట్లు తెలియుచున్నది. పాశ్చాత్యుల లెక్కప్రకారమును,భూగర్భశాస్త్రజ్ఞుల లెక్కప్రకారమునుకూడ దాదాపు మనలెక్క సరిపోవుచున్నది. సృష్టి పుట్టి రెండువందలకోట్లు సంవత్సరము లైనదని వారి అభిప్రాయము.

## శాస్త్రాభివృద్ధి

ఈ కాలమున పలువిధముల శాస్త్రాభివృద్ధికూడ జరిగెను. అవంతి పురమున నుండిన జ్యోతిష్కుడు వరాహమిహిరుడు (505_578) 'బృహత్సంహిత' యను ఉద్గ్రంథమును రచియించెను. అది యిప్పటికిని

హిందూస్థాన నాగరికతను కాపాడుచున్నది. పాటలీపుత్రమున ఆర్యభట్టుడను జ్యోతిష్కుడు క్రీ. శ. 476 లో పుట్టెను. ఇతడు సూర్య చంద్రగ్రహణములకు చంద్రుడును, భూచ్ఛాయయు కారణమని కనిపెట్టెను. ఈ పౌరాణికయుగమునం దనేక రాసాయనికగ్రంథములు పుట్టియున్నవి. ఈ యుగములోనే చరకసుశ్రుతాదివైద్య గ్రంథములు మిక్కిలి యభివృద్ధిలోనుండి అరబ్బీభాషలోనికి తర్జుమాచేయబడెను. రసాయనశాస్త్రముకూడ అరబ్బీలద్వారా ఐరోపాఖండమునకు తరువాత వ్యాప్తమయ్యెను. శస్త్రచికిత్స చాల అభివృద్ధియం దుండెను. అంకగణితము (Arithmetics) బీజగణితము (Algebra) లు హిందూస్థానమునందు పుట్టి ఇతరదేశములలో ప్రసరించినందున మనదేశ మన్ని దేశముల వారికిని గురుస్థానమై యొప్పెను. దశాంకగణిత (Decimal) మిచ్చట బుట్టెను. నక్షత్రముల పరిశోధనలకు బీజగణితమును, రేఖాగణితమును (Geometry) హిందువులే అందఱకు నేర్పిరి.

## వా ఙ్మ య ము

కావ్య కర్తలలో మొదటివాడు కాళిదాసు. ఇతడు ఆంధ్రుడని శ్రీ కే. వి. లక్ష్మణరావుగారు తెలిపియున్నారు. కాళిదాసు తరువాత కొలది కాలములోనే భారవి "కిరాతార్జునీయము" ను రచించెను. చిత్రవిచిత్రములగు కథలు గల పంచతంత్ర మనెడి వచనప్రబంధ మీ కాలమున రచింపబడెను (క్రీ. శ 537—572). 7వ శతాబ్దమున దండి కవి 'దశకుమార చరిత్రము'ను, బాణభట్టుడు 'కాదంబరి'యు, సుబంధుడు 'వాసవదత్త' యను వచనకావ్యమును రచియించిరి. భర్తృహరి నీతిశతకమును రచించెను. 8వ శతాబ్దమున భవభూతి మాలతీమాధవము, ఉత్తర రామచరిత్రము, మహావీరచరిత్రము అను మూడు నాటకములను రచించెను. ఇతడు ఆంధ్రుడు. ఉత్తరరామచరిత్రమునందు భవభూతి కాళిదాసును మించె నని పండితుల యభిప్రాయము.

## శి ల్ప క ళా భి వృ ద్ధి

పౌరాణిక యుగమున హిందూమతాభివృద్ధితో శిల్పకళయు నభివృద్ధి జెంది పెక్కు దేవాలయములు నిర్మింపబడెను. "ఒరిస్సా"లోని భువనే

శ్వర దేవాలయము (క్రీ. శ. 650) కార్నక్ లోని కృష్ణదేవాలయము (9. వ శతాబ్దము) పూరీజగన్నాథ దేవాలయము (క్రీ. శ 1174) కట్టబడియుండెను.

దక్షిణదేశములో "ఎల్లోరా" గుహలు, 8, 9 శతాబ్దములందు సొగసైన శిల్పనైపుణ్యముతో పర్వతములలో చెక్కబడెను. తంజావూరు, శ్రీరంగము, మధుర, రామేశ్వరము మొదలైన స్థలములయందలి అత్యద్భుతదేవాలయములు 13 వ శతాబ్దానంతరము నిర్మింపబడియెను.

## శైవ సిద్ధాంతము

దక్షిణదేశమున, ముఖ్యముగా అరవదేశములో, శైవమతము మిక్కిలి ప్రచారములో నుండెను. ఇది సేశ్వరసాంఖ్యమువంటిది. ఇందు ఈశ్వరుడు, జీవులు, ప్రకృతి అను మూడు నిత్యమై ప్రత్యక్షమైన, పదార్థములు గలవు. జీవాత్మను ప్రకృతిబంధమునుండి విడదీసి క్రమముగా ఈశ్వరునిలో చేర్చుట ఈ సిద్ధాంతముయొక్క ఆదర్శము. (1) ఈశ్వరుడు - శివుడు, పశుపతి. (2) జీవుడు - పశువు. (3) పాశము లేక సంసారము - బంధము. జ్ఞానము, క్రియ, యోగము, చర్య అను నీ నాలుగుసాధనములచే పశువు తన బంధములను విడగొట్టుకొని పశుపతిని చేరుట మోక్ష మని ఈ సిద్ధాంతమునందు సలక్షణముగా పోల్చి చెప్పబడినది.

## రేణుకాచార్యులు, వీరశైవము

సామాన్యశైవము, మిశ్రశైవము, వీరశైవము, పాశుపతము అనునవి శైవమునందు ముఖ్యమైన శాఖలు. మొత్తముమీద శైవమతములో శివుడే సర్వోత్తము డను సిద్ధాంతము ముఖ్యము. వీరు భస్మ, రుద్రాక్ష, లింగ ధారణ, పంచాక్షరమంత్ర, తీర్థ, ప్రసాదములు సేవింపవలెను. నైధ్రువ, ఉపమన్యు, దుర్వాస, అగస్త్యాది ప్రాచీన ఋషులును, రేణుక, దారుక, ఘంటాకర్ణ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్య, నీలకంఠ, శ్రీకంఠ, నకులీశ, ఈశాన, క్రియాశక్తి, శ్రీపతిపండిత అను ఆచార్యులు శివమత ప్రచారకులలో ముఖ్యులు. నైజాంరాజ్యములోని కొలనుపాకలో 'వతరించిన వీరశైవప్రచారకుడు రేణుకాచార్యుడును, బెజవాడ నివాసి గు శ్రీపతి పండితుడు (1060)ను ఆంధ్రులు. రేణుకాచార్యులు 18 ...ఠములను స్థాపించెను. పండితారాధ్యుల మఠములు శ్రీశైలము, కుంతకల్లులలో కలవు.

12 వ శతాబ్దమున మహారాష్ట్ర దేశమునందును, కర్ణాట దేశము నందును లింగాయతు లను శైవమతస్థులు బసవేశ్వరుని శిష్యులుగా బయలు దేరిరి. వీరు దేవాలయములకు బదులు మఠములకు పోవుదురు.

## అరవదేశమున శివభక్తులు:

### తిరుమూలర్

అరవ శతాబ్దమునాటి తిరుమూలర్ అను శివభక్తుడు గొప్ప సిద్ధులలో నొకడు. ఇతడు దక్షిణమునకు వచ్చి చనిపోయిన ఒక గొల్లవాని శరీరము నందు ప్రవేశించి భక్తి పూరితము లగు మూడువేల గీతములను రచించెను. తగిన శ్రద్ధ కలవారి కందరికిని అణిమాది సిద్ధులు లభించునని యితడు బోధించెను. దక్షిణ దేశమున మాణిక్యవాచకర్, తిరుణావక్కరుసు (అప్పర్) జ్ఞానసంబంధర్, సుందరమూర్తి, ఈ నలుగురును అనేక శివాలయములలో విగ్రహరూపముగా ఇప్పటికిని పూజింపబడుచున్నారు.

### మాణిక్యవాచకర్

మాణిక్యవాచకర్ 18 సంవత్సరములు దాటక మునుపే గొప్ప విద్వాంసుడని కీర్తి సంపాదించి, పాండ్యరాజుయొక్క ప్రధానమంత్రియైన బ్రాహ్మణుడు. ఇట్లు రాజ్యవైభవమున నుండియు భక్తిచే పరవశుడై గుఱ్ఱములు కొనుటకై రాజిచ్చిన ధనమును దేవాలయములు కట్టుట కుపయోగించెను. అంతట ఆ ఉద్యోగము పోయి పరమభక్తుడుగా పరిణమించి ఒక దేవాలయమునుండి మరియొకదానికి తిరుగుచు రత్నములవంటి పాటలను తిరువచకం అను పేరున అరవములో రచించెను. ఇవియే అరవదేశమున మోక్షాన్వేషకులకు ఇప్పటికిని ఉత్తమసందేశములు. ఇతడు చిదంబరమున బౌద్ధభిక్షుకుల నోడించి శ్రీ నటరాజు సన్నిధిని బంగారు మంటపములో పెద్ద వెలుతురుగా వెలిగి అదృశ్యు డాయె నని చెప్పుదురు.

### అప్పర్ (తిరుణావక్కరుప్పు)

క్రీస్తువెనుక 7 వ శతాబ్దమున కంచి రాజధానిగా గల ఒకట మహేంద్రు డను పల్లవరాజు (600 - 630) కాలమున సంపద్యుక్తా వెళ్లాళ కుటుంబమున జనించెను. చిన్నతనమునందే జైనవిశేష సహవాసముచే జైనుడయ్యెను. ఒకనాడు భరించరాని

వలన బాధపడుచు శివాలయములోనికి వెళ్ళి భక్త్యావేశముచే పాడుటకు ప్రారంభించెను. నొప్పి పోయినది. అప్పుడు తిరునావక్కరుసు అను బిరుదమును ఆకాశవాణి అతనికి ప్రసాదించెను. "పవిత్రమైన పలుకులకు రాజు" అని దాని అర్థము. అంతట అతడు గొప్ప శివభక్తుడాయెను. జైనులు భయపడి ఇతనిని గూర్చి రాజుతో చెప్పగా, ఇతని ప్రాణములు తీయుటకా రాజు అనేక విధముల ప్రయత్నించెను. ప్రహ్లాదునివలె భక్తి విశ్వాసములతో ఇంచుకయైనను కోపము సూచింపక మారు మాటాడక అన్నిటినుండియు తప్పించుకొనెను. ఒకానొక సమయమున ఇతనికి పెద్ద గుండురాతిని కట్టి సముద్రములో ముంచగా ఆ రాయి బెండువలె తేలిపోయి అతనిని ఒడ్డుచేర్చెను. అస్థలమున ఇప్పటికిని ప్రతిసంవత్సరము ఉత్సవము జరుపుచున్నారు. పల్లవరాజును ఇతనిభక్తి కాశ్చర్యపడి తానును శైవుడయ్యెను. చిదంబరమునకు వచ్చినప్పుడు బాల భక్తుడగు సంబంధర్ అను భక్తుని కలసికొనెను. ఈతడు ఇద్దరిలో పెద్దవాడగుటచే "అప్పర్" అనగా తండ్రియని పేరువచ్చెను. వీరిద్దరును అనేక పాటలు రచించుచు పలు దేవాలయములు తిరిగిరి. నలభైతొమ్మిది వేల పాటలను ఈయన రచించెననియు, అందులో మూడువందల పదకొండు మాత్రమే ఇప్పుడు నిలచియున్నవనియు చెప్పుదురు. ఈ పాటలీ నాటికిని వేల కొలది అరవ దేశీయులకు మోక్షదాయకములుగా ఉన్నవి. ఇతడు నిరాడంబరముగా శాంచిగుడ్డతో 81 సంవత్సరములు జీవించెను.

## సంబంధర్

దేశమునందు ప్రబలియున్న నాస్తికత్వమును కపటబుద్ధిని నివారించుటకై తలిదండ్రుల ప్రార్థనల ఫలముగా ఇతడు క్రీ. శ. 639 ప్రాంతమున తంజావూరు దగ్గర షియాలి అనుగ్రామమున జన్మించెను. ఇతనికి 4 వ సంవత్సరమున ఈశ్వరదర్శనమై జ్ఞానోత్పత్తి యగుటచే జ్ఞానసంబంధర్ అనుపేరు వచ్చెను. ఇందును గూర్చి ఒకకథ కలదు. ఇతడు నాలుగు సంవత్సరముల పిల్లవాడుగా నున్నప్పుడు తండ్రి ఒకనాడు దేవాలయమును అంటియున్న కోనేటిలో స్నానము చేయుటకు పిల్లవానిని వెంటబెట్టుకొని వెళ్ళెను. పిల్లవాడు గట్టుమీద నిలచియుండెను. తండ్రి చెరువులో దిగి స్నానము చేయుటకు మునిగెను. అంతట పిల్లవాడు అటు చూచి, తండ్రి గానక యుండుటచే, గోపురశిఖరము వైపు దృష్టి నిలిపి

అమ్మా! నాయనా! అని ఏడ్చుటకు ప్రారంభించెను. అంతట పార్వతీ పరమేశ్వరులు అతనికి ప్రత్యక్షమైరి. బంగారు గిన్నెలో భక్తిపూరితమైన పాలను తెచ్చి పార్వతి ఆ పిల్లవానికి త్రాగించెను. వెంటనే ఆ పిల్లవానికి అమితమైన జ్ఞానము, ఉత్కృష్టమైన శక్తులు, ఆనందమును పొందుకొని వచ్చెను. ఇందుచే ఇతనికి జ్ఞానసంబంధర్ అను పేరు కలిగెను. తండ్రి నీటి నుండి లేచివచ్చి పిల్లవాని పెదవులకు పాలు అంటుకొనుట చూచి నీకు పాలు ఎవరు ఇచ్చిరని అడిగెను. సంబంధర్ ఆకాశము వైపునకు చూపుచు శివపార్వతులు తనకు ప్రసాదించిన విషయమును గూర్చి మనోహరమైన పాటలను రచించుటకు ప్రారంభించెను. ఇతడప్పటి నుండియు భక్తిపూరితము లగు పాటలను రచించుచు వివిధదేవాలయముల దర్శించుచు వచ్చెను. ఒకనాడు అస్పృశ్యు డగు తిరునీలకంఠయాళ్వార్ అను ఒక భక్తుడు - సంగీతవిద్యాకోవిదుడు తన భార్యతో వచ్చి ఇతనిని దర్శించెను. ఇతడు (జ్ఞానసంబంధర్) ఆ అస్పృశ్యదంపతులను మిక్కిలి దయతో ఆదరించి తమ యాత్రలలో తనతో కూడ తీసుకొని పోయెను. సంబంధర్ పాటలను ఇతడు వీణతో పాడుచుండగా బహుశ్రావ్యముగా ఉండెను. జైనుడగు పాండ్యరాజు రాజధానియగు మధురలో సంబంధరు ఉన్న మఠమునకు నిప్పుపెట్టి యతని కాల్చి చంపుటకు శత్రువులు ప్రయత్నించిరి. కాని తన మహిమచే అట్టి కష్టముల నన్నిటిని తప్పించుకొని పాండ్యరాజును శైవమతములో కలుపుకొనెను. ఇచ్చట ఒక కథకలదు. రాజు జైనుడు. అతనికి అపారమైన జ్వరము వచ్చెను. జైనులకును, భక్తసంబంధరకును వాదవివాదములు జరుగుచుండెను. ఎవరు రాజుయొక్క జ్వరమును కుదిర్చెదరో, వారు గెలిచినట్లుగా ఎంచబడుదు రని నిర్ణయింపబడెను. అంతట సంబంధర్ ఈ పందెమునందు గెలిచెను. రాజు జైనమతమును విడిచి తిరిగి హిందూమతమును అవలంబించెను.

16 సంవత్సరములు రాకపూర్వమే మతదిగ్విజయము చేసి సంబంధర్ ఇంటికి వచ్చెను. తలిదండ్రుల ఒత్తిడిచే వివాహమునకు ఒప్పుకొని వివాహసంస్కారము ముగియకముందే తానును, తనభార్యయు, తనభక్తులును దైవప్రార్థనము చేయుచు దివ్యమంగళ తేజస్సులో మాయమై పోయిరి. సంబంధర్ పదహారు వేలపాటలను రచించెను. అందు మూడువందల ఎనుబదియైదు మాత్ర మిప్పుడు నిలిచియున్నవి. ఆకాలమునాటికే శిథిలమైన జైనమత

నిరసనమును, స్త్రీల పవిత్రతయు, సృష్టి సౌందర్యమును, భగవంతుని ప్రేమయు మిక్కిలి మనోహరముగ రచింపబడి యున్నవి. ఇతని పాట లలో ఉమాసహితుడును, సగుణుడును అగు శివుని వర్ణింపని పాట యొక టియు నుండదు. ఈ నలుగురు శైవాచార్యులలో ఈ పదహారు సంవత్సర ములు గల బాలభక్తునే గొప్పవానిగా ఎంచుదురు.

## సుందరమూర్తి

ఇతడు అరవ దేశమున శివార్చకుల కుటుంబములో పుట్టి ఆ ప్రాం తపు రాజమందిరమున పెరిగెను. ఇతని వివాహదినమున ఒక వృద్ధ బ్రాహ్మ ణుడు వచ్చి, పెండ్లికొడుకు తన సేవకుడనియు, వెంటనే తనతో కూడ వచ్చి తన సేవ చేయవలెననియు లిఖితపూర్వక మైన నిదర్శనమును చూపె నెను. అంతట సుందరమూర్తి అతనితో కూడ పోగా ఆ ముసలి బ్రాహ్మ ణుడు తాను పరమేశ్వరుడగు శివుడే అని అతనికి దర్శన మిచ్చెను. ఇతడు శివభక్తుడయి, పుణ్యక్షేత్రముల తిరుగుచు మనోహర మైన పాటలు పాడు కొనుచు చిదంబరము చేరెను. అచ్చటినుండి భగవత్ప్రేరితుడయి, తిరువా లూరునకు పోయి గొప్ప శివభక్తురాలైన పార్వతి అనెడి శూద్ర కన్యను పెండ్లి ఆడి, ఇద్దరును భగవద్భక్తి యందే నిమగ్ను లగుచుండిరి. అతని సంసారమునకు కావలసిన సమస్తపరికరములను ఆ భగవంతుడే అద్భుతరీతిని ప్రసాదించుచుండెను. అరవైమూడు సిద్ధుల పేర్లు ఇతని పాటలలో నున్నవి.

## నా లు గు పం థ లు

శైవభక్తులకు మోక్షదాయకమగు పంథలు నాలుగు కలవు.

ఈ నలుగురు శైవాచార్యులు తమ జీవితములో (అప్పర్) దాసమార్గ మగు చర్యయు, (జ్ఞానసంబంధర్) సత్పుత్రమార్గమగు క్రియయు, (సుందర మూర్తి) సహచరమార్గమగు యోగమును, (మాణిక్యవాచకర్) సత్యమార్గ మగు జ్ఞానమును దృష్టాంత పూర్వకముగ నిరూపించిరి. ఇతర శైవభక్తులలో నైప్పురులు నాయనార్ అను రాజును, ప్రథమమున బౌద్ధుడుగా నుండి తరువాత శైవభక్తుడుగా మారిన శాక్యనయనారును, హరిజనుడుగా జన్మించి భగవదనుగ్రహముచే చిదంబర దేవాలయములోని శివుని దర్శింపగలిగిన భక్తనందనారును ముఖ్యులు.

## శైవ భక్తురాండ్రు.

తమ భర్తలతో బాటు ఎన్ని కష్టముల నైనను భరించి, శివభక్తియే ప్రధానముగా చేసికొనిన శివభక్తురాండ్రలో ముగ్గురు, అరువది ముగ్గురుభక్తులలో చేర్చబడి, దేవాలయములలో అసమానమర్యాదను పొందుచున్నారు. అందు కారైకాల్ అమ్మయార్ ప్రముఖురాలు.

## అవ్వయార్.

63 గురిలో చేరక పోయినను అవ్వయారు అను శివభక్తురాలు శాశ్వతమైనట్టియు, సాహిత్యమును దైవభక్తియు కలిగినట్టియు గీతము లనేకములు రచించెను. ఈ గీతములను అరవ దేశమునందు పాఠశాలలలో నేటికిని బోధించుచున్నారు.

## ఈ శైవభక్తులు వైదిక సంప్రదాయమువారు

వేదములకును ఈ ఆచార్యుల బోధలకును గల సంబంధములను వివరించుచు ఒక గ్రంథకర్త చక్కని ఉపమానమును చెప్పెను. వేదములు ఆవు. ఆగమములు ఆ యావుపాలు. ఈ నలుగురు శైవాచార్యుల యొక్క గీతములు పాలలోని వెన్న. తిరువన్నైనల్లూర్ భక్తమెకండార్ (సత్యమును తెలిసినవాడు) యొక్క గానమున గల శివజ్ఞానబోధము ఆ వెన్నయొక్క రుచి యని చమత్కారముగ వర్ణించెను.

## హిందూమతపునరుద్ధరణము:

### కుమారిలభట్టు

ఇతడు తెలుగువాడనియు, తైత్తిరీయశాఖవాడనియు, గంజాము జిల్లాలోని జయమంగళ మను గ్రామమునందు 6 వ శతాబ్దమున బుట్టె ననియు "జినవిజయము" అను జైనగ్రంథములో గలదు. జైనులు తమ మతగ్రంథముల నితనికి చూపనందున "కుమారిలభట్టు" జైనవేషము వేసుకొని యా ధర్మతత్త్వములను నేర్చుకొని, జైనమతఖండనము చేసినందున జైను లితనిని "గురుద్రోహి" యనెదరు. తరువాత జన్మించిన శంకరాచార్యులవారి మార్గమున కితడు తన ప్రచారముచే బహు సుకరమయిన మార్గమును కల్పించి యుండెను. జైమినికృత పూర్వమీమాంసపై ఇతడు వ్రాసిన భాష్య మొకటి కలదు.

## శంకరాచార్యులు

విశ్వవిఖ్యాతుడగు శంకరాచార్యుడు 7 వ శతాబ్దమున కాలడి అను గ్రామమున ఉదయించిన మళయాళ బ్రాహ్మణుడు. ఇతడు 32 సంవత్సరములు మాత్రము జీవించియుండి బ్రహ్మచర్యము నుండియే సన్యాసియై యాసేతు హిమాచలము తిరిగి తన ప్రచారముచే బౌద్ధమతమును పూర్తిగా నణగంలుచేసెను. ఇతడు తత్త్వవేత్తలకు నద్వైతసిద్ధాంతమును అనగా జీవేశ్వరులకు నైక్యమును బోధించెను. కాని సామాన్యజనులకు శివ, విష్ణు, గణపతి మొదలగు దేవతల నందరిని భేదము లేకుండ పూజింపవలయు నను పౌరాణికమతమును బోధించెను. ఇతడు బౌద్ధదర్శనములలోని యనేక సిద్ధాంతములను గ్రహించి బుద్ధుడు విష్ణువుయొక్క దశావతారములలో నొక్క యవతారమని చెప్పి యనేక బౌద్ధులను హిందువులనుగా మార్చెననియెదరు. శంకరాచార్యుడు హిమాలయముపైని బదరీకేదారములో మృతు డయ్యెను.

1 బదరీకేదారము, 2 శృంగేరి, 3 జగన్నాథము, 4 ద్వారక అను మఠములను నాలుగుదిశలయందు నాలుగు స్థాపించెను. శాంకరమతమును అద్వైతమనియు, స్మార్త మనియు చెప్పెదరు. హిందువులలో నూటికి ఎనుబది మంది స్మార్తమతస్థులు.

## రామానుజాచార్యులు

11 వ శతాబ్దమునందు చెన్నపట్టణ సమీపమున శ్రీ పెరంబుత్తూరులో (1037-1137) నీతడు జన్మించెను. ఈతడు కాంచీ పట్టణమునందు విద్య నభ్యసించి విష్ణుభక్తిని ప్రబలజేసెను. అదివఱకు శివస్థలముగా నున్న తిరుపతి దేవాలయమును వైష్ణవులగుడిగా మార్చెను. శ్రీరంగమున సమాధి జెందెను. ఇతని సంప్రదాయమును విశిష్టాద్వైత మనియెదరు, శంకరుడు జ్ఞానమువలననే ముక్తిగల్గునని చెప్పెను. రామానుజుడు భక్తిప్రపత్తుల వలన ముక్తి గలుగునని బోధించెను. ప్రపంచము మిథ్య కాదనియు, ముక్తి సమయమున జీవుడీశ్వరసామీప్యము గలవాడైనను పూర్తిగా నాతని కీశ్వరస్వరూపము రాదనియు నితని యభిప్రాయము.

## మధ్వాచార్యులు

ద్వైతమతస్థాపనాచార్యులగు మధ్వాచార్యులు 1199 వ సంవత్సర

మున ఉడిపి గ్రామమునందు పుట్టెను. ఇతనికి మొదట ఆనందతీర్థులని పేరు. శంకరాచార్యుల అద్వైతమతమునకు సంపూర్ణవిరోధియైన దీ ద్వైతమతము. జీవేశ్వరుల కైక్య మెన్నడును లేదని వీరి సిద్ధాంతము.

## బసవేశ్వరుడు

ఈతడు 1162 లో కల్యాణపురములో "బిజ్జల" రాజునకు మంత్రిగా నుండెను. ఇతడు మొదట బ్రాహ్మణుడైనను ఉపనయనముతో పనిలేదనియు, శివభక్తియే ప్రధానమనియు, శివలింగమును ధరించినవా డేజాతివాడైనను వానిని గౌరవింపవలయు ననియు బోధించెను.

ఇతని శిష్యులలో నన్నికులములవారలును గలరు. భక్తి ప్రధాన మతమును బోధించిన గొప్ప సంస్కర్తలలో నీత డొకడు. ఇతడు జంగమ మతమునకు మూలాచార్యుడు. బసవపురాణ మితని మహిమలను వర్ణించును. అన్యమతస్థులను, అనగ వైదిక, జైనాదులను చంపిన యెడల పాపము లేదని వీరి వేద మయిన బసవపురాణము బోధించుచున్నది. ఇందనేక వైద్యవిషయములు కూడ తెలుపబడి యున్నవి.

## హిందూమతముయొక్క వ్యాపనము

ఈ పురాణయుగమున ఒక్కొక్క మతము వారు తమతమ మతములను ప్రజలలో ప్రచారము చేయుటకై - శివపక్షపాతులు శైవ సంప్రదాయములను, వైష్ణవ పక్షపాతులు వారి సంప్రదాయములను, కథలలో ఇమిడ్చి తమతమ మతములను వ్యాపింప జేయుచు వచ్చిరి. పురాణముల యొక్క వ్యాపనము హెచ్చిన కొలదియు, జైన బౌద్ధమతముల పలుకుబడి తగ్గుట కారంభించెను.*

హిందూమతము నిజముగా ఒకమతము గాదనియు, అనేక మతముల యొక్క చక్కని సమ్మేళన (Federation) అనియు తెలుసుకొనుట అవసరము. మహమ్మదునుండి పుట్టిన మహమ్మదీయమతము, క్రీస్తునుండి పుట్టిన క్రైస్తవమతము, బుద్ధునినుండి పుట్టిన బౌద్ధమతములవలె హిందూ

* రామానుజ, మధ్వ, బసవేశ్వరులు ఈ యుగమునకు పిమ్మట యుగమునకు చెందినవారైనను, సందర్భమునుబట్టి ఈ యుగములోనే వారిని గురించి వ్రాసియున్నాము.

మతమొక మతకర్తనుండి పుట్టినది కాదు. అనేకమతములయొక్క సారము పరంపరాప్రాప్తముగా కూడి ఏర్పడి సనాతనమై, శాశ్వతమైన ధర్మము హిందూధర్మ మనబడును. ఈ ధర్మమే మతము. పురాతనములగు శ్రుతుల ననుసరించి యజ్ఞయాగాదులను చేసికొనువారికి ఇందు స్థలము గలదు. యజ్ఞయాగాదులను నిరసించి భక్తియే ప్రధానమనియు, తన సర్వస్వమును భగవంతుని కర్పించిన యెడల ఆ భగవంతుడే పిల్లి తన పిల్లలను సంరక్షించునట్లు భక్తునకు గావలసిన సమస్తమును తానే చేయునని నమ్మెడు వైష్ణవులకును, ఫలాపేక్షచే జేయు యాగాది కర్మలవలన ప్రయోజనము లేదని నిష్కామముగా కర్మలను జేయుచు తమ తమ విధ్యుక్తధర్మములను సరిగా నొనరించుటయే మోక్షమనెడి కర్మయోగులకును, సర్వకర్మత్యాగము చేసినగాని మోక్షములేదను సన్యాసులకును, ఆత్మానాత్మ జ్ఞానమే మోక్ష మగుటచే అన్నియాశ్రమముల వారికిని యోగాభ్యాసముచేతనే మోక్షము సాధ్యము కాగల దను పాతంజలయోగులకును, తుదకు దేవుడే లేడనెడి నాస్తికులకును, దేవతాప్రీత్యర్థము క్రూరమగు జంతుబలుల నిచ్చి యానందించెడు శాక్తేయులకును, అల్లాస్వామి మొదలయిన ఇతరమతము లందలి దేవతలను ఆరాధించు పలుజాతులవారికిని,రాళ్ళను, రప్పలను, చెట్లను,తుప్పలను, నాగులను పరమభక్తితో పూజించు సర్వజనములకును కూడ తాము హిందువులమని చెప్పుకొనుటకు హక్కుగలదు. ఇని యన్నియు మోక్షమను నొకటే గమ్యస్థానమునకు చేరుటకు అనేక మార్గములు (పంథలు). ఒకటే మేడనెక్కుటకు రెండు మూడువైపుల మెట్లున్నట్లు, ఈ మార్గము లన్నియు ఒకటే ఆదర్శమును బోధించును. అనేకములగు చిత్రవిచిత్రము లయిన వర్ణములుగల శిలలచే మనోహరముగా నిర్మింపబడిన మందిరమువలె హిందూధర్మము ఎల్ల ధర్మములకు ఉనికిపట్టయి ఎవరికి వారు తమ మతమునుగూర్చి గర్వపడుటకు తగిన యసామాన్యసమ్మేళన మిందు గలదు. వివిధ మతైక్యమున కుదాహరణముగా త్రిమూర్తి, హరిహరనాథుడు మొదలగు దేవతల కల్పనను చూడనగును. మొత్తముమీద చూడగా, మనదేశమునం దిప్పుడు స్మార్తులు, వైష్ణవులు అను రెండు విభాగములు మాత్రము కనబడుచున్నవి. అన్ని కులములవారును నీ రెంటిలో నేదో యొకవిభాగములో చేరుదురు. షడ్దర్శనములని యారుదర్శనములు వేరువేరుగానున్నను ఇవియన్నియు తుదకు నొకదాని కొకటి విరోధములు కావనియు, ఇవియన్నియు ఒకే సత్యమును

బోధించు ననియు హిందువులు తెలిసికొనిరి. ప్రబోధచంద్రోదయ మనెడి సంస్కృతనాటకమునందు చమత్కారముగ బౌద్ధులు, జైనులు మొదలగు నాస్తిక లోకప్రక్రను, వైష్ణవులు, శైవులు మొదలగు ఆస్తికులు మఱి యొకప్రక్కను చక్కగ నటించి తుదకు సనాతన మగు హిందూధర్మము యొక్క విజయమును నిరూపించిరి.

## దే వా ల య ము లు

ఇట్లు హిందూదేశమునం దంతటను సర్వమతసమ్మేళనము జరుగు చుండగా ఇందుకు సహాయముగా ఆగమాచార్యులును, శిల్పులును సామాన్య జనులకు సులభముగ లభ్యమగునట్లు ఆయా జాతులకు, కులములకు తగినట్లు వారివారి దేవతల విగ్రహములను తయారుచేసి, పవిత్రములగు దేవాలయము లందు నెలకొల్పిరి. ఇట్టి విగ్రహములకు సంఘాంగీ కారము కలిగించుటకై పురా తనములగు వేదములను, ఉపనిషత్తులను అధారము చేసికొని వ్రతములను, కల్పములను ప్రత్యేకముగ సృష్టించిరి. దేవాలయములయొక్క గోడలు, స్తంభములు, పైకప్పులు, గోపురములు వీటి నన్నిటిని వేదమయమును, పురాణ మయమును అయిన గాథలచే నింపి, శాస్త్రోక్తముగ విగ్రహములను ప్రతిష్ఠించి వాటి మహిమలను వేయిమడుగుల హెచ్చించిరి. ఇందుచే సామాన్య మయిన ఒక రాతికి మ్రొక్కుచున్నను, తాను దేవునికే మ్రొక్కుచున్నా ననెడి అభిప్రాయము దేవాలయములోనికి పోయిన ప్రతివారికిని గలుగును. ప్రతిమల పూజావిధానమును, ఉత్సవములను పుస్తకములలోని పటముల వలెను, జనసామాన్యమునకు సాంఘికప్రబోధమును గావించు సినీమాలవలెను బోధన సౌలభ్యమునకై ఏర్పడిన విధానములు. విగ్రహారాధన పనికిరా దనినచో పుస్తకములలో బొమ్మలకును, ఈ సినీమాలకును ఏమియు ప్రయో జనము లేదని చెప్పిన ట్లగును.

ఇతర మతస్థులకు ఈ యారాధనసౌలభ్యము తెలియకపోయినను హిందువుల కందరకును సంప్రదాయసిద్ధముగా తెలిసియున్న విషయమే. ఈ ప్రకారము విగ్రహారాధనము కూడ హిందూధర్మమును ఈ దేశమున శాశ్వతముగ స్థాపించిన గొప్ప సాధనములలో ఒకటని చెప్పవచ్చును. ఆయా ఆరాధకుల జ్ఞానపరిమితిని బట్టి ఎవరి అంతస్సుకు వారికి తగినట్లు దే: పూజించుటకు హిందూధర్మమునందు అవకాశముగలదు. ఏకాంతముగా తన యింటియందు గాని, జనసంకీర్ణ మగు దేవాలయమునందు గాని

ఒక్కొక్క వ్యక్తి తన బుద్ధికుశలతను బట్టి స్వతంత్రముగ భగవంతుని ఆరాధించు సౌకర్యము హిందూమతమునందే గలదు.

—"న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్" *

"అజ్ఞానులయి కర్మలయందు మునిగి తెలువారల మనస్సులందు వికల్పమును నీవు కలిగింపవలదు. నీవు యోగివై, సర్వకర్మలను యుక్తుడవై ఆచరించుచు, లోకులు గూడ సంతోషపూర్వకముగ నీ యొక్క మార్గమును క్రమముగ అభ్యసించునట్లు చేయవలెను."

శ్రీ శంకరులు గొప్ప తత్త్వజ్ఞానియు, జగత్తంతయు మిథ్యయని చెప్పెడు అద్వైతి యయినను, ప్రజలకు జ్ఞాన మార్గమును బోధించు ప్రథమ సోపానమయిన విగ్రహారాధనను విడువక యావజ్జీవము తన ఇష్టదేవతయగు శారదా విగ్రహారాధనము చేయుచుండెను. మంద, మధ్యమ, ఉత్తమ బుద్ధిగల సర్వజనులకును తమతమ అధికారమునుబట్టి మోక్షమార్గమును గల్పించునది హిందూధర్మమే నని చెప్పుట కిదియేనిదర్శనము. ఇదియంతయు, హిందూదేశమున పురాణయుగములో నాస్తికమతములు నశించి హిందూధర్మము స్థిరపడిన విధానమును బోధించును.

## హిందూరాజ్యముల విస్తీర్ణము-వలస రాజ్యములు

క్రీ. పూ. 1000 సంవత్సరములను క్రీస్తు తర్వాత 1000 సంవత్సరములును, ఈ మధ్య కాలమున హిందూదేశ నాగరికత సింహళము, బర్మా, సయాం, కంబోడియా, కొచ్చిన్, చైనా, మలయా, ఇండోనేషియా వఱకు తూర్పునను; పశ్చిమమున అఫ్గనిస్థానము, తుర్కిస్థానములలోను; ఉత్తరమున చైనా, కొరియా, జపాన్ దేశములలోను; రాజకీయముగను, ఆధ్యాత్మికముగను కూడ వ్యాపించి యున్నట్లు ముందు అధ్యాయమున చదువగలరు.

కత్తి, నిప్పు చేతబట్టుకొని, మానవజాతి యందు అనేక విధములగు క్రూరవధలను జేయుమార్గముల పురస్కరించుకొని, గజనీమహమ్మదు తనమతమును వ్యాపింపచేసెను. హిందూనాగరికత అట్లు వ్యాపింపబడలేదు.హిందూస్థానము

* గీత 3 - 26.

యొక్క శాశ్వతమైన కీర్తికి గోచీగుడ్డ మాత్రము ఆచ్ఛాదనముగా గల బ్రాహ్మణులును, కాషాయవస్త్రములను ధరించు బౌద్ధ భిక్షువులును కారణము. వీరు సేనలతో గాక ఒంటరిగాపోయి తమ మాతృదేశముయొక్క కీర్తిని, ధర్మవిజయమును తమ ప్రేమమార్గమున, ఆసియాఖండమంతయు దిగ్విజయము గావించిరి. ఆసియా ఖండ మననేల? ఈజిప్టు, గ్రీసు, రోము దేశములలో గూడ హిందూవిజయమును చాటించిరి.

హిందూచైనా, యవద్వీపము, (జావా) బోర్నియో దేశములయందు సంస్కృతమున వ్రాయబడిన శాసనములు అన్నియు దక్షిణ హిందూస్థానమునందలి కాంచిరాజు లగు పల్లవ చక్రవర్తుల గ్రంథలిపియం దున్నవి. ఈ చక్రవర్తుల బిరుదమునందు "వర్మన్" అని కలదు. అందుచేత దక్షిణ హిందూదేశమునుండి ఈ రాష్ట్రములకు హెచ్చుగ వలస పోవుచుండి రని తెలియుచున్నది. ఇప్పటికిని సయాము రాజులు అనేక సందర్భములలో హిందూసంప్రదాయములను అనుసరింతురు. కంబోడియా శాసనమునందు సుశ్రుత, వాత్స్యాయన మొదలగు వారి పేర్లు గలవు. కంబోడియాలోని అంకోర్ వాట్ (నగరదేవాలయము)అను వైష్ణవదేవాలయము రెండవ సూర్యవర్మన్ కాలమున 11 వ శతాబ్దమున కట్టబడినది. ఇది ప్రపంచమునందు ఆశ్చర్యమును గొల్పు మందిరములలో నొకటి. రెండువందల పదమూడు అడుగుల ఎత్తు గల గోపురమును, మందిరములోపల రామాయణము, మహాభారతము, హరివంశములలోని చిత్రవిచిత్రములగు దృశ్యములను చూడనగును.

## ఆరోగ్యశాలలు

క్రీ. శ. 1181 లో జయవర్మన్ మహారాజు కాలమున నూటరెండు ఆరోగ్యశాలలు (Hospitals) వివిధ ప్రాంతములయందు కట్టించెననియు ఆ ఆరోగ్యశాలలకు రాజమందిరములనుండి మందులు తయారుచేసి పంపుచుండిరనియు శాసనమువలన తెలియుచున్నది. ఆ మందులపట్టీ లో రోగుల భోజన సౌకర్యములకు అవశ్యకములగు వస్తువులుగాక తేనె, పిప్పలి, వాము, జాజికాయ, క్షీరములు, కర్పూరము, జీలకఱ్ఱ, ఏలకాయలు, లవంగాలు, దేవదారు, ఇంగువ, వెల్లుల్లి, దశమూలములను, అర్శస్సు (మూలవ్యాధి) చికిత్సనిమిత్తము 1960 పెట్టెలమందులను, ప్రతి సంవత్సరము పంపుచుండి

రని కలదు. ఈ శాసనములన్నియు భైషజ్యగురువుఅను బుద్ధునకు అంకితము చేయబడినవి. సమస్తశాస్త్రములను గూర్చిన అనేక గ్రంథములతో నిండిన గ్రంథాలయములు కాంభోజరాజ్యమున (కంబోడియా) ఉండెను. దీనిని బట్టి అచ్చటిరాజులును, విద్వాంసులును వేదములు, వాల్మీకిరామాయణము, వ్యాసుని భారతము, పాణినివ్యాకరణము, షడ్దర్శనములు మొదలగు గ్రంథములను చదువుచుండిరనియు, సంపూర్ణముగ నా రాజ్యము హిందూ రాజ్యముగ నుండెననియు స్పష్టముగ తెలియుచున్నది.

## సుమత్రా, జావా

సుమత్రా ద్వీపమునకు స్వర్ణద్వీపమనియు, జావాకు యవద్వీపమనియు పేర్లు. ఇందు బంగారు, వెండిగను లుండెనని "టోలమీ"పటమునుండి తెలియుచున్నది. యవద్వీపమున "యవలు" (ఒక విధమైన గోధుమలు) పండుటచే ఈ దేశమునకు ఈ పేరు వచ్చినదని టోలమీ వ్రాసిన భూగోళ శాస్త్రమునందు గలదు. ఈతడు ఈజిప్టులోని అలగ్జాండ్రియా పట్టణములోని జ్యోతిశ్శాస్త్ర పండితుడు; క్రి. శ. 150 సంవత్సరముల నాటివాడు. క్రి. శ. 730 సంవత్సరములనాటి జావాలోని శాసనమునందు దక్షిణ హిందూస్థానము నందలి అగస్త్యాశ్రమమునుగూర్చి గలదు. అగస్త్యుని వంశీయులు అక్కడ నివసించుచుండి రనియు గలదు. ఇప్పటికిని జావాదేశమున రామాయణము సజీవముగా నుండినదనుటకు సందేహము లేదు. రాజమందిరమునందును, బీదసాదల గృహమునందును గూడ రామునియొక్కయు పాండవులయొక్కయు చరిత్రలు తోలుబొమ్మలాటల మూలమున ప్రదర్శించుచుందురు. ఈ జావాదేశమునందు 300 సంవత్సరముల క్రిందట మహమ్మదీయులుగా మారిన ప్రజలు గూడ రామదేవాలయములను ఇప్పటికి పుష్పాలు, ధూపములు మొదలగు వానిని చేతబుచ్చుకొని దర్శించుచుందురు. బలిద్వీపము నందు నేటికి హిందూధర్మము ప్రచారములో నున్నది.

## రాజ్య పద్ధతి

హిందూస్థానమందలి రాజ్యపద్ధతి వేదములలో ఎట్లున్నదో అట్లే కొంచెము ఇంచుమించుగా ఇప్పటికిని ఉన్నదని చెప్పవచ్చును. ఒకే భాషను మాట్లాడుచు ఒకే విధమగు ఆచారవ్యవహారములు కల జనులు నివసించు ప్రాంతమునకు జనపద మని పేరు. జనపదములే గ్రామములు.

అప్పటికిని ఇప్పటికిని రాజ్యము ఎన్ని మార్పులు చెందినను, ఎన్ని విప్లవములు వచ్చినను గ్రామముయొక్క మూలనిర్మాణము మారలేదు. * ఒక్కొక్క గ్రామము జనులకు కావలసిన సమస్తమును కలిగియుండిన స్వరాజ్యము. ప్రజలకు కావలసిన బియ్యము, పప్పు, నూనె, పాలు, నెయ్యి, వస్త్రములు, బండ్లు, వ్యవసాయమునకు కావలసిన పరికరములు, పాత్రలు మొదలగునవి అన్నియు ఆయా గ్రామములలోనే తయారు చేయబడుచుండెను. ఇవిగాక ♦ వైద్యులును, పాటకులును, నగలను చేయుటకు విశ్వకర్మలును, పూదోటలను పెంచి పుష్పాలను విక్రయించువారును, చెప్పులను కుట్టువారును, చాకలి, మంగలి మొదలగువారందరును, ఆయా గ్రామములయందే నివసించుచు సుఖముగా జీవనము గడుపుచుండిరి. ఆ గ్రామము వారిది. గ్రామమునందలి ప్రతివారును "గ్రామము తనది" అనెడి అభిమానము కలిగియుండిరి. గ్రామమును సాంఘిక, రాజకీయ, ఆధ్యాత్మిక దృష్టితో రచింపబడిన ఒకవ్యక్తిగా ఎంచి, గ్రామ మహాదేవతను తమ తల్లిగా పూజించుచుండిరి. ప్రతి గ్రామమునందును మంగళవీధియను పొలిమేరవీధి యుండును. ఆ వీధిగుండ భక్తిపూరితములగు గీతములను, స్తోత్రములను పాడుకొనుచు, ఉదయమునందును సాయంకాలమునందును గ్రామప్రదక్షిణము చేయుచుండెడివారు. దేశాభిమానము గ్రామముల నుండియే ఆరంభించుచున్నది.

## గ్రామరచన

గ్రామములు, ఇప్పటివలె ఏ పద్ధతి లేకుండ కట్టబడిన ఇండ్ల గుంపు కాదు. దాని కొకచట్టనిర్మాణము, ఒకరచన విధింపబడి యుండెను. హిందూస్థానమున నగరరచన నూతనమైనది కాదు. ప్రతిగ్రామము

---

* Parliamentary Committee Report.1932

♦ ఆ కాలపు వైద్యులు గ్రామములలో నివసించుచు, ఇప్పటివలెనే మిక్కిలి గౌరవముగా జీవించుచుండిరనియు, చక్కని ఓషధీజ్ఞానము కలిగి మందులను తయారుచేసి విక్రయించుచుండిరనియు తెలియుచున్నది. మరియు ఎప్పుడు వ్యాధులు వచ్చునా యని కనిపెట్టుకొని యుండెడి వారని ఒక ఋషి వీరిని గురించి హాస్యముగా చెప్పెను. ఋ. వే. 112-3; 10-95; 4; 10-15.

నందును సామాన్యముగా నూరుగృహము లుండును. * గృహమునకు అధికారి గృహపతి. ♦ అధికారిణి గృహపత్ని. కొందరు గృహస్థులుచేరి ఒక గోత్రముగా రగుదురు.

గృహస్థు లనేకకులములు గలవారుగ నుండవచ్చును. ప్రతి యొక కులమునకును ఒక కులపతియుండును. అనేక కులములకు అధిపతి గ్రామణి లేక గ్రామాధికారి అని చెప్పబడును. ఇతడు వారికి నాయకుడును, మార్గదర్శియునై యుండును. రాష్ట్రమున కధికారి యగు సామ్రాట్ ఎటులనో గ్రామాధికారి యగు గ్రామణికూడ అట్లే ధర్మపరిపాలనము చేయుచుండవలెను. ఆ గ్రామమునకు సంబంధించిన అన్ని విషయములకును గ్రామణి సర్వాధికారి. ఇతనికి కులపతులు, మంత్రులు, సర్వాధికారములున్నను నిరంకుశముగా ఇతడు పరిపాలన చేయుటకు వీలులేదు. ఇచ్చటనే పంచాయతీ పద్ధతి ప్రారంభమగును.

## భాషాప్రయుక్త రాజ్యములు

కొన్ని జనపదముల సంఘాతము లేక సమ్మేళనము (Federation) ఒక రాజ్యమగును. ఈ రాజ్యము సామాన్యముగా భాషాప్రయుక్త రాజ్యముగా నుండును. మొదట చెప్పినట్లు హిందూస్థానపు చరిత్ర ఎంత మారినను ఈ గ్రామపరిపాలనము ఎన్ని వందల శతాబ్దములైనను మారలేదు. ఇప్పుడు నైజాం రాష్ట్రములోను, మైసూరు రాష్ట్రములోను ఆంధ్ర మండలములు కొన్ని చేరి యున్నను, పై అధికారియగు రాజు ఎవరైనను, క్రింది మెట్టున గ్రామపరిపాలనము ఒకే రీతిని ఉండుట చూడదగును.

## భరత ఖండ రచన

గ్రామము సామాన్యముగ ఒక క్రోశము వైశాల్యము గలది. పది గ్రామములు చేరిన ప్రదేశముయొక్క ముఖ్యస్థానమునకు పురమనియు; నూరుగ్రామములు కలిగిన దేశముయొక్క ముఖ్యస్థానమునకు పట్టణమనియు వేయి గ్రామములు కలిగినదేశము యొక్క ముఖ్యస్థానమునకు నగరమనియు; పదివేలు గ్రామములు కలిగిన దేశపు ముఖ్యస్థానమునకు పురి యనియు

* ఋగ్వేద 5—53.2

♦ ఋగ్వేద 10—85.26

పేర్లు, మఱియు ఇట్లు రెండువేల చదరపు మైళ్ల విస్తీర్ణముగల రాజ్యమునకు నగరమును, ఇరవైవేల చదరపు మైళ్ల విస్తీర్ణముగల రాజ్యమునకు పురియు ముఖ్య పట్టణములై యుండును. హిందూస్థాన మంతయు ఈ విధముగా 5,60,000 గ్రామములు కలిగి, 56 దేశములుగా విభజింపబడి యుండెను. ఈదేశములన్నియు భరతఖండమను నొక సమ్మేళనమున చేరి యున్నవి. ఇందలి ప్రజలందరు నొక తల్లిబిడ్డలు. ఇప్పటి లెక్కల ప్రకారము గ్రామముల సంఖ్య 7 లక్షలకు పెరిగిన దని చెప్పు చున్నారు. గ్రామమునందు సామాన్యముగ నూరుగృహములును, గృహమునకు సగటున నలుగురువంతున 400 మంది ప్రజలుందురు. 10 గ్రామములకు ముఖ్యస్థానమగు పురమునందు 500 గృహములును, పట్ట ణమునందు 2500 గృహములును, నగరమునందు 12,500 గృహములును, పురియందు 62,500 గృహములును, ఈ ప్రకారము ఒక దానికంటె మఱి యొకటి ఐదురెట్లు హెచ్చుగా నుండునట్లు ఉండగలవని ఉజ్జాయింపున లెక్క వేయబడినది. ఇట్లు ఈపద్ధతిని లెక్క వేయగా రమారమి 40 కోట్ల జనులకు సరిపడిన గ్రామ, పుర, పట్టణ, నగర, పురు లనువాని రచన, పూర్వ కాలమునందే హిందూస్థానమున అంచనా వేయబడియున్నట్లు స్పష్టము కాగలదు. ఉన్నత దశలోనున్నప్పుడు వారణాసి (కాశి) నగరము 60 మైళ్ళ చుట్టుకొలతయు, పాటలీపుత్రము 25 మైళ్ళ చుట్టుకొలతయు కలిగి పాటలీపుత్రము యొక్క ప్రాకారములందు 578 గోపురములును, 64 ద్వారములును ఉండెను.

## రాజనీతి

రాజనీతినిగూర్చి వేదములలో గాక-రామాయణ, మహాభారతముల నుండియు, మనుస్మృతి నుండియు, అందుకొఱకై ప్రత్యేకముగ నేర్పడిన కౌటిల్యుని అర్థశాస్త్రము (క్రీ. పూ. 400) నుండియు, కామందక నీతిసా రము (క్రీ. శ. 500) నుండియు, శుక్రనీతిసారమునుండియు మనకు తెలి యుచున్నవి. ధర్మపరిపాలనము రాజు ఎటులు చేయవలసినదియు వీరు చక్కగా శాసించి యున్నారు. ధర్మములేనిచో మత్స్యన్యాయము ననుస రించి బలవంతుడు బలహీనుని మ్రింగి నశింపజేయును. (మను. 7. 21-24). అందుచే రాజు తన దండమును ఉపయోగించి, దుష్టులను శిక్షింపవలెను.

"సర్వో దండజితో లోకో దుర్లభోహి శుచి ర్నరః
దండస్య హి భయా త్సర్వం జగద్భోగాయ కల్పతే."*

కలియుగమందు దండమే ప్రజలను సన్మార్గమునందుంచుచున్నది. లోకమునందు స్వాభావికముగా పరిశుద్ధుడైన మానవుడు ఉండుట అరుదు. కాబట్టి రాజు దండధరుడై నేరమునకు తగిన దండన విధించునేని ప్రజలు శాంతిగనుందురు. నృపాలుడు ఆ దండమును చక్కగా నుపయోగపరచుచుండినచో ధర్మార్థ కామములను పొందును. అట్లుగాక విషయాభిలాషతో నుండి, పక్షపాతియై, నీచుడుగ ప్రవర్తించునేని ఆ దండముచేత నే చంపబడును. కావున దండ మనునది రెండువైపుల పదునుగల ఖడ్గమువంటిది. అటు ప్రజలను శిక్షించును; ఇటు రాజును శిక్షించును. ఇచ్చటి రాజ్యపద్ధతినిబట్టి చూడ రాజహత్య అధర్మము కాదు. అధర్మపరుడగు రాజు తానే బంధు, పుత్ర, మిత్రాదులతో కూడ నాశము చెందును.

"ధర్మా ద్విచలితం హంతి నృప మేవ సబాంధవమ్"

(మను. 7—28)

ఇట్లు తీక్ష్ణమైన కట్టుబాటులతో జను లెట్లో - రాజును అట్లే పరిపాలింపబడుటచేత ప్రజలు నాయకుని వెంట ఇప్పటికిని గొఱ్ఱెలమందవలె తమయొక్క హక్కులను గూర్చి ప్రశ్నింపక స్వధర్మమును నడుపుచుందురు. అందుచే రాష్ట్రమును పాలించు భారము రాజులపై నున్నది.

రాజు పట్టాభిషేకమునకు పూర్వము ప్రజలయొక్క సుఖము అభివృద్ధియగునట్లు పరిపాలించెదనని ఈ క్రింది విధముగా ప్రతిజ్ఞ (ప్రమాణము) చేయవలెను. దీనిని బట్టి రాజు నిరంకుశుడు కాడు. శాసనబద్ధుడు.

"ప్రతిజ్ఞా మధిరోహస్వ మనసా కర్మణా గిరా
పాలయిష్యా మ్యహం భౌమం బ్రహ్మ ఇత్యేవ చాసకృత్
యశ్చాత్ర ధర్మో నీ త్యుక్తో దండనీతివ్యపాశ్రయః
త మశంకః కరిష్యామి స్వవశో న కదా చన"

(మ. భా., శాం. ప. 59., శ్లో 115-116)

---

* మను 7-22.

"మనోవాక్కాయ కర్మ శుద్ధిగా ఈ క్రింది విధముగా ప్రతిజ్ఞ చేయుము. నే నెల్లప్పుడును వేద (జ్ఞాన) చోదిత మార్గమును మీరక ఈ భూమిని పరిపాలింతును. దండనీతితో కూడిన సమస్తధర్మములను నిస్సంశయముగా పరిపాలింతును. ఇంద్రియవశుడనై ఎన్నడును సన్మార్గమును విడువను."

## చాతుర్వర్ణ్య వ్యవస్థ

హిందూస్థానమున ధర్మము చాతుర్వర్ణ్యవ్యవస్థమీద ఆధారపడి యున్నది. దీని వివరములు క్రింద చూడగలరు. మొదటి నుండియు ప్రజలను, అంతఃశత్రువులనుండియు, బాహ్యశత్రువులనుండియు కాపాడుట క్షత్రియధర్మము. వీరు ఈ విద్యయందు ఆరితేరి - అందుకు తగిన అర్థబలమును, అంగబలమును సమకూర్చుకొని ప్రజలను కాపాడవలెను. ఆధ్యాత్మిక మార్గము నవలంబించుచు బ్రాహ్మణులు విద్య గరపవలెను. వైశ్యులు సంపద నభివృద్ధి చేయవలెను. వీరిలో నొకరు పెద్ద, మఱియొకరు చిన్న అనుభేదము లేదు. ఒక శరీరమునందలి వివిధాంగముల వంటివారు. రాజ్యపరిపాలననిమిత్తమై కావలసిన పన్నుల నిచ్చుటయే గాక, తమ సర్వస్వమును ధారపోయుటకు ప్రజ లందరును సిద్ధముగా నుండిరి. వారి ఐశ్వర్యమునకు తగినట్లు గ్రామాధికారినుండి సార్వభౌమునివఱకు కప్పములు వసూలు చేయుచుండిరి. శుక్రనీతి 1-365-374 లో తరతమాభివృద్ధిగా రాజాధిరాజుల శ్రేణి యిట్లు వర్ణింపబడి యున్నది.

1. సామంతుడు:—ఒకలక్ష మొదలు మూడులక్షల కర్షములు (రూపాయలు) వఱకును ఆదాయము వచ్చువారు.

2. మాండలికుడు:— పదిలక్షల వఱకును
3. రాజు:—ఇరువదిలక్షల ,,
4. మహారాజు:—ఏబదిలక్షల ,,
5. రాట్:—ఒక కోటి ,,
6. స్వమ్రాట్:—పదికోట్ల ,,
7. విరాట్:—ఏబదికోట్ల ,,

8. సార్వభౌమ:—ఏబదికోట్లపైనను ఆదాయములు నిర్ణయింప బడినవి. ఐతరేయ బ్రాహ్మణము (8-4-1) నందు మెట్టుపై మెట్టుగా రాజ్యము,

దాని పైని సామ్రాజ్య, స్వారాజ్య, వైరాజ్య, మహారాజ్యములును, అందరికి పైని 'అధిపత్యము'ను ఎక్కువ మెట్లుగా చెప్పబడినది.

## హిందూస్థానము - సంయుక్త రాష్ట్రము

ఇటుల ఒకటిపై నొకటి అంతస్థులుగా అధికారముగల పాలకుల పేర్లు చెప్పబడియున్నను, వారి వారి అధికారములకు తగిన మర్యాద (సరిహద్దు) లుండుటచే, ఏ అంతస్థులోని అధికారికి అందులకు తగినట్లుగా స్వపరిపాలనము (Autonomy) వారి వారి స్థానములందు సర్వస్వాతంత్ర్యమును కలిగి యుండిరి. కాని, వేదములనుబట్టి చూడగా మొదటినుండియు రాజును సమితులద్వారా ప్రజలు ఎన్నుకొనుచుండిరి. ఇట్లు ఎన్నుకోబడిన వారిని రాజులనియు, ఇతరక్షత్రియులు రాజన్యు లనియు చెప్పెడివారు.*

‡ అటుల ఎన్నుకొనబడిన రాజు ప్రజలకు సంతృప్తిగా నుండునట్లు ఎంతకాలము రాజ్యము చేయునో, అంతకాలమే ఆ పదవియందు ఉండగలడు. లేనిచో పదభ్రష్టు డగును. ♦

రాజ్యపదవి వంశపారంపర్యముగ గాక, ప్రతిరాజును ఎన్నుకొనుటచే రాజ్యపరిపాలన ఎక్కువ ప్రవీణతతో నడుపబడుచుండెడిది. ముఖ్యముగా గ్రామస్వపరిపాలనము, ఈ మధ్య నూరుసంవత్సరములనుండి అంతరించినది గాని, అంతకు ముందు అనాదినుండి వేదములలో చూపబడినటుల, ఒక్కొక గ్రామమునకు సంబంధించిన సమస్తసాధనలును, సమస్తసంస్థలును ఇతర గ్రామములమీద ఆధారపడకుండా, సాధ్యమైనంతవఱకు తమయందే కలిగి యుండెను. వారి పన్నులు వారు వసూలు చేసికొనుట, వారి ఇష్టము వచ్చినట్లు వారు ఖర్చుపెట్టుకొనుట, తమకు పోగా మిగిలిన సొమ్మును రాజునకు అవసరమైనప్పుడు సంయుక్తసంఘము యొక్క తోడ్పాటునకై శక్తివంచన లేక ఇచ్చుట — ఇది మన గ్రామస్థుల ధర్మమైయుండెను. మరియు ప్రజలచే ఎన్నుకొనబడిన పంచాయతీ సభ్యుల పరిపాలనముక్రింద ప్రతిగ్రామము నుండును. గ్రామస్థులు నాల్గు వీథులు కలసినచోట ఒక పెద్ద వృక్షముక్రింద నిర్మింపబడిన మంటపము

* ఋగ్వేద. 5-10-90,12. ‡ ఋగ్వేద 5-10--90,12

♦ ఋగ్వేద 5-10—173 Regvedic Culture, Page 309

నందు (రచ్చ) సభలు, సమితులు ♦ చేయుచు గ్రామ విషయములను పరిష్కరించుచుండెడివారు. ఈ సమితులు జరుపుటకుగల నియమములు బౌద్ధుల దినములలో చక్కగా ఆచరణలో నుండెను. బౌద్ధ విహారములు స్వపరిపాలనముగల చిన్నచిన్న స్వరాజ్యసంస్థలుగా నుండెను. చర్చలే వారికి ప్రాణవాయువులు. బౌద్ధులును, బ్రాహ్మణులును సోదరులవలె ఈర్ష్య లేకుండ చర్చలలో పాల్గొనుచుండిరి. నలందా విశ్వవిద్యాలయము యొక్క 700 సంవత్సరముల చరిత్రలో ఒక్కసారి యైనను చట్టములపై తిరుగుబాటు జరుగలేదు.*

సూర్యుడు తన కిరణములచే నీటిఆవిరిని ఆకర్షించి, తిరిగి వర్షరూపమున భూమికి ఎట్లు ఇచ్చివేయునో అట్లే చక్రవర్తియు తాను ప్రజల నుండి సంపాదించిన ధనమును తిరిగి ప్రజలకే ఇచ్చి వేయవలెను. ఇందుకొఱకు యజ్ఞములు, తులాభారములు మొదలగు సంస్థలు ఏర్పడెను. ఈ పద్ధతి మహమ్మదీయులు కూడ అనుసరించిరి. అతిక్రూరుడగు అల్లాయుద్దీను ప్రజల అనుగ్రహము సంపాదించుటకై అనేక మణుగుల బంగారమును పూవులు క్రింద చేసి పంచిపెట్టించెడివాడు. ‡

తేనెటీగ తేనెను, దూడ పాలను ఎట్టుల ఆకర్షించునో,అట్లే రాజు ప్రజలను బాధింపక కప్పములు వసూలు చేయవలెను.

"యథాల్పాల్ప మదంత్యాద్యః, వారకో వత్సషట్పదాః

అనగా జెలగలు, దూడలు, తేనెటీగలు - రక్తమును, క్షీరమును, తేనెను యథాక్రమముగా నెట్లు కొలదికొలదిగా గైకొనుచున్నవో అట్లే - రాజును జనులనుండి మూలధనమును చెడనీయక కప్పమును కొంచెము

♦ సమితి యనగా జనులందరును కూడిన కూటము. ఈ సమితులకు రాజరాజన్యులు కూడ వచ్చుచుండెడివారు 'సభలు' బహుశః గ్రామములలో శాశ్వతముగ నుండు ప్రదేశిక సంస్థలనియు, 'సమితులు' ఎన్నికలు మొదలగు పనులు వచ్చినప్పుడు చేయు పెద్ద సమ్మేళములనియు తెలియుచున్నది. సమితి యనగా (Assembly or Conference). కొన్నిచోట్ల సభ, సమితి అను పదములు రెండును ఒకటే అర్థమున ఉపయోగింపబడినట్లు కనబడు చున్నది.

* Beal's Life of Hieun Tsiang P. 186—87

‡ History of Mediaeval India-Page 239 Bhavani Prasad.

కొంచెముగా గైకొనవలెను. ఇట్లు కులపతులు, పంచాయితీలు, మంత్రులు, సభలు మొదలగు సంస్థలసహాయముతో ధర్మపరిపాలనము చేయు రాజులు ఒకరిపై నొకరు తమ అధికారమును చెలాయించుచున్నను, హిందూస్థాన మంతయు ఏకచ్ఛత్రాధిపతి యగు చంద్రగుప్తునివంటి చక్రవర్తుల అధీనములో నున్నప్పుడు గూడ గ్రామస్వరాజ్యము అటులనే యుండుటచే హిందూస్థానము అనేక చిన్నచిన్న రాజ్యముల కూడికచే గలిగిన సంయుక్తరాష్ట్రము గాని నిరంకుశమైన రాజ్యము కాదని తెలుసుకొనవలెను. ఒక రాజు అశ్వమేధయాగము చేసినప్పుడు ఇతరరాజులనుండి గౌరవమును అతడు లాంఛనముగా పొందుటయే గాని ఆతనికి వారు బానిసలు కారు.

## ప్రజాసత్తాక రాజ్యములు

పైన వివరించినట్లు – శృంఖలాబద్ధముగా రాజ్యపరంపర ఉన్నను ఒక్కొకచోట ఎవ్విధమైన రాజును లేక ప్రజలే రాజ్యభారమును వహించిన కొన్ని జనపదములు గలవని స్పష్టముగా తెలియుచున్నది. బుద్ధుడును, మహావీరజైనుడును ఇద్దరునుకూడ ఇట్టి ప్రజాసత్తాకరాజ్యములకు చెందినవారని తెలియుచున్నది.

"ఉదీచ్యాం దిశి యేకేచ పరేణ హిమవన్తం
జనపదా ఉత్తర కురవ ఉత్తర మద్రా
ఇతి వైరాజ్యా యైవ తే అభిషిచ్యన్తే
విరాళ త్యేనానభిషిక్తా నాచక్షత" (బ్రాహ్మణములు 3-8) *

ఇందువలన ఆ కాలమునందు ఉత్తరకురు, ఉత్తరమద్రదేశములు హిమాలయముల నంటి ఉత్తరదేశమునందు ఉండెననియు, అచ్చటి జనులు రాజు లేకుండ స్వయముగనే రాజ్యము చేయుచుండిరనియు, రాజు లేకయే రాజ్యము చేయుట వారి కోరికయే అయినందున, వారు తమ ఇష్టము వచ్చిన వారిని నాయకులుగా నేర్పరచుకొనుటచే వారికి విరాట్ (రాజులేనివారు) అని పేరుండె ననియు యూహింపవలసియున్నది.

## క్షత్రియ ధర్మము

ఆదినుండి హిందూస్థానమున బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర లను

* కె. వి. లక్ష్మణరావు: హిందూదేశ కథాసంగ్రహము అ. 3.

విభాగము వృత్తినిబట్టి నిర్ణయింపబడినది గాని, జన్మమునుబట్టి నిర్ణయింపబడినది కాదు. *శౌర్య, ధైర్య, భుజబల, పరాక్రమములు కలిగి దేశమును రక్షించుట క్షత్రియధర్మము. ఇది మొదట ఒక కులమునకు జెందినది కాదు. విశ్వామిత్రఋషి క్షత్రియుడైనను, పురోహితుడుగా నుండెను. అట్లుండియు, ఆర్యులు సుదాసుని మీదికి యుద్ధమునకు వెళ్లినప్పుడు 10 రాజుల సంయుక్తసేన నతడు స్వయముగా నడిపెను. భృగుమహర్షి సంతతివారు రథములను చేయు వడ్రంగులుగా నుండిరి. గార్గ్య, తర్యాయణి, కవి, పుష్కరాయణి వీరు మొదట క్షత్రియులైనను, పిమ్మట బ్రాహ్మణులైరి. † భారద్వాజుడు బ్రాహ్మణుడయ్యును భరతుడను క్షత్రియరాజుచే పెంచబడెను. నాభాగుడు క్షత్రియునుగా పుట్టి వైశ్యుడాయెను. కవషుడను దాస్యపుత్రుడు ఋషులచే గౌరవింపబడి అందరికంటె శ్రేష్ఠుడనిపించుకొని వసిష్ఠాదిఋషులచే నమస్కృతులు పొందెను.

క్షత్రియ, రాజన్యశబ్దములు రాజ్యాధికారమును సూచించు పదములుగా ఉపయోగింపబడుచుండెను. క్షత్రియులేగాక బ్రాహ్మణులు, వైశ్యులు కూడ అవసరమునుబట్టి యుద్ధము చేయుచుండిరి. గ్రామణి సామాన్యముగా వైశ్యుడుగా నుండెను ‡ శూద్రపదము ఋగ్వేదములో ఒకచోట మాత్రము కనపడుచున్నది. ♦ దాసులు, దాస్యులు అనువారు యుద్ధములో పట్టుబడిన అనార్యజాతివారలు శూద్రులుగా నేర్పడుచుండిరి. శూద్రులు ఎక్కువ అయిన కొలదిని వైశ్యవృత్తి యగు వ్యవసాయమును, పశుపాలనమును వీరు గైకొనిరి. వైశ్యులు సులభముగా ధనమును సంపాదించుటకు వీలైన వర్తక వ్యాపారములందు ప్రవేశించిరి. అంతట ఆర్యులలో నాలుగు కులములు ఏర్పడెను. కాని ఆ కాలమున స్త్రీ, పురుషులు ఒండొరుల ప్రేమాతిశయము ననుసరించి కులభేదములు లేకుండ వివాహము లాడుచుండిరి.†

---

* 1. ఋగ్వేదము. 9-112-3; 3-53-9; 5-10-98; 10-39-14; 5-10-103; 5-5-23; 1-2; 6-31-1; 5-7-18;33; Rig Vedic Culture, Page 131. † భాగవతపురాణము 10

‡ ఋగ్వేదము 5-7-109-13 ♦ 10-90-12

† ఋగ్వేదము. 10-27-12; 5-8-3; 5-62-9.

ఈ ప్రకారము దేశము యొక్క స్థితినిబట్టి ఎంతమంది కావల యునో అంత మంది క్షత్రియులుగా గాని, విద్యావ్యాపకమునకై బ్రాహ్మణులుగాగాని, వ్యవసాయము, వ్యాపారములు వృద్ధికై వైశ్యులుగాగాని మారుచుండిరి. మొట్టమొదట వృత్తి విభాగములు మూడే. రాజ్యము ఎక్కువ అయినకొలదిని, నాలుగవ తరగతియగు వారి సంఖ్య హెచ్చుగా దొడగెను. మహాభారతము నాటికి కూడ, బ్రాహ్మణలక్షణము లున్నయెడల శూద్రుని బ్రాహ్మణునిగా పరిగణింపవచ్చునని చెప్పియున్నారు. చాతుర్వర్ణ్యము గుణకర్మలచే నేర్పడెను గాని, జన్మముచే కాదని శాస్త్రములు చెప్పుచున్నను, క్రమముగ వంశపారంపర్య పద్ధతి స్థిరపడి జాతికి జన్మమే ప్రధాన మను సిద్ధాంతము ఏర్పడినది. అంతటనుండి వృత్తి మారినను జాతి మారకుండెను. గుణకర్మలు అప్రధానము లయ్యెను. ఇప్పుడుకూడ అదేపద్ధతిని జాతికి జన్మమే ప్రధానమై యున్నది. కాని ఇది వేదవిహితము కాదు.

## రా జ పు త్రు లు

క్రీ. శ. 7-వ శతాబ్దమునుండి 12-వ శతాబ్దమువరకును ఉత్తరహిందూస్థానమున రాజపుత్రులు క్షత్రియులుగా నెంచబడి అనేకకుటుంబములవారు స్వతంత్రరాజ్యములను స్థాపించి రాజ్యమును చేయుచుండిరి. కాని ఇప్పటి రాజ్యములన్నియు, దేనికది స్వతంత్రముగా నుండి సార్వభౌమరాజ్యము ఒక్కటియు లేకుండెను. ప్రతి మండలాధీశుడును, తానే సార్వభౌముడనని ఇతరరాజులతో పోట్లాడుచుండెను. ఇట్లు వీరు అంతఃకలహములు కలవారై యున్నందున తురుష్కులకీ దేశము వశమై, చివరకు ఇప్పటికిని పరాధీనత స్థిరమైయున్నది.

## ద క్షి ణ దే శ ము న క్ష త్రి యు లు

రానురాను దక్షిణహిందూస్థానమున క్షత్రియులసంఖ్య తగ్గిపోవుటచే, కమ్మ, రెడ్డి, వెలమ, తెలగ మొదలగు కులములవారు కొందరు క్షత్రియవృత్తిని అవలంబించి క్షత్రియవేషభాషల నలవరచుకొని, రాజ్యములను స్థాపించి, క్షత్రియులుగా మారిపోయిరి. వీరు గోత్రములను, సూర్యచంద్రవంశములను కల్పించుకొనిరి. ఉపనయనాది వైదికకర్మల నాచరించి, కొందరు యజ్ఞోపవీతములను కూడ ధరించుచుండిరి. చాళుక్యరాజులు

తమ మొదటి శాసనములో శూద్రుల మనియు, తరువాత కొన్ని తరములు గడిచిన పిమ్మట 11 వ శతాబ్దములో చంద్రవంశపుక్షత్రియుల మనియు వ్రాసికొనిరి. ఇట్టుల వీరు క్షత్రియులు కాగానే, వైశ్యులకంటె పైజాతి వారైపోయిరి. క్రిందికులములవారి పిల్లలను అనులోమపద్ధతి ననుసరించి, వివాహములు చేసికొనుచుండిరి. ఈ పద్ధతి ననుసరించి, చాళుక్య రాజగు విష్ణువర్ధనుడు కుసుమసెట్టి అను వైశ్యుని కుమార్తెయగు కన్యకాదేవిని వివాహమాడగోరెను. నూటొక్క గోత్రముల వైశ్యులు తిరుగుబాటు చేసిరి. కాని, విష్ణువర్ధనుడు బలవంతపెట్టగా కన్యకాదేవి అగ్నిప్రవేశము చేసెను. అప్పటి నుండియు ఈమె కన్యకాపరమేశ్వరి యని వైశ్యులచే పూజింపబడుచున్నది.

## బ్రాహ్మణులు క్షత్రియధర్మము ననుసరించుట

ఇది ఇట్లుండగా, ఆంధ్రదేశమున మహమ్మదీయ రాజ్యములు ప్రబలుచు వచ్చిన రోజులలో, రాజులకు తోడ్పడుటకు కొందరు బ్రాహ్మణులు (నియోగులు) క్షత్రియవృత్తిని అవలంబించి, మంత్రులుగను, సేనాపతులుగను, సామంతప్రభువులుగను పనిచేసి, వర్ణాశ్రమపద్ధతులను కొంతవరకు మార్చివేసిరి. వీరి ఆదర్శము "కాన్మే ఖలం, హాత్మే తల్వార్" "చెవిలో కలము, చేతిలో కత్తి" అని మా తాతగారు అనుశ్రుతముగా చెప్పుచుండెడివారు.

## క్షత్రియ ధర్మము తగ్గుట

తుదకు బ్రిటిషుప్రభుత్వము ఈ దేశములో నేర్పడినతరువాత అన్ని జాతులవారును రాజ్యాంగములో చేరుచువచ్చిరి. కాని, నిజమైన క్షత్రియ గుణములగు భుజబలము, శౌర్యము, ధైర్యము పరాక్రమము క్షీణించెను. అందుచేత కూలికి పనిచేయు సేవకులవలె తమకు పరరాజులచే విధింపబడిన పనిని తమకు ఇష్టముండినను, లేకపోయినను, పొట్టగడుపుకొను నిమిత్తము చేయుచు, వారివారి విధియుక్తము లగు స్వధర్మములను విడిచిరి. వెలుపల నుండి శత్రుభయము లేనంతకాలము, ఈ పద్ధతి చక్కగా నడువవచ్చును. కాని, శౌర్యాతిశయములతో శత్రువు తనమీద పడినపుడు లోపము బయలుపడగలదు. శ్రీగాంధీమహాత్ముడు అహింసాధర్మమును బోధించెనగా, క్షత్రియధర్మమును త్యజించమని ఆయన చెప్పుటలేదు. అంగబల, బాహుబల, బుద్ధిబల, శౌర్య, పరాక్రమాద్యుపాయములును, ఆధ్యాత్మికశక్తియు

నున్నవానికే అహింసాధర్మము గాని, బలహీనుడై చేతకాని పిఱికివానికి ఈ అహింసాధర్మము వర్తింపదు. శత్రువును కొట్టగలిగియు ఇంద్రియనిగ్రహము గలిగి కొట్టకుండుటయు, ఎదుటివాని హృదయమును కరగించి, వానిదుష్ప్రవర్తన మార్చుటయే ఇందలి రహస్యము. తాము నిరాయుధులగుటచే, సాయుధులగు రాజ్యాంగమువారిపై తిరుగబడుటకు ఇప్పుడు అసాధ్యము గాన తాత్కాలికముగా అహింసా మార్గమును అవలంబింపదగిన అంగబలమును అర్థబలమును చేర్చుకొనిన పిమ్మట శత్రువును,ఏ పద్ధతిచేనైనను ధ్వంసము చేయుటకు పాల్పడిన తాత్కాలిక అహింసావాదులను గాంధీమహాత్ముడు అంగీకరించడు. గాంధీజీకి అహింస ఒక మతము, లేక ధర్మము. రెండవవారికి అహింస ఒక సాధనము కాని ధర్మము కాదు. కేవల అహింసావాదులుకూడ కాలిలో ముల్లు గ్రుచ్చుకొని బాధపడుచున్నపుడు, ముల్లుయొక్క హింసను తగ్గించుటకై తాత్కాలికముగ హింసారూపముగా నున్నను, కాలును కోసి ముల్లును తీసివేయుట హింస కాదని చెప్పుదురు. ఇట్లే దేశకంటకు లగు వారిని శిక్షించుట అహింసయే యగును గాని హింస కానేరదు.

ఈరీతిని అహింసామార్గావలంబనముచే క్షత్రియధర్మము తగ్గకూడదు. లోకమునందు అధర్మపరులచే కలుగు హింస తగ్గించుటకైనను క్షత్రియ ధర్మము అవసరము. మనము బలవంతులుగా నున్నపుడు, ఆ బలము నుపయోగింప నవసరము లేకయే, శత్రువులు వెనుక దీయుదురు. కావున బలపరాక్రమముల సంపత్తు దేశమునకు అవసరము. ప్రతివ్యక్తియొక్క బలమే ఆ యా జాతియొక్క బలమును నిర్ణయించును. కావున, రాజ్యపరిపాలన నిమిత్తమై ప్రతియొక వ్యక్తియు క్షత్రియుడై యుండవలెను.

అన్ని శాస్త్రములును, అన్ని పురాణములును చివరకు ఈ విషయమునే బోధించుచున్నవి. క్షత్రియధర్మ మనగా యుద్ధరంగమున వెనుదీయక, "యశోవా మృత్యుర్వా" యని ఫలాపేక్ష ఏ మాత్రము లేకుండా నిష్కామ బుద్ధితో తనకు విధింపబడిన కార్యమును చక్కగా చేయుట. ఇదియే "యోగః కర్మసు కౌశలం" అని చెప్పబడినది. క్షత్రియునకు యశస్సు పోయిన తరువాత ప్రాణ ముండి ప్రయోజనము లేదు.

"సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే". గీత. 2-34

గౌరవముగా బ్రతికినవారికి మరణముకంటె అపకీర్తి భరింపరానిది.

అనగా అపకీర్తికంటె చావే మేలు అన్నమాట. అందుచేత, రాజపుత్రులు జయము దుస్సాధమని తోచినపుడు, అంతఃపురములలోని స్త్రీల నందరిని, అగ్నిహోత్ర కుండమున జోహారుచేయించి శత్రువులపై నురికి రణరంగమున ప్రాణములు గోల్పోవుదురు. ఇది హిందూస్థానమున సామాన్యమైన క్షత్రియధర్మము. ఈ ఆదర్శమునుండి ప్రస్తుతము మనము ఎంతక్రిందికి పడిపోయి యున్నామో ఆ విషయమును ప్రతి వ్యక్తియు గ్రహింపనగును.

## ఐకమత్యము లేక పోవుట

గ్రామములో ఎన్ని తెగల వారున్నను, ఒక్కొక్క కుటుంబములో ఎన్ని తగవులున్నను, గ్రామమొత్తమునకు కావలసిన పనులలో ప్రజలందరును ఐకమత్యముతో పనిచేయుట ప్రతివానికి ధర్మముగా హిందూస్థానమున మొదటినుండియు ఎంచబడుచున్నది. ఈ క్రింది మంత్రమునందు అందరునుగూడి ఏ ప్రకారము ఐకమత్యముతో పని చేయవలెనో స్పష్టముగ నిరూపింపబడినది.

"సంగచ్ఛధ్వం, సంవదధ్వం
సంవో మనాంసిజానతామ్, దేవా భాగం యథా పూర్వం
సంజానానా ఉపాసతాం, సమానో మంత్రః,
సమితి స్సమానీ, సమానం మనః, సహచిత్త మేషాం,
సమానీ ఇహ ఆహుతి స్సమానాని హృదయానివ
స్సమానమస్తు మనః, యథా వస్సుసహాసతి"

అర్థము:—కలసికొనుడు, ఐకకంఠ్యముగా పలుకుడు, ఒకరి మనస్సులను మఱియొకరు గుర్తెఱిగి వర్తింపుడు, దేవతలను అందరును కలిసి ఎప్పటివలెనే ఆరాధింపుడు, అందరకు మంత్రము ఒక్కటే, సభ ఒక్కటే, మనస్సు ఒక్కటే, చిత్తములును ఒక్కటే, హోమ ద్రవ్యములును ఒక్కటే మీ హృదయములును ఒక్కటే, కనుక మీ మనస్సులును ఒక్కటిగా నుండుగాక!

వేదములలోని ఈ మంత్రమును, ఈ మధ్య ప్రతాచారి యుద్యమమును స్థాపించిన శ్రీ గురుసహాయదత్తుగారు ఐకమత్యమునకు ఆదర్శపూర్వకమైన మూలసూత్రముగా ఉదాహరించి యున్నారు. ఇందుకొరకై ఈ దేశమున సమితులును సభలును ఏర్పాటుచేయబడినవి. ఎవరికివారు తమరాజ్యము

నేలుచుండుచు స్వతంత్రముగ నున్న దినములలో చంద్రగుప్తుడు, అశోకుడు, శ్రీహర్షుడు మొదలగువారు హిందూస్థానము నంతయును గాకపోయినను చాలభాగమునైనను, ఒక కట్టుబాటులోనికి దీసికొనివచ్చి భారత ఖండ మంతయు ఒక వ్యక్తిగా పనిచేయగల పరిస్థితులను కల్పించిరి. కడను శ్రీహర్షుని కాలమున దేశమంతయు సుభిక్షముగా నుండి సర్వసంపదలతోను వివిధ విద్యలతోను శోభిల్లుచుండెను. ఆ దినములు హిందూస్థానమునకు బంగారు దినములని చెప్పవచ్చును. ఎచ్చటచూచినను ధనరాసులు మూలుగుచుండెను. ఎచ్చటచూచినను విద్యాసంస్థలే. ఏ వైపున చూచినను దేవాలయనిర్మాణములు, యజ్ఞములు, తీర్థములు, ఉత్సవములు కలిగి భరతఖండము లోకమునకు ఆదర్శ రూపముగా నుండెను. కాని, 8వ శతాబ్దపు నాటికి పరిస్థితులు క్రమముగా మారెను. ఒకవైపున శివుని, మరియొకవైపున విష్ణుని, ఇంకొకచో సూర్యుని, వేరొకచో గణేశుని, భైరవుని, కార్తికేయుని, యముని, కాముని, నాగులను, దయ్యములను కూడ పూజించువారలు స్వేచ్ఛగా తమ ఇష్టాను సారము పూజించుకొనుటకు స్వతంత్రులై వ్యక్తిస్వాతంత్ర్యము పెచ్చు పెరిగిపోయెను. ఎవరికి వారు వేదములనే తమకు ఆధారములుగా చూపుచు, ప్రత్యర్థిని ఓడించుటకు ప్రయత్నము చేయుచు చర్చలు జరుపుచుండిరి. తాగ్రికుకు మొదలైన అసహ్యకరములగు దురాచారములు పెరిగి, ధర్మము క్షీణింపదొడగెను. శంకరవిజయములో క్రి. శ. 8 వ శతాబ్దపు నాటి మత పరిస్థితులను ఆనందగిరి చక్కగా వర్ణించియున్నాడు.

"కేచిచ్చన్ద్రపరాః, పరే కుజపరాః, కేచిత్తు మన్దాశ్రితాః
కేచిత్కాలపరాః, పరే పితృపరాః, కేచిత్తు నాగేశగాః
కేచి త్తార్క్ష్యపరాశ్చ, సిద్ధనిచయం సేవన్తి కేచిద్ధియా॥
కేచి ద్గన్ధర్వసాధ్యాదీన్, భూతవేతాలగాః పరే
ఏవం నానాప్రభేదానాం నృణాం వృత్తి ర్యథేప్సితా
కేచిత్ స్వవృత్తిం వేదార్థైః ప్రతిపాద్యాం సమూచిరే
కేచిద్ధర్మై రియం ముక్తి రితి జల్పన్ సమాస్థితాః
అన్యోన్యమత్సరగ్రస్తాః పరస్పరజయైషిణః
నిజేచ్ఛాకృతి మర్గేషు ధారయన్తి రుషాన్వితాః॥

కొందఱు చంద్రు నారాధించువారును, మఱికొందఱు కుజుని, యింకొకరు శనిని, యింక కొందఱు కాలమును, కొందఱు యముని, మరికొందఱు నాగేశుని, కొందఱు గరుడుని, కొంతమంది సిద్ధులను, మరి కొంతమంది గంధర్వులను, సాధ్యులను, ఒక కొంతమంది భూత వేతాలము అను సేవించుచు, ఆరాధ్యైక్యము లేక తమతమ యిష్ట ప్రకారము నానా భేదములతోను జనులుండిరి. ఎవరి మటుకు వారు తమ ఆచారములే వేదోదితము లని సాధించుకొనుచుండిరి. మరికొందఱు ధర్మ ప్రవర్తనముచేతనే ముక్తి కలదనిరి. ఇట్లు అన్యోన్య మత్సరముతో, ఒండొరులను జయించు కోరికతో తమ యిష్టము వచ్చిన వేషభాషల నవలంబించుచుండిరి.

ఈ పరిస్థితులలో శంకరాచార్యులు ప్రతిగ్రామమును, నగరమును తిరిగి తనయొక్క అప్రతిమానమైన వాదములతో తాను పోయినచోట్లం దెల్ల అద్వైతమును స్థాపించెను. బౌద్ధభిక్షువులు పారిపోయిరి. దురాచారములు పటాపంచలైపోయెను. సామాన్యప్రజలు పౌరాణిక హిందూ ధర్మమును, విజ్ఞానవంతులు అద్వైత ధర్మమును అనుసరించిరి. కాని, శంకరాచార్యులయొక్క ప్రచారఫలితము శాశ్వతముగా నిలువలేదు. మూఢ విశ్వాసములును, మతదురాచారములును 9-వ శతాబ్దమునాటికి తిరిగి తలయెత్తెను. రాజకీయమునందుకూడ ఒకరినొకరు జయించి ఎవరికివారు సామ్రాట్ కావలె ననెడి ఆశతో, దేశము అంతఃకలహములకు పాలై, ఇతర మతస్థులగు మహమ్మదీయులు చొరపడుటకు అవకాశము కలిగెను. కట్టుదిట్టములతో తయారుకాబడిన సేనలతో, మతావేశమును పురస్కరించుకొని, ఏకమై ఒకరివెంట నొకరు చొరచుకొని వచ్చుచుండిన తురుష్కుల దాడులను, అంతఃకలహములలోను, అన్యోన్యద్వేషములలోను మునిగి తేలుచున్న హిందూరాజులు కాని, తమ తమ మూఢవిశ్వాసములలో పడి ఏ కష్టములు వచ్చినను, తమ పూర్వకర్మచే కలుగుచున్న వనియు, అవి అనివార్యము లనియు తలంచిన ప్రజలు కాని యాపలేకపోయిరి. ముఖ్యముగా శ్రీ హర్షునివంటి ఏకైక నాథుడు, భరతఖండమునకు రక్షణముగా ఎదుట నిలిచిన ధీరుడు, నాలుగైదు శతాబ్దములుగా లేకపోవుటయే భరతఖండము యొక్క ఐకమత్యము విచ్ఛిన్నత జెందుటకు కారణ మయ్యెను.

77

# భక్తియుగము

## (క్రీ. శ. 1000—1858)



[విషయసంగ్రహము:— నింబార్కుడు - ఆళ్వారులు - వల్లభాచార్యులు - శ్రీచైతన్యస్వామి - తుకారాము - మీరాబాయి - సిద్ధులు - హిందూమతము నందు కలిగిన మార్పులు - మహమ్మదీయుల మొదటి దండయాత్ర - హిందూమహమ్మదీయుల సంపర్కము - పృథ్వీరాజు, జయచంద్రుడు - మహమ్మదీయ మత మూలసూత్రములు - మహమ్మదీయ మత వ్యాపకము - అల్లోపనిషత్తు - హిందువుల పరాక్రమము - సూఫీమతము - సిక్కుమతము - గురునానక్ - గురుతేగ్ బహదూర్ - గురుగోవింద్ - క్రైస్తవమతము - హిందూధర్మము, బైబిలు - ఏ సీ సంఘము - యూదుల ఆచారములు - క్రైస్తవ మతమునందలి కొన్ని ధర్మములు - హిందూస్థానమున క్రైస్తవమత వ్యాపనము - పారసీకమతము - పారసీకులు ఆర్యులే - జరత్పుష్టఋషి - పారసీక మత సిద్ధాంతములు. ధర్మములు.]

---

ఈ యుగమునందు హిందువులలో ఐకమత్యము లేక పోవుటచే మహమ్మదీయులు దండయాత్రలు సాగించి, దేశమును జయించి ఆక్రమించుటయు, అన్యోన్యమత ద్వేషములచే ఉభయులకు యుద్ధములు జరుగుటయు, తుదకు వీరిద్దరి సంఘర్షము వలన, ఇతరులు ఈ దేశమును ఆక్రమించుకొనుటయు చూడగలము.

### నింబార్కుడు

### (క్రీ. శ 1084)

శంకరాచార్యులు తన అద్వైత మార్గమున వివిధమతములను ఏకము చేయుటయు, ఆయన ప్రచారము చిరకాలము స్థాయిగా నిలువక పోవుటయు, పిమ్మట శైవులు, శాక్తేయులు, వైష్ణవులు మొదలైనవారు తిరిగి బయలుదేరి భక్తిమార్గమును దేశమునందు వ్యాపింపచేసియుండుటయు చూచియున్నాము.

జీవుడు అవిచ్ఛిన్న భగవద్భక్తిచే భగవంతుని ఆరాధించిన యెడల,

నిర్హేతుక జాయమాన కటాక్ష రూపమున భగవంతుడు మోక్షమును ప్రసాదించును అని భక్తివాదు లందురు. వీరు భగవద్భక్తిని ప్రోత్సహించిరి గాని మానవుని ఐహిక సుఖమునకు కావలసిన రాజకీయ సంబంధమైన నిత్య కృత్య వ్యాపారములను నిరసించి నిరుత్సాహపరచిరి. ఇట్టి ప్రచారమునకు ఈ కాలమునందు తోడ్పడినవారలలో నింబార్కు డొకడు.

దక్షిణ హిందూస్థానమున శ్రీరామానుజులు, గోపాలకృష్ణునకు ప్రాధాన్యమియ్యక, వైకుంఠవాసియు, సర్వగుణ సంపన్నుడును, నిరంజనుడును, అగు లక్ష్మీవల్లభునకే ప్రాధాన్యమిచ్చి, పాంచరాత్రుల మార్గము ననుసరించి, చతుర్వ్యూహమును అంగీకరించెను. ఉత్తరహిందూస్థానమున వైష్ణవమతము వేరు మార్గము ననుసరించి, భక్తిప్రపత్తులనే ప్రధానము చేసికొని, రాధాకృష్ణునకును, గోపికాలోలునకును ప్రాధాన్య మిచ్చిరి. త్రిలింగ దేశ బ్రాహ్మణుడైన నింబార్కాచార్యుడు, ఉత్తరహిందూస్థానమునకు పోయి, బృందావనమునందు ద్వైతాద్వైతసంప్రదాయక మగు వైష్ణవమతమును బోధించెను. పవిత్రమైన భక్తిచే భగవంతునకు శరణాగతుడైనచో, భక్తులయందుభగవంతునికి ప్రేమ కలుగు నని ఇతని సిద్ధాంతము. ఇతని మతమునందు ఉపాసనలతో పనిలేదు. అందుచే ఇతడు రాధాకృష్ణులకు ప్రాధాన్యమిచ్చెను. ఇతని మతము మధ్వరామానుజుల సిద్ధాంతములకు మధ్యమ మార్గము నవలంబించుచున్నది. పరమాత్మ జీవాత్మలు రెండును ఒకవిధముగా ఒకటియు, మరియొక విధముగా భిన్నమును కూడ అగుదురు. ఎటులనగా అలలతో కూడిన సముద్రమునందలి అల, సముద్రములోని భాగమే. (రెండును నీరే) కాని అలగా దానినిమనము ఎంచినపుడు సముద్రమునకంటె విభేదమును చెందుచున్నదని మనము తలపవచ్చును. ఈ రాధాకృష్ణసంప్రదాయము జయదేవునిచే 12 వ శతాబ్దాంతమున రచింపబడి మనోహరముగను శాశ్వతమును అయిన గీతగోవిందమువలన మిక్కిలి ప్రచారములోనికి వచ్చెను. నింబార్కుని మతమునందు రాధ విష్ణులోకమునుండి బృందావనమునందు అవతరించిన శ్రీకృష్ణునిభార్య. కాని, గీతగోవిందములోని రాధ భార్యగాక పరకీయగా వర్ణింపబడినది.

## ఆళ్వారులు

దక్షిణదేశమున మాత్రము ఆళ్వారు లనబడువారు పన్నెండుగురు తమ భక్తిపూరితము లగు ప్రబంధములద్వారా శుద్ధమైనవైష్ణవ భక్తిని ప్రబో

ధించిరి. ఈ ప్రబంధములను వైష్ణవవేదము లని అరవభాషలో దక్షిణదేశమున దేవాలయములలో పఠించుచుందురు.

ఈ ప్రాంతమున క్రీ. వె. 7-8 శతాబ్దములందే 12 గురు అళ్వారులను వైష్ణవభక్తులు జాతి, మత భేదము లెంచక భక్తిమార్గమును ఉద్బోధించుచుండిరి. ఇందు అండాళ్ అను అళ్వారు స్త్రీ. ఈమె జన్మస్థానమగు శ్రీవిల్లిపుత్తూర్ నందు ఒక గొప్పదేవాలయమున ఈమె విగ్రహము ఇప్పటికిని పూజింపబడుచున్నది. తిరుప్పానాళ్వార్ పంచమజాతికి చేరినవాడు. అళ్వారులు భక్తిమార్గమును అరవభాషలో బోధించిరి. వీరుగాక - సంస్కృతమునందును అరవమునందును గూడ వైష్ణవగ్రంథములను రచించి నాథముని (824—924) యామునాచార్య, (975) వేదాంతదేశికర్ (1269 —136) మొదలగువారలు వైష్ణవమతమును ప్రచారముచేసిరి.

## వల్లభాచార్యులు
## (క్రీ. శ. 1479-1531)

వల్లభాచార్యులుగూడ తెలుగు బ్రాహ్మణుడే. ఈయన ఉత్తరహిందూస్థానమున 16-వ శతాబ్దమునందు వల్లభ సంప్రదాయమును స్థాపించిరి. ఈ సంప్రదాయానుసారముగ గురుభక్తి ప్రధానము. గురువును మహారాజనెదరు. భగవంతుని ఆరాధించుటకు గురువు గృహమే దేవాలయము. భక్తులు తమ సర్వస్వమును గురువునకు సమర్పింపవలెను. భక్తుల అదర్శ మేమనగా రాధాకృష్ణుల నిత్యలీలలలో పాల్గొనుటయే. సంసారము మోక్షమునకు అడ్డురాదు. అందుచే గురువులు తమ భార్యలతో ఆనందమైన జీవనమును గడపుచుందురు. వీరు కృష్ణలీలలను ప్రదర్శించుటకు అనేక రకరకములైన వ్రతములను ఉత్సవములను జరుపుచుందురు. ఈ యుత్సవములచే నీ సంప్రదాయముయొక్క మర్యాద కొంతవరకు నశించి ఒక్కొక్క చోట నీతిబాహ్య మగు ప్రవర్తనకు కారణమయ్యెను. ఈ సంప్రదాయము గుజరాతునందును, రాజపుత్రస్థానమునందలి ధనికులలోను అధికముగా వృద్ధిచెందియున్నది. వీరి సంప్రదాయము శుద్ధాద్వైత మని వీరు చెప్పుదురు. వల్లభసంప్రదాయపు ఆచార్యులు అందరును నేటికిని అంధ్రదేశమునుండి అంధ్రసంబంధములు చేయుచు, తెలుగు భాషనే తమ ఇండ్లలో మాట్లాడుచుండు వెలనాటి బ్రాహ్మణులై యున్నారు.

## శ్రీ చైతన్యస్వామి
## (క్రీ. శ. 1485 - 1533)

శ్రీ చైతన్యులు వంగరాష్ట్రమునందు వైష్ణవమతము నీతి బాహ్యము గాకుండ కొంతవరకు రక్షించిన గొప్ప మతకర్త. ఇంద్రియ లోలత్వమును అభివృద్ధి చేయు వ్రతములను, తంత్రములను ఈయన నిరసించి, స్వచ్ఛమైన భక్తిని ఉపదేశించిన మహాయోగి. ఇతడు వల్లభాచార్యునికి సమకాలికుడై నను, ఆ సంప్రదాయకుల దుష్ప్రచారమును కొంతవరకు అడ్డగించెను.

## తుకారాము
## (క్రీ. శ. 1608 - 49)

ఇట్టి సంప్రదాయములనుండి వైష్ణవ మతమును మహారాష్ట్ర దేశము రక్షించెను. వీరి సంప్రదాయమునందు రాధకు బదులు శ్రీకృష్ణుని భార్య యైనట్టియు, పరమభక్తురాలును అగు రుక్మిణికి ప్రాధాన్య మిచ్చిరి. 14 వ శతాబ్దాంతమున నామదేవుడును, 17 వ శతాబ్దమున తుకారామును ఈసంప్రదాయమునకు ప్రవర్తకులు. 14 వ శతాబ్దమున రామానందుడు రాధాకృష్ణులకు బదులు సీతారాముల ఆరాధనమును ప్రోత్సహించెను. శ్రీ శివాజీమహారాజు రామానందుని శిష్యుడు. రామానందుని ముఖ్య శిష్యులలో మహమ్మదీయుడును, బట్టలనేసి జీవించువాడును, అగు కబీరును (15 వ శతాబ్దారంభమున) దూదేకులకులమునకు చెందిన దాదూసాహెబును (1544-1603), చెప్పులు కుట్టు వృత్తిగల రవిదాసును, సుప్రసిద్ధ రామాయణమును రచించిన తులసీదాసు (1532-1620)ను తత్సంప్రదాయమునందు ముఖ్యులని చెప్పగా, సర్వజాతులవారును, సర్వమతముల వారును, హిందూమతమును అవలంబించి, సర్వమతైక్యమును బోధించి రనుటకు నిదర్శనము కాగలదు. ఇదియే గాంధిమహాత్ముని వైష్ణవము.

## మీరాబాయి

రవిదాసు పుట్టుకచే చండాలుడైనను, అతిపవిత్రమైన భక్తికలిగి ఉన్నతాదర్శములను బోధించెను. చిత్తూరు మహారాణియును, సుప్రసిద్ధభక్తురాలైన మీరాబాయియును ఇతని శిష్యురాండ్రు. మీరాబాయి రాజా రతన్‌సింగ్ కుమార్తెయు రాజసంగజీ కోడలును అయి రాజాభోజ్ అను

తన భర్తతో తొమ్మిది సంవత్సరములు శాంతముగా సంసారసుఖము ననుభవించి, పిమ్మట భర్తృవియోగదుఃఖము ను భరింపలేక సన్యాసినియై రవిదాసుని యొక్క శిష్యురా లాయెను. ఈమె సర్వేశ్వరుడును, అద్యంతశూన్యుడును అయిన పరమాత్మను అద్వైతమార్గమున పూజించెను. రవిదాసుకీర్తనలు సిక్కులచే గూడ వారి "గ్రంథసాహెబు" (సిక్కులవేదము) నందు చేర్చుకొనబడియున్నవి. కబీరుకూడ ఇతనిగూర్చి హెచ్చుగా పొగడెను. ఇతడు పరమాత్మ భక్తునిహృదయమునందు నివసించుననియు, వ్రతపరితము లను చేయుటచే అతనిని తెలిసికొనుట దుర్లభమనియు, దివ్యమైనట్టియు అపరిమితమైనట్టియు, ప్రేమబాధ నెరిగినవారలకే అతడు గోచరమగు ననియు, నిరాడంబర మగు మానవసేవయే మతముయొక్క పరమధర్మ మనియు బోధించెను.

## సిద్ధులు

సిద్ధసంప్రదాయములో శైవాగమసిద్ధు లనియు, శాక్తాగమ సిద్ధు లనియు రెండు సంప్రదాయములు గలవు. సిద్ధులు జీవన్ముక్తులై శరీరముతో ఇచ్ఛవచ్చినంతవఱకు జీవించుటయేగాక స్వచ్ఛందమరణమును బొందగలరు. వీరు సశరీరులై మోక్షమును జెందుదురు అని వీరి నమ్మకము. సిద్ధులు శాశ్వతశరీరమును కలిగి జరామరణముల నుండి తప్పించుకొనవచ్చు ననియు కూడ ఈ సంప్రదాయకుల నమ్మకము. వీరు అష్టైశ్వర్యములను పొందగలరు.

1. మత్స్యేంద్రుడు, గోరక్షకుడు మొదలగు తొమ్మండుగురు నవనాథ సిద్ధు లనుపేర క్రీస్తుశకము 2-వ శతాబ్దమునుండి హిమాలయప్రాంతమునం దుండెడివారనియు వారు అష్టసిద్ధులను పొంది రస, అభ్రకముల సత్త్వపాతనాదుల తెలిసికొని రససేవచే శాశ్వతశరీరమును పొందగలిగిరనియు చెప్పుదురు.

2. దక్షిణదేశమున క్రీస్తుపూర్వమును, తరువాతను తిరునల్వేలిజిల్లాలో సిద్ధకోట పర్వతమునందు భోగరు సంప్రదాయపు సిద్ధులు చిరకాల ముండిరని ప్రసిద్ధిగలదు. భోగరు అను సిద్ధుడు చీనాదేశమునుండి క్రీస్తు పూర్వమే దక్షిణదేశమునకు వచ్చెననియు, మృత్యువును జయించి అనేకశతాబ్దములు

సశరీరముగా ఈ ప్రాంతమున తమ యపూర్వసిద్ధులను ప్రదర్శించు చుండి రనియు చెప్పుదురు. వీరిది శుద్ధమార్గము అనగా జ్ఞానమార్గము.

3. అగస్త్యమహర్షి ఉత్తరహిందూస్థానమునుండి దక్షిణమునకు వచ్చి వేదారణ్యమున, అగస్త్యగ్రామ మనుచోట నవకోటిసిద్ధాశ్రమమున వారిసంప్రదాయమును స్థాపించిరి.

4. 11వ శతాబ్దమున నవనాథసిద్ధులు, రసేశ్వరసిద్ధులు అనుపేర శ్రీశైలమున నివసించుచు ఆంధ్రదేశ మంతటను రసేశ్వరసిద్ధాంతములను కొందరు సిద్ధులు ప్రచారము చేయుచుండిరి. నిత్యనాథీయము అను రసాయన గ్రంథమును, నవనాథసిద్ధులనుగూర్చి పలుగాథలును ఆంధ్రద్రావిడ దేశములందు ఇప్పటికిని గలవు. ఈసిద్ధులచే కల్పింపబడిన ఆనందభైరవి మొదలగు రసౌషధములు ఆయా సిద్ధులపేరిట వైద్యగ్రంథములలో చూడనగును.

5. వీరుగాక – మహేశ్వరసిద్ధు లను వారు అష్టాదశ (18) సిద్ధులు దక్షిణదేశమున శుద్ధమార్గసంప్రదాయమునకు చెందినవారు ఉండిరి. శ్రీ మూలనాథర్ లేక మూలర్, మాణిక్యవాచకర్, జ్ఞాన సంబంధర్, అవ్వయ్యార్ మొదలగువారు ఈ సంప్రదాయపువారు.

6. సిద్ధసంప్రదాయములో 10 వ శతాబ్దమునాటి పట్టణత్తార్ అను సిద్ధపురుషుని సమాధి చెన్నపట్టణము సమీపమున తిరువత్తూరున గలదు. పిమ్మట 15వ శతాబ్దమున అరుణగిరి యను సిద్ధపురుషుడు "తిరుప్పుగళ్" అను మిక్కిలి శ్రావ్యమైన పాటలను రచించెను. ఇదే శతాబ్దమున వేదారణ్యములో శివాలయమున "తాయుమానవర్" అను శైవసిద్ధులు వెలసిరి. 17 వ శతాబ్దమున వీరశైవ, ప్రకాశలు (ఇద్దరు), శాంత లింగ, కుమారదేవ, చిదంబర స్వామి అనువారలు 5 గురు గొప్పసిద్ధులను పొంది అనేకఉద్గ్రంథములను రచించిరి.

7. ఈ సిద్ధపరంపర ఇట్లే ఎడతెగక వచ్చుచున్నది. చిదంబరము రామలింగస్వామి అను సిద్ధపురుషుడు దక్షిణార్కాటు జిల్లాలో నొకగ్రామమున ఉదయించెను. (1823-1874). వీరికి కవిత్వము సహజముగా ప్రాప్తమయ్యెను. వీరు చెన్నపట్టణములో తన అన్నగారితో చిన్నవయసునుండి భగవంతుని "మురగ" (సుబ్రహ్మణ్యస్వామి) అని ప్రార్థించుచు అనేక పాటలు రచించెను. వీరు సర్వసమత్వమును బోధించుచుండిరి. దక్షిణా

ర్కాటు జిల్లాలో వడలూరు అనుగ్రామమునందు ఒక దేవాలయమును నెలకొల్పి అందు దీపముయొక్క జ్వాలను (జ్ఞానముయొక్క ప్రతిమగా) పూజార్థము స్థాపించి, భగవంతుడు ఒక్కడే యనియు, జాతి, కుల భేదములు గాని, మత గ్రంథములతో సంబంధముగాని లేకుండ, జీవకారుణ్యము, ప్రేమ అనుమార్గముల ఏకేశ్వరుడగు భగవంతుని తెలుసుకొనవచ్చుననియు వీరుద్బోధించిరి. శ్రీరామలింగస్వామివారు బొందితో కైలాసమును పొందిరని చెప్పుదురు. 1894 వ సంవత్సరమున అకస్మాత్తుగా వీరు అదృశ్యులైరనియు, తిరిగి వచ్చెదరనియు కొందరు నమ్ముదురు. వీరు రచించిన పాటలు "తిరుఅరుట్పా" అను పెద్దసంపుటముగా నేర్పడి అరవభాషలో మిక్కిలి మధురమై శరీరమును పులకాంకితమును చేయుచున్నవి.

ఇట్లు ఆ సేతుహిమాచలము ఇప్పటివఱకును సిద్ధులు అవతరించి ప్రజల భక్తివిశ్వాసములను ఎట్లు పరిణమింపజేసిరో తెలియగలదు.

## హిందూమతమునందు కలిగిన మార్పులు

(1) ఈ భక్తియుగమునందు దేశభాషలకు ప్రాముఖ్యముకలిగి ఆయా భాషలలో వాఙ్మయము చాల వృద్ధిపొందెను. కులభేదములు తగ్గిపోయి హీనజాతులుగూడ భగవంతుని ఆరాధించుటకు తగినవారను తలంపు వృద్ధి చెంది, ఉత్తరహిందూస్థానమున అస్పృశ్యతాకళంకము నశించి, దేవాలయములలోనికి ఎల్లరును పోవుటకు అవకాశము లేర్పడెను. అంతట నుండి పురోహితుల ప్రాధాన్యము తగ్గిపోయెను. కాశియందు శ్రీ విశ్వేశ్వరుని విగ్రహమును ఎల్లరును చేతితో తాకి అభిషేకములు చేయవచ్చును. కాని దక్షిణహిందూస్థానమున మాత్రము భక్తులందరును కులభేదములను గమనించకపోయినను, దేవాలయములలో స్మృతుల ననుసరించిన వ్రతాదుల నవలంబించుటచే అస్పృశ్యత నిలిచిపోయెను.

(2) వ్రతములును, తంత్రములును అప్రధానములనియు, హృదయ నైర్మల్యమును, అకళంక భక్తియు, నీతియు, మోక్షసాధకములని ధృఢపడెను. ఈ కాలమున పతంజలియోగుల తపోమార్గములును, బౌద్ధుల నీతిమార్గములును, సయుక్తికమైన తర్కముచే కలుగు జ్ఞానమార్గమును, నిర్లక్ష్యము గావింపబడి, కేవలభావప్రేరితమైన భక్తిమార్గమే ప్రబలము చేయబడెను.

## మహమ్మదీయుల మొదటి దండయాత్ర

మహమ్మదీయుల మొదటి దండయాత్ర క్రీ. శ. 636 - 37 లో కాలిఫులరాజ్యమున అరబ్బులచే చేయబడెను. పిమ్మట క్రీ. శ. 712 లో సింధురాజ్యమును కొంత వారు ఆక్రమించిరి.

## హిందూ మహమ్మదీయుల సంపర్కము

ఇప్పటినుండియే హిందూమహమ్మదీయసంపర్కమేర్పడెను. వీరి రాజ్యము ఇచ్చట స్థిరముగా లేకపోయినను, ఒండొరుల సంపర్కముచే అరబ్బుల విద్యలును, కళలును అభివృద్ధినొందెను. కాలిఫులు గొప్పగొప్ప బౌద్ధ, బ్రాహ్మణ విద్వాంసులను తమ ముఖ్యపట్టణమగు బాగ్‌డాడ్‌నకు రప్పించుకొని హిందూవేదాంతము, సంగీతము, చిత్రలేఖనము, శిల్పము, వైద్యము, జ్యోతిషము-ఇవియవి యననేల? సమస్తవిజ్ఞానమును, సంస్కృతము నుండి అరబ్బీభాషలోనికి పరివర్తనము చేయించిరి. పిమ్మట వీరిద్వారా అరేబియానుండి ఈ విజ్ఞానమంతయు ఐరోపాకు వ్యాపించెను. హిందూస్థానమునందు హిందువులుకూడ మహమ్మదీయ సంపర్కముచే వారి వేషభాషలను, నాజూకు పద్ధతులను కొన్నిటిని అవలంబించిరి రాజకీయరీత్యా స్వాతంత్ర్యము పోయినను, దేశమునందు ఒక నూతనభాషయు, నూతన విజ్ఞానమును మహమ్మదీయులద్వారా హిందూస్థానమునందు ప్రవేశించెను. పట్టణములలోని జనులు మహమ్మదీయ నాగరిక సంప్రదాయముల నవలంబించుచు వచ్చిరి. క్రీ. శ. 12 వ శతాబ్దమువరకును హిందూస్థానము మీదికి దండెత్తివచ్చిన యవనులు, హూణులు, సిథియనులు మొదలగువారు హిందూస్థానమునందు నివసించుచు, హిందూవేషభాషల నలవరచుకొని హిందువులలో కలిసిపోయిరి. కాని, అటుపిమ్మట రాజపుత్రులు తమలో తమకు గల అంతఃకలహములచేత నయితేనేమి, పాదుషాలయొక్క రాజమందిరముల వైభవములను రుచిచూచిన వెనుక ఆ వ్యామోహముచేత నైతేనేమి, కొందరు హిందువులు మహమ్మదీయులలో కలిసి వారి మతవ్యాప్తికి సహాయభూతులైరి. ఈ కారణములచేతను, మహమ్మదీయమతమునందుకూడ కొన్ని సద్ధర్మము లుండుటచేతను, సామాన్యజనులుకూడ ఆ మతమును స్వీకరించుటకు ప్రారంభించిరి. కొందరు హిందూ భక్తులు మహమ్మదీయ మతముయొక్క నిజమైనసారమును గ్రహించి, సర్వమతైక్యమునకు

ప్రయత్నములు చేసిరి. కాని యీ రెండుమతములును ఇప్పటికిని భిన్నముగనేయుండి, రాజకీయముగా హిందూస్థానమున అంతఃకలహములకు కారణము లగుచున్నవి.

## పృథ్వీరాజు - జయచంద్రుడు.

క్రీ. శ. 1191 వ సంవత్సరమున మహమ్మద్ ఘోరి అను ఒక తురుష్కుడు పెద్దసేన నొకదానిని కూర్చుకొని, హిందూదేశముపై దండయాత్ర నడిపినపుడు, ఢిల్లీ రాజ్యమునకు అధిపతియగు పృథ్వీరాజు రెండులక్షల గుఱ్ఱపుదళమును, మూడువేల ఏనుగులను, రాజపుత్రబలమునంతను సమకూర్చి థనేశ్వర్ వద్ద ఘోరి సైన్యములనోడించి చెల్లాచెదరు గావించి, నలుబదిమైళ్ళ దూరమునకు తరుమగొట్టెను. కాని కనోజ్ దేశపురాజును, పృథ్వీరాజు మామయును అగు జయచంద్రుడు మాత్రము వారిద్దరికి గల కుటుంబకలతలచే, పృథ్వీరాజునకు సహాయపడలేదు సరేకదా! పృథ్వీరాజుయొక్క అపజయమును కూడ ఆశించుచుండెను. మహమ్మదు ఘోరిని రెండవసారి రప్పించినది జయచంద్రుడే యనికొందరు అందురు. నిజ మెట్లున్నను, ఒక సంవత్సరములోపలనే అనగా 1192లో మహమ్మద్‌ఘోరి మరియొక పెద్దసేనను (1,20,000 మందిని) తయారుచేసికొని తిరిగి దండయాత్రకు వచ్చెను. ఈ సారియు నూటయేబది మంది రాజపుత్రవీరులు పృథ్వీరాజుతో చేరిరి. మూడులక్షల గుఱ్ఱపుదళమును, మూడువేల ఏనుగులతో యుద్ధసన్నద్ధులై అదే థనేశ్వరమువద్ద నిలిచిరి. యుద్ధము ప్రారంభమాయెను. సరాసరి యుద్ధము చేసిన యెడల, జయింపలేనను భయముచేత, మహమ్మద్‌ఘోరి హిందువులను మోసపుచ్చుట కొక వ్యూహమును పన్నెను. తన సేనను ఐదు విభాగములుగా చేసి, ఒక భాగముతో కూడ తాను వెనుకనుండి, మిగిలిన నాలుగు భాగములను ముందుకు పోయి, యుద్ధముచేసి ఓడిపోయి వెనుకకు పరుగెత్తిపోవుచున్నట్లుగా నటింపజేయుచు ప్రొద్దుగూకించెను. పొద్దుగూకిన పిమ్మట హఠాత్తుగా పన్నెండువేల గుఱ్ఱపుదళమును తీసికొని పృథ్వీరాజు సేనపై మహమ్మదుఘోరి యురికెను. ఈ కుటిల తెలియక రాజపుత్రసైనికులు చిందరవందరలైరి. పృథ్వీరాజు హతుడయ్యెను. ఈ యపజయముచే హిందూస్థానమంతయు గడగడ వణకిపోయెను. కాని జయచంద్రుడు మాత్రము తన

ప్రత్యర్థిఅయిన పృథ్వీరాజు మరణించినందులకు తనలో తాను సంతసించు చుండెను. కాని, రెండుసంవత్సరములు ముగియకమునుపే అతనికిని ఇదియే గతి పట్టెను. ఢిల్లీ మొదలు కాశీవరకు నున్న హిందూస్థానమంతయు తన రాజ్యముగా నెంచుచు, కనోజ్ పట్టణమును రాజధానిగా నేలుచుండెడి ఈ జయచంద్రుడు క్రీ. శ. 1193 లో ప్రచండయుద్ధమున హతుడై హిందూస్థానమునందు అపకీర్తికి పాలాయెను. ఈ యంతఃకలహములు లేక యితడే పృథ్వీరాజునకు సహాయము చేసియున్నచో హిందూస్థానపు చరిత్ర ఎట్లుండెడిదో!

## మహమ్మదీయ మత మూలసూత్రములు

మత మనగా ఒక చుక్కాని వంటిది. ఇది మానవులు ఇంద్రియలోలురై దుర్మార్గములకు పోకుండ సన్మార్గమున నడపును. దీనినే ధర్మమనికూడ అందురు. మహమ్మదీయ మతముకూడ భక్తిప్రధానమైన అద్వైతమతమే. రామానుజాది వైష్ణవ మతములందువలె ఈమతమునందుకూడ గురువు ప్రధానము. సర్వమానవ సౌభ్రాతృత్వమే వీరికి (మహమ్మదీయులకు) ముఖ్యము. అల్లా (ఈశ్వరుడు) నిర్గుణుడు. త్రికాలవేది. ప్రజలను రక్షించుటకు అప్పుడప్పుడు తనదూతలను పంపును. అందరును ఆ దూతయొక్క ఉపదేశములను అంగీకరించవలెను. ఈ మతస్థాపకుడగు మహమ్మదు అట్టి దేవదూత. ఖురాను షరీఫ్ అనుమహమ్మదీయవేదమును అతని ద్వారా భగవంతుడు ప్రజలకు ప్రసాదించెను. అది నిత్యమైనది. ప్రజలందరును ఆయాకాలపు అధికారులకు లోబడవలెను. మతముకొరకై తమ సర్వస్వమును త్యజించి ప్రాణములనైనను ఇచ్చుటకుసిద్ధముగానుండవలెను. బీదవారలను ప్రేమించవలెను. భగవంతుడు తనకిచ్చినది ఇతరుల ఉపయోగార్థమే కాని కేవలము తన కొరకు కాదు. సత్యమును పరిపాలింపవలెను. త్రాగుడు, జూదము, వడ్డీ వ్యాపారములు కూడదు. ఉపవాసములు, తీర్థయాత్రలు, దైవప్రార్థనలు, యోగాభ్యాసాదులచే సాధకుడు ప్రభువు (దేవుని) సమీపము చేరుటకును, పిమ్మట అతనిలో లీనతను చెందుటకు ప్రయత్నింపవలెను. భగవంతుడు నిర్గుణుడును, నిరంజనుడును, సర్వశక్తుడును, సర్వవ్యాపకుడును అగుటచే, ఎవ్విధమైన విగ్రహారాధన కూడదు. వీరికి స్వమతాభిమానము మెండు. పరమత సహనము తక్కువ. జహాద్ అను పేర మత యుద్ధములు ప్రక

టించినపుడు అందరును మతావేశముచే అందుచేరి ప్రాణములను తృణ ప్రాయముగా త్యజింతురు. "సర్వలోకములపై జాలిదలచి నిన్ను పంపు చుంటిని" (ఖురాన్ 21.107) అని భగవంతుడు మహమ్మదును ఆదేశించుట చూడ అహింసాధర్మమే ఈ మతమునకును పట్టుకొమ్మ యని తెలియగలదు. మహమ్మదీయ శకము క్రీ. శ. 622 నుండి ప్రారంభము. మహమ్మ దీయులు తమమతమును ప్రపంచమునందు వ్యాపింప చేయుటయే తమ పురు షార్థములలో మొదటిదిగా నెంచి ఇతరదేశములపై దండయాత్రలు సాగించిరి. మహమ్మదీయులలో జాతిభేదములు కాని, కులభేదములు కాని అంతగా లేక పోవుటచే, ఎవరినైనను తమ మతమునందు చేర్చుకొనుటకు హెచ్చుగా అవకాశములు కలవు.

## మహమ్మదీయ మతవ్యాపనము

క్రీ.శ. 11 వ శతాబ్దమునుండి 17 వ శతాబ్దము వరకును మహమ్మదీయ దండయాత్రలు హిందూస్థానముపై నిరంతరముగా వచ్చుచుండెను. దేశము మిక్కిలి ఫలవంతముగను, ధనవంతముగను ఉండినను, మతభేదములచే వివిధరాష్ట్రములుగ నేర్పడిన హిందూస్థానము ఐకమత్యమును కోల్పోయి నందున, నడుముకట్టుకొని శత్రువులపై పోరాడుటకు దేశభక్తిగల ఏకైక నాథు డొకడైనను లేకపోవుటచేత, మహమ్మదీయులు సులభముగా ఈ దేశ మును జయించి, ఆక్రమించుకొని ఇచ్చట కాపురము చేయగలిగిరి.

నీతిమార్గ ప్రవర్తకులు, హిందూమతమునందును, మహమ్మదీయ మతము నందు కూడ సమానముగనే యున్నను, ఒక్కొక్క చక్రవర్తియొక్క స్వభా వమును బట్టి ఒక్కొక్కపుడు హిందూమతమును, మరి యొక్కొక్కపుడు మహమ్మదీయమతమును విజృంభించుచు క్షీణించుచు వచ్చెను. అక్బరు చక్రవర్తి అన్ని మతములందును సమత్వబుద్ధి కలవాడు.

## అల్లోపనిషత్తు

భారత రామాయణాది హిందువుల గ్రంథములను అబ్దుల్ ఖాదర్ బదౌని అనెడి మహమ్మదీయ సంస్కృతపండితునిచే పారసీక భాషలోనికి పరివర్తనము చేయించెను. మరియు, అథర్వావేదమును కూడ పరివర్తనము చేయించినటుల తెలియుచున్నది. అథర్వవేదమునందలి ఉపదేశములకును

ఖురానందుగల ఉపదేశములకును కొంత సామ్యము కలదని, అక్బరు అల్లోపనిషత్తనెడి గ్రంథమును అథర్వవేదానుకరణముగ వ్రాయించెను. ఈ గ్రంథమునుండి మచ్చునకు కొన్ని వాక్యములు ఉదాహరించెదము.

"ఓం అస్మాల్లాం ఇల్లే మిత్రావరుణో దివ్యాని ధత్తే
ఇల్లల్లే వరుణోరాజా పునర్దదుః
హాలూమిమిత్రో ఇల్లాం ఇల్లల్లేతి

*　　*　　*

అల్లోజ్యేష్ఠం, శ్రేష్ఠం, పరమం, పూర్ణం బ్రహ్మాణ మల్లాః
అల్లోరసుర మహమ్మదరకం వరస్య అల్లో

*　　*　　*

ఇల్లాకబర ఇల్లాకబర ఇల్లల్లేతి
ఇల్లాలాః ఇల్లా ఇల్లాల్లా అనాది
స్వరూపా అథర్వణీశాఖాం హ్రాం హ్రీమ్

(అ. వి. సర్వస్వమునుండి.)

దీనిని బట్టి అక్బరు హిందూధర్మమునందు నిజమైన భక్తిగలవాడని తలపవచ్చును.

ఔరంగజేబు మూఢభక్తిగల మహమ్మదీయచక్రవర్తి. ఇతని సోదరుడగు దారాయును, కుమారుడగు ఆదంషాయును హిందూమతమును ప్రేమించుచుండిరి. ఈ కాలమున అజాదులు మహమ్మదీయులైనను ఉదారస్వభావులై హిందూమతసహనమును గలిగి యుండిరి. కొందరు మహమ్మదీయులు తాంత్రికాచారములను ఆచరించుచుండిరి. మరికొందరు యోగాభ్యాసమును కూడ చేయుచుండిరి.

ఇట్లు మహమ్మదీయులలో, పెక్కుమంది హిందూమతధర్మములను అనుసరించుచుండ, హిందువులలో కేవల స్వలాభాపేక్షచే కొందరును, నిజముగా మహమ్మదీయమతమునందు అభిమానముచే కొందరును, పాదుషాల నిర్బంధనముచే కొందరును, స్వధర్మములను విడిచి మహమ్మదీయమతమును స్వీకరించి, వారి మతమునకు దోహదము కలిగించిరి. ఇట్లు మతభ్రష్టు

లును, ఇంద్రియలోలురును, బలహీనులును అయి హిందువులు తమ దేశమును మైమరచియున్న సమయమున, వీరికంటె బలవంతులును, ఎక్కువ సంఘీభావము గలిగి మతావేశముగల మహమ్మదీయులు రాజ్యము నాక్రమించుట ఆశ్చర్యము కాదు.

## హిందువుల పరాక్రమము

కాని, హిందూస్థానచరిత్ర అంతయు ఈవిధముగా నున్నదని చెప్పుటకు వీలులేదు. గొప్ప విజృంభణముతో వచ్చిన గ్రీకు సైన్యములను చంద్రగుప్తుడు తన ధైర్యస్థైర్యములచే తరిమివేసెను. జైనమతాభిలాషి యైనను ఈతనికి ప్రక్కబలముగా దేశమంతయు నడుము కట్టుకొని నిలచెను. విక్రమార్కుడు (6 వ శతాబ్దారంభమున) శకరాజుల నోడించి దేశమును కాపాడెను. ఈ శతాబ్దమునందే శ్రీహర్షుడు శ్వేతహూణుల దండయాత్రల నరికట్టెను. 12 వ శతాబ్దాంతమున పృథ్వీరాజు ఘోరయుద్ధములు సల్పి రణరంగమున హతుడయ్యెను. 13 వ శతాబ్దమున దేవగిరిరాజులు అల్లాయుద్దీనుతో ఘోరముగ పోరి దక్షిణదేశముపై మహమ్మదీయదండయాత్రల నరికట్టిరి. 14 వ శతాబ్దమున చిత్తూరురాణా రతన్‌సింగ్ అల్లాయుద్దీన్‌తో ఘోరయుద్ధము చేసి ఆచంద్రతారార్కమగు కీర్తిని సంపాదించెను. 15 వ శతాబ్దమున విజయనగరసామ్రాజ్యము స్థాపింపబడి దక్షిణహిందూస్థానమున హిందూసామ్రాజ్యమును కాపాడెను. 16 వ శతాబ్దమున కృష్ణదేవరాయలు తన పరాక్రమముచే దక్షిణహిందూస్థానమునంతను స్వాధీనము చేసుకొనెను. 17 వ శతాబ్దమున మహారాష్ట్రవీరుడగు శివాజియును, 18 వ శతాబ్దమున సిక్కులును మహమ్మదీయుల క్రౌర్యమును అణగగొట్టిరి. 19 వ శతాబ్ద మధ్యము వరకు హిందువులును, మహమ్మదీయులును కూడి హిందూస్థానముయొక్క స్వతంత్రస్వరాజ్యస్థాపనకై ఆసేతు హిమాచలము నేకమై తుది ప్రయత్నముగా ఘోరయుద్ధము సలిపి తమ పరాక్రమమును వెలిబుచ్చిరి. మహారాష్ట్రవీరులు దేశముయొక్క పరాధీనతను తప్పించుటకై ఎన్ని ప్రయత్నములు చేసినను, ఐకమత్యము పొసగక, కొందరు దేశద్రోహులమూలముగ వారి ప్రయత్నములు విఫలమయ్యెను.

ఇందు ఒక్కొక్క విషయమును తఱచి పరీక్షించినయెడల, జయాపజయములు ఒకరి స్వాధీనములు కావనియు, స్వమత, స్వదేశ, స్వధర్మాభి

మానములు క్షీణించుటయు, ఏకనాయకత్వము లేకపోవుటయు హిందువుల అపజయములకు ముఖ్యకారణముగాని, పరాక్రమము లేకపోవుట గాదని తెలియుచున్నది. ఔరంగజేబు వంటి జయశాలియొక్క పుత్రపౌత్రాదులు వెంటనే అపజయము నొందుటకు కారణ మేమి? ఇంద్రియలోలురై, పైన చెప్పిన స్వధర్మాచరణహీను లగుటచేతనే వారికీ గతి పట్టిన దని సుబోధము కాగలదు. ఇప్పుడు ఫ్రాన్సుదేశమునకు పట్టిన గతియు ఇదియే. దేశచరిత్రకును, ప్రజల నీతి మతాచారములకును గల సంబంధమును తెలుపుటకై ఇంతగా వ్రాసియున్నాము.

## సూ ఫీ మ త ము

సూఫీమతము 17 వ శతాబ్ద ప్రారంభమున హిందూమతాభిమానులగు మహమ్మదీయులచే సింధుదేశమున అంకురము గావింపబడెను. ఈ మతము ఇంతకు పూర్వమే పర్షియా, అరేబియా, టర్కీ, ఈజిప్టు మొదలైన మహమ్మదీయ దేశములలో కొన్ని సంఘములందు ప్రచారములో నుండెను. దీనియొక్క స్వరూపము హిందూస్థానమందలి అద్వైత వేదాంతమనియే కనబడుచున్నది. హిందూసన్యాసులు కాషాయ వస్త్రములను ధరించునట్లు సూఫీవీరులు చవుకయిన ధావళులను ధరించుదురు. ఇచ్చట మనము యోగులని చెప్పెడి లాగున అచ్చట వీరిని పీర్ లేక ఫకీరు అనెదరు. మహమ్మదుయొక్క ప్రధానశిష్యులలో నొకడగు "అలి" ఈ సుఫీ సంఘమునకు చేరినవాడు. ఈమతస్థులకు భక్తిప్రపత్తులు ప్రధానము. పతంజలి యోగులవలెనే వీరును చిత్తనిరోధముచే సమాధిని పొందుదురు. నిరాడంబరమగు జీవితమును కోరుచు భగవత్సాన్నిధ్యమును ఆశించుచుందురు. హిందూయోగులవలె ఈ సూఫీ ఫకీరులు కూడ యోగశక్తిచే ఇంద్రజాలాది మహిమలను ప్రదర్శించుచుందురు. ఇట్టి పనులను చేయగల శక్తి యోగమహిమలను బట్టియుండును. భక్తిగలవారలకు వారికి గల విశ్వాసమే వారిచే ఎన్నిపనులనయినను చేయించును. ఇట్టి విశ్వాసము గలవారలు హిందువులైనను, మహమ్మదీయులైనను కణకణ మండెడు నిప్పులమీద అవలీలగ నడచిపోగలుగుదురు. ఈ చిత్రములన్నియు యోగశక్తియందు అభ్యాసము, నమ్మకము లేని పాశ్చాత్యులకు బోధపడవు. యోగసిద్ధులు పొందినవారలు గురువు అజ్ఞచే ఈ రహస్యములను ఇతరులకు తెలుపరు. నిజముగా తెలుప

గల గురువులు తగిన శిష్యులు లభించినగాని తెలుపరు. మఱియు, శిష్యులు ఆ మహిమలను దుర్వినియోగము చేయుదురనెడి సంకోచముచే అందరకును నేర్పరు. కావున యోగసిద్ధులు తరతరములనుండి గురువులనుండి శిష్యులకు పరంపరగా రహస్యముగా వచ్చును గాని, బహిరంగముగా వచ్చుటకు వీలు లేదు. సూఫీ ఫకీరుల మహిమలను గూర్చి అనేకకథలు చెప్పుకొందురు. కష్టము కలిగినప్పుడు ప్రజలు వీరిని దర్శించినంత మాత్రముననే వారి కష్టములు తొలగిపోవుచుండును. ఈ సిద్ధులమహిమలు తర్కముచే బోధపడునవి గావు. భక్తిచే మాత్రము గలుగునవి.

ఈ సూఫీమతమునందు భగవంతుడు ఒకడే. అతడు దయాసముద్రుడు. భక్తుడు నిరుపమానభక్తిచే తన సర్వస్వమును భగవంతునికి అర్పణము చేసిన యెడల అతని ప్రేమకు పాత్రుడగును. ఈ మతసిద్ధాంతమునందు హిందూమతముయొక్క అద్వైతసిద్ధాంతము నందలి జ్ఞాన, యోగ, భక్తిమార్గములు పరంపరానుగతముగా గురువులద్వారా సంప్రాప్తమగుచుండును.

ఈ మతకర్తలు భక్తిపూరితము లగు గీతములను రచించి వానిద్వారా తమ మతమును దేశమంతట వ్యాపింపజేసిరి. హిందువులును, మహమ్మదీయులును కలసి ఒకే భజనమందిరమున కూడి సింధుదేశమున ఆపాటలను మిక్కిలి మనోహరముగా పాడుచుందురు. సూఫీలు నామకార్థము మహమ్మదీయులుగా నుండినను సాధారణముగా హిందూసంప్రదాయములను అనుసరించువారుగనే గన్పట్టుచున్నారు. మఱియు సూఫీమతమునకును, సిక్కుమతమునకును చాలా పోలికగలదు. ఈరెండును, హిందూ మహమ్మదీయ మతముల సమ్మేళనముయొక్క పరిణామములై యున్నవి.

## సిక్కు మతము

“శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే” అని హిందువులు అన్నట్లు కబీరు మొదలగు మహమ్మదీయ ప్రచారకులు హరి అనియు, అల్లా అనియు ఏ నామముతో చెప్పినను దేవుడు ఒకడే యనియు, మతభేదములతో నిమిత్తము లేకయే జను లందరు సోదరులేయనియు, ఈ కాలమున బోధించుచు వచ్చిరి. కాని మతమును పురస్కరించుకొని యుద్ధములు వచ్చినప్పుడు మహమ్మదీయులు కత్తిసహాయముతో తమమతమును వ్యాపింపజేయు సమయమున, హిందూధర్మరక్షణార్థము దక్షిణమున మహారాష్ట్రులును,

ఉత్తరమున సిక్కులును, వీరల నెదిరించుటకు బయలుదేరిరి. కాని సిక్కులు వేదముల నంగీకరించక పోవుటచే హిందూమతమునకు బాహ్యులైరి.

## గురునానక్

శుద్ధ అద్వైత మనదగు ఈ సిక్కుమతమును గురునానక్ (1469-1539) స్థాపించెను. ఇతడు దేవుడు ఒకడేయనియు, అతనికి పేరు నామములేదనియు, మధ్యవర్తులగు గురువులును, అవతారములును అవసరములేదనియు, అనేక మహమ్మదులు, అనేకమంది బ్రహ్మ, విష్ణుమహేశ్వరులు జన్మించిరనియు, ఈప్రభువుల కందరకు ప్రభువు ఒక్కడేయనియు బోధించెను. ఇతడు వేదములు, శ్రీకృష్ణుడు, గురువులు, తీర్థయాత్రలు మొదలైన వానిని నిరసించి సృష్టికర్తయు, హర్తయు, స్వయంభువుడు అగు దేవుడు ఒక్కడేయనియు, అతని గుణములు వర్ణించుటకు ఏ భాషయు చాలదనియు, ఇట్లు ఉపనిషద్వాక్యములకు అనుకూలముగనే బోధించెను గురు నానక్ యొక్క సిద్ధాంతములు హిందూతత్త్వమునే అవలంబించినవై భక్తిమార్గమును పరిశుద్ధము చేయునవిగా తలపవచ్చును. ఇతడు కూడ తన ప్రబోధములను దేశభాషలలోనే గావించెను. ఇతర హిందూమత ప్రవక్తలవలెగాక ఇతడు విగ్రహారాధనను ఖండించి యుండుటచే ఇతని మతము దేశమంతయు వ్యాపించక పంజాబు ప్రాంతములో మాత్రము నిలిచిపోయెను.

సిక్కు మతమును ప్రబలపరచిన వారలు పదిమంది గురువులు కలరు. వీరు మొట్టమొదట ఒకమత సంఘముగానే యుండి, రాజకీయ విషయములందు సంబంధమును కలుగచేసికొనక యుండిరి. కాని, మహమ్మదీయుల ఒత్తిడిచే క్షత్రియధర్మమును అవలంబించుటకు ప్రారంభించిరి.

## గురుతెగ్ బహదూర్

ఔరంగజేబు రాజ్యమునందు గురుతెగ్ బహదూర్ అను తొమ్మిదవ గురువు పీఠాధిపతియై యుండెను. ఇతడు ఔరంగజేబుయొక్క మత స్వాతంత్ర్య నిరోధమును భరింపజాలక పోయెను. ఔరంగజేబు ఇతనిని చెరపట్టి మహమ్మదీయ మతములోనికి మారుటయా? లేక ప్రాణమును త్యజించుటయా? ఈ రెంటిలో ఏది కావలయునో కోరుమని విజ్ఞాపించెను. అంతట నీతడు తన మనస్సాక్షికి సూటిగ మరణమునే కోరి వధింపబడెను. ఈతని వధచే సిక్కుల ధైర్య స్థైర్యములు వేయిరెట్లు అధికమయ్యెను.

## గురు గోవింద్

ఈతని తరువాతవచ్చిన పదియవగురువగు గురుగోవిందసింగ్ అనునాతడు మరణమను భయమును సిక్కులనుండితొలగించెను. ఇందుకొరకై ఈతడుఖడ్గ వ్రత మని ఉపనయనమును పోలిన ఒక సంస్కారమును సిక్కుల కందరికి కల్పించెను. సర్వసమత్వము, త్యాగము, భక్తి, ధైర్యము, సేవ, సర్వేశ్వరుడు ఒక్కడే అనెడి నమ్మకము, అనునవి వీరి ఆదర్శములు. సిక్కులుఅహింసా ధర్మమును నమ్మిన సన్యాసులు కారు. ఇంద్రియ లోలత్వమున పడి పొర్లాడెడి సంసారులును కారు. ఆత్మజ్ఞానము కలిగి లోక సంగ్రహార్థము జీవనము గడుపు కర్మయోగులు. సామాన్యముగా, బంధు, మిత్రాదులను త్యజించరు కాని, సమయము వచ్చినప్పుడు తమ సర్వస్వమును త్యజించుటకు సిద్ధముగా నుందురు. ఒకవైపున వినయమును, దైవభక్తియు కలిగి, రెండవ వైపున ధైర్య స్థైర్యములతో తమ మతమునకును, మానవజాతికిని విరోధులగు వారిని నిర్భయముగా చెండాడి నాశము చేయుదురు. ఒకచేత ఇనుప తావళమును త్రిప్పును, రెండవచేతితో కత్తిపట్టి "సత్ శ్రీ అకాల్" (దేవుడు సత్యము) అని ఘోషించుచు శత్రువధ చేయుదురు.

ఈ మతస్థులు స్వకులాభిమానమును, స్వమతావేశమును కలవారలగుట చేత, ఐకమత్యమును ప్రదర్శించి, అనేక యుద్ధములందు కీర్తి వహించిరి. కాని, సంఖ్యాబలము తక్కువగుటచే నివురు గప్పిన నిప్పువలె లోబడియుండవలసి వచ్చెను.

## క్రైస్తవ మతము

ఈ మతమునకు ప్రవర్తకుడు ఏసుక్రీస్తు. ఈతడు జన్మించిన నాటి నుండియు క్రీస్తుశకము ప్రారంభము చేయబడినది. తాను నమ్మిన దేవుని గూర్చి ఈతడు తనకు తోచిన సత్యమును పట్టుదలతో ప్రచారము చేసెను. అందులకు ఇతనిపై రాజద్రోహ మను నేరమును మోపిరి. అప్పటి రాజకీయచట్టము ప్రకారము 30 సం॥ వయస్సున ఇతడు కొరత వేయబడెను.

ఈ మతము ననుసరించి ఒకడే దేవుడు. ఏసుక్రీస్తు దేవునియొక్క కుమారుడు. దేవుడు, ఏసుక్రీస్తు, శక్తి, (Holy Spirit=కర్మ) ఈ మూడును క్రైస్తవులకు ప్రధానములు.

## బైబిలు, హిందూ గ్రంథములు

ఏసుక్రీస్తునకు 300 సంవత్సరములకు పూర్వమే గ్రీసు మొదలగు ఐరోపీయదేశములందలి రాజ్యములకు బౌద్ధమత ప్రచారకులు పోయియుండిరి. ఇందులకు అశోకచక్రవర్తి మిక్కిలి ప్రోత్సహించెను. హిందూమతమందలి విషయములును, బౌద్ధమతమునందలి విషయములును క్రైస్తవమతగ్రంథమగు బైబిలునందు చాల భాగము కనపడుచున్నవి. ఉదాహరణములు:—

"యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి" *

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి" ♦

ఏ జ్ఞానము కలుగుటచే అన్ని భూతములు నీలో నుండునవిగను, అవియే నాయందు నుండునవిగను, నీకు కన్పించునో ఆ జ్ఞానము నీకు కలిగిన పిదప, ఇట్టి మోహము ఎన్నడును కలుగదు. అనగా సర్వభూతములు నీ యందును, నీవు సర్వభూతములందును, ఆ సర్వభూతములు నా యందును ఉండు ననెడి జ్ఞానము కలిగినపుడు సర్వభూతసమత్వము కలుగును. ఈ అర్థమే రెండవ పంక్తియందు కూడ గలదు. పరమాత్మ అన్నిచోట్ల నున్నాడనియు, తనయందు సమస్తమున్నదనియు, దృఢనమ్మకము గల మనుజునకు భగవంతుడు సాక్షాత్కరించును.

"నేను నా తండ్రియందును, నీవు నాయందును, నేను నీయందును ఉన్నారము, అని ఆ దినమున నీకు తెలియును". ‡ అనెడి న్యూటెస్టెమెంటు బైబిలు యొక్క వాక్యము పైగీతా వాక్యమును ఎంతయో పోలియున్నది గదా!

ఇటులనే "ఎవరు నన్ను ప్రేమించుచున్నారో, వారిని నేను ప్రేమించుచున్నాను". అను బైబిలువాక్యము. ♦♦

"ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ, మహం స చ మమ ప్రియః". †

అను గీతావాక్యమును అన్నివిధముల పోలియున్నది. ఇటుల నూరు ఉదాహరణము లయినను చూపవచ్చును. ఇట్టి సామ్యవిషయములను బట్టి,

* భ. గీ. 4-35, ♦ భ. గీ. 6-30, ‡ జాన్ 14-20 ♦♦ జాన్ 14-21
† భ. గీ. 7-17

స్వమతాభిమానులగు కొందరు క్రైస్తవఫాదరీలు భగవద్గీతను బైబిలు ననుసరించి వ్రాసియున్నారని ప్రకటించిరి. * ఇది మిక్కిలి అసందర్భమయిన వ్రాత. భగవద్గీత క్రీస్తుపుట్టుటకు పూర్వము కనీసము 900 సంవత్సరముల నాటి భారతములోనిది. బౌద్ధమతస్థుల భావములు భగవద్గీత నుండి గ్రహింపబడినవి. బౌద్ధుల భావములు మతప్రచారకుల ద్వారా క్రీస్తుపుట్టుటకు పూర్వమే యిరోపీయ దేశములకు వ్యాపించినవి.

## ఏ సీ సం ఘ ము

క్రీస్తు పుట్టుకకు 200 ల సంవత్సరములకు పూర్వము ఏసీ (Esi) లను పేరుగల సన్యాసులు యూదు (Jew) మతమునందలి హింసాత్మకములగు యజ్ఞ యాగాది కర్మకాండమును నిరసించి, తమ జీవిత కాలమంతయు నిరుపద్రవమగు స్థలములయందుండి, పరమేశ్వరుని ధ్యానించుచు కాలయాపనము చేయుచుండిరి. వీరు అవివాహితులుగ నుండి మద్యమాంసములను విసర్జనగావించి, మఠములలో నివసించుచుండిరి. వీరి ముఖ్యమగు మఠము పాలస్తీనులోని మృతసముద్రము (Dead sea) యొక్క పశ్చిమతీరమున యండగి (Endgi) అనుచోట ఉండెను. ఏసుక్రీస్తు తనశిష్యులతో ఈ యేసీలను గురించి ‡ అనేకచోట్ల ప్రశంసించియున్నారు. వీరి సన్యాస మార్గమునే ఏసుక్రీస్తు ప్రచారములోనికి తెచ్చినట్లు కనపడుచున్నది.

## యూదుల ఆచారములు

యూదులు మన వేదములందలి కర్మకాండమునందు వలె అగ్నిహోత్రమునందు పశువులనుగాని, ఇతర ద్రవ్యములనుగాని హోమముచేయుదురు. వీరు విగ్రహారాధకులు కారు. ఇట్టి కర్మకాండము ననుసరించు యూదులమతమును నిరసించుచు † హింసాకరములగు యజ్ఞములు అవసరములేదనియు, ఈశ్వరుని కృపయే కావలెననియు, ♦ఎవరు మోక్షము కావలెనని కోరుదురో వారు దారపుత్రాదుల వదలి నా భక్తులు కావలెననియు, + బంగారమును, నాణెములును, విలువగల వస్త్రములును తుదకు

* గీతారహస్యము (ఆంగ్లము) పే.821. ‡ మాత్యూ 5-34;19-15; జేమ్సు 5-12; అక్టులు: 4-32, 35. † మాత్యూ 9-13 ♦ మాత్యూ 19-21 + మాత్యూ 9,13.

పాదరక్షలు మొదలయినవానినికూడ విడిచిపెట్టి తనతోపాటు సన్యాసులు కావలెనని ఏసుక్రీస్తు తన శిష్యులకు బోధించెను. వీనినిబట్టిచూడగా ఏసుక్రీస్తు పైనవర్ణించిన ఏసీసన్యాసుల భక్తి, వైరాగ్య మార్గములను అవలంబించెననియు, వాటినే అతడు బోధించెననియు స్పష్టమగుచున్నది. ఇదియును గాక, ఏసుక్రీస్తు తన 12 వ సంవత్సరమునుండి 30 వ సంవత్సరము వరకును ఎక్కడఉండినదియు, ఏమి చేయుచుండినదియు, బైబిలులో చెప్పబడి యుండలేదు. ఇతడు ఆ సమయమున భరతఖండమునకు వచ్చియుండెననియు ఇచ్చట బౌద్ధధర్మములను అవలంబించెననియు కొన్ని నిదర్శనములుకలవు. * మొత్తముమీద క్రైస్తవమతధర్మములు హిందూమతసిద్ధాంతములనే ఎక్కువగా అనుసరించుచున్నవని చెప్పవచ్చును. వేయేల? క్రైస్తవమత సిద్ధాంతములకు హిందూ మతసిద్ధాంతములే మూలము లని చెప్పవచ్చును.

## క్రైస్తవ మతమందలి కొన్ని ధర్మములు

ఈ మతమునందు కులభేదములు లేవు. గాఢవిశ్వాసముతో దేవుని ఆరాధించినవారలను అతడు ప్రేమించును. అపకారము చేసినవారలను కూడ మనము ప్రేమించవలెను. కాని ద్వేషింపకూడదు. ఎదుటివాడు కుడి చెంప మీద కొట్టినపుడు, వానికి ఎడమచెంప నీయవలెను, కాని తిరిగి కొట్టకూడదు. దుష్టులయందు కనికరము కలిగియుండవలెను. ఎవరు పరిశుద్ధమనస్కులయి యుందురో, వారు భగవంతుని చూడగలరు. ఇట్టి నియమములను పట్టి చూడగా క్రైస్తవమతము మొట్టమొదట భక్తి ప్రపత్తులతో కూడిన విశిష్టాద్వైతమును పోలియున్నదని చెప్పవచ్చును.

పూర్వకాలమునందు వైరాగ్యముతో ప్రారంభించిన ఆదిశంకరుని శిష్యులు ఇప్పుడు ఏనుగులు, గుఱ్ఱములు, జాగీరులు మొదలయినవానిని సన్యాసులయ్యు ఎటుల పొందుచున్నారో, అటులనే క్రమక్రమముగా క్రైస్తవమత ఫాదిరీలు తాము సన్యాసులయ్యును వైభవముగా కాలము గడుపుటయందు ఆశ్చర్యము లేదు. క్రైస్తవమత ప్రధానసూత్రములు వైరాగ్యమును బోధించుచున్నను ఆ వైరాగ్యము బోధకులలో మాత్రము సామాన్యముగా కనుపడుట లేదు.

* గీతారహస్యము; ఆంగ్లము, పేజీ 829.

## హిందూస్థానమున క్రైస్తవమత వ్యాపనము

క్రీస్తుశకము మొదటిశతాబ్దములోనే ఈ మతము దక్షిణహిందూస్థానమునకు వ్యాపించినటుల నిదర్శనములు కలవు. పశ్చిమ సముద్రతీరమున మలబారునందు గల కొన్ని ప్రాచీన కాలపు చర్చి (దేవాలయము) లును, మైలాపూరునందలి చర్చియు మిక్కిలి పురాతనములయినవి. క్రైస్తవులలో, క్యాథలిక్కులు, జెసూఇట్లు, ప్రొటెస్టెంట్లు మొదలయిన శాఖలనేకములు కలవు. వీరిలో క్యాథలిక్కులు క్రీస్తుని దేవాంశసంభూతునిగా దలచి, అతని విగ్రహములను పూజింతురు. ఇట్టి విగ్రహారాధన మనహిందూమతాచారములకు, విరోధము కాకుండుటచేత, ప్రథమమున ఈమతము మన దేశమునందు త్వరగ వ్యాపించెను. ఆధునిక యుగమునందు క్రైస్తవ మతస్థులగు ఐరోపీయులు సముద్రమార్గములద్వారా వ్యాపారమునిమిత్తము హిందూస్థానమునకు వచ్చి, ఇచ్చటి అరాజక పరిస్థితులను సహాయము చేసికొని, రాజ్యములను స్థాపించిరి. ఇందులకు వీరికి నవీన యంత్రశక్తి ఎక్కువగా తోడ్పడెను. పాశ్చాత్యుల రాజ్యాభివృద్ధితోపాటు క్రైస్తవ మతముకూడ కొంతవరకు వ్యాపించినను సనాతనధర్మమును కదలింపజాలక, ఇదివరకున్న మతములతో పాటు మరియొక మతముగా నిలచిపోయెను.

ఐచ్ఛికముగా క్రైస్తవమతమును అవలంబించి ఆచరణయందుంచుచున్నటువంటి మహాత్మగాంధికి మించిన క్రైస్తవ మతావలంబకులు, ఇప్పుడీ లోకమున లేరనియే చెప్పవచ్చును.

## పా ర సీ క మ త ము

హిందూస్థానమునందు ప్రస్తుతము రమారమి ఒకలక్షమాత్రము పారసీక మతస్థులు కలరు. ప్రథమమున వీరును ఆర్యసంతతిలోనివారలే. ఆర్యులలో కాలక్రమమున ఆచారవ్యవహారములందు భేదభావము ఉత్పత్తిచెందుటకు ఆరంభించెను. కొందరు పశుయాగమును, సోమపానమును అంగీకరించి, ఆదిత్యుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు, వాయువు- వీరందరు ఒక్కదేవుని అంశములే అని, వారిని దేవతలుగా నెంచి, వారి గుణగణములను కీర్తించుచు, వారి ప్రీత్యర్థము అగ్నిహోత్రమునందు హోమములం చేయుచుండిరి. ఈ దేవతలకు సురలని పేరుపెట్టిరి. దేవశబ్దమునకు ప్రకాశమయిన అని అర్థము. ఇందరిని పూజించినను సర్వేశ్వరుడు ఒక డే అనియు

తక్కినవన్నియు, నామరూపాత్మకమగు భగవంతుని అంశములే అని వా రెరింగి యుండిరి. వీరికి హింద్వార్య్య లని పేరు. వీరే మనపూర్వీకులు. *మరి కొందరు పశుయాగ, సోమపానములను వర్జించి, పై నుదహరించిన దేవత లను నింద్యార్థమగు అసురులుగను, దయ్యములుగను భావించిరి. ఈ కారణ ముచే ఆర్యులలో నీ రెండుశాఖలవారికిని విరోధము హెచ్చి రెండవ శాఖ వారు పారసీక దేశమునకు వెడలిపోయిరి. ఇటుల దేశాంతరగతులయిన వారికి పారసీకార్య్య లని నామము కలిగెను. ఇటుల మతభేదములు కలిగినను, రెండు తెగలవారును సోమ, సూర్య, మిత్ర, యములను, పూజనీయులుగనే యెంచుచుండిరి. రెండు శాఖలవారికిని కర్మకాండ, వర్ణ వ్యవస్థ మొదలయిన కొన్ని ఆచారములందు మార్పు కలిగియుండలేదు. పారసీకులలోకూడ బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రు లను నాలుగు ముఖ్య వర్ణములుకలవు. ఈ నాలుగువర్ణములవారును యథాక్రమముగ అర్థ్రవన్, రథేస్తార్, వాస్త్రియోష్, కుతోక్ష అని పిలువబడుచుందురు. ఇప్పటికిని పారసీకులలో ఉపనయనసంస్కారము కలదు. ఉపనయనానంతరమే శిష్ట సంఘమునందు చేర్చుకొనెదరు. ఇప్పటి హిందువులవలె గాక, పూర్వపు ఆర్యులవలె స్త్రీలకు ఉపనయనముచేయు ఆచారము నేటికిని వీరియందు కలదు. శిఖ, మేఖల, యజ్ఞోపవీతములకు బదులు వీరు టోపి, నడుమునకు మొలత్రాడు, ఒంటిమీదచొక్కా సర్వదా ధరించుచుందురు.

## జరత్రుష్టఋషి

ఈ మతమునకు జరత్రుష్టఋషి (Zarathushtra) ప్రవక్త. పారసీక వేదమయిన అవెస్తాను ఇతడు రచించెను. వేదములయొక్క సంస్కృత భాషయు, ఈ అవెస్తాయొక్క భాషయు చాల దగ్గరగ నుండుటచే, నీ రెండుభాషలును ఇంతకంటె పూర్వముండిన ఒకభాషనుండి పుట్టిన అక్క చెల్లెండ్రయి యుండవచ్చునని కొందరూహించుచున్నారు. ఇతడు క్రీస్తు పూర్వము 1,000 సంవత్సరముల నాటివాడు. ఇతని గ్రంథమును ఎన్ని ఆపత్తులు వచ్చినను, పారసీకులు తరతరములనుండి, భరతఖండమునందు వేద ములవలెనే, కాపాడుచు వచ్చిరి. కాని, క్రీ. పూ. 331 వ సంవత్సరములో అలెగ్జాండరు దండయాత్రయందును, క్రీ. శ. 657 వ సంవత్సరములో అర

*హిందూదేశ కథాసంగ్రహము, 18 పేజి. కె. వి. లక్ష్మణరావుగారు.

బ్బీయుల దండయాత్రయందును కొన్ని శిథిలములయి పోయెను. అయినను పారసీకులు ప్రతిదినమును, ప్రతినెలయందును, ప్రతి సంవత్సరమునందును అనేక వ్రతముల కొరకయి ఉపయోగించుచుండుటచే యజ్ఞమను ఒక సంహితను వీరు పూర్తిగా కాపాడగలిగిరి. ఇందు జరత్పృష్టుని ధర్మము ననుసరించి ముఖ్యమయినవి మూడువిషయములు కలవు.

## పారసీక మతసిద్ధాంతములు - ధర్మములు

1. నిర్గుణుడగు ఈశ్వరుడు ఒకడే సృష్టికర్త. అతనినుండి ప్రపంచము అంతయు ఉత్పన్నమయి, తుదకు అతనియందే లీన మగును. ఈశ్వరుని యందు స్త్రీ పురుషాంశములు రెండును కలవు. జ్ఞానమును పొందినపిమ్మట తాను భగవదర్పణ మగుట ప్రధానము. ఇట్టి అర్పణమునకు "అశ" అనిపేరు. ఈ అశనే మహమ్మదు ఇస్లామనెను. ఇట్టి జ్ఞానమువలన, ప్రథమమున భగవంతుని దర్శనమును, పిమ్మట సామీప్యమును, తుద కతనిలో ఐక్యమును కలుగును. ఈ అశ అనునది మిక్కిలి గూఢమయిన విషయము కాన, సామాన్యజనులకు బోధపడుట కష్టము. నిర్గుణుడగు ఈశ్వరుని గూర్చి ధ్యానించుట సులభమయిన విషయము కాదు. కాబట్టి, జరత్పృష్టుడు ఒక సాంకేతికమును ప్రతిపాదించెను. అది ఈశ్వరునియొక్క భౌతికచిహ్నమయిన అగ్ని. ఇది యే వస్తువు తనను సమీపించినను, తనలో నిముడ్చు కొనును. మరియు, అగ్నిజ్వాలలు ఎప్పుడును ఊర్ధ్వముగనే ప్రజ్వలించుచుండును. ఈరెండు గుణములను బట్టియు, భగవత్సృష్టియందు, అన్నిటిని పవిత్రము చేయునదగుటచేతను, జరత్పృష్టమార్గావలంబకులు అగ్నిని ఇహపరలోకముల రెంటికిని ప్రభువుగా అంగీకరించి పూజింతురు.

స్రోష (శుశ్రూష) అనునది ప్రతిమానవుడును సంపాదింపవలసిన ఉన్నతమయిన నీతి. ఇందు భగవంతునియందు భక్తి, అతని ధర్మములను పాలించుటయందు విశ్వాసము, అతని అజ్ఞలను శిరసావహించుట, అను నీ మూడును చేరియున్నవి. శుశ్రూషావస్థను పొందిన పిమ్మట మోక్షమార్గము కరతలామలకమయి అందుబాటులో నుండగలదు. అనగా భగవంతుని కటాక్షము కలిగినపుడు, అతని సేవ చేయవలె ననెడి ఆర్తి తనలో ప్రజ్వలించి, మనస్సు పరిశుద్ధమగును. ఇది విశిష్టాద్వైత మార్గము.

2. మంచిచెడుగులు:—భగవంతుడు ప్రథమమున మంచిచెడుగు లనెడి పరస్పరవిరోధము గల రెండు తత్త్వములను సృష్టించె ననియు, అందు మొదటిది చైతన్యము కలదనియును, రెండవది జడమనియు, ఈ రెండు తత్త్వములు కలిసినపుడే, సృష్టియందు నామరూపము లేర్పడి, ఏ వస్తువయినను దృశ్యమగుచుండుననియు, పారసీకుల అభిమతము. ఈ తత్త్వములు రెండును సాంఖ్యుల పురుషప్రకృతులను పోలియున్నవి. పోల్చిచూచుటకు చెడుగుణమున్నపుడే మంచిగుణము తెలియును. కేవలము భౌతికపదార్థములందు నిమగ్నులగు వారికి చెడుగుణముయొక్క అధికారము హెచ్చుగ నుండును. వెలుతురును చీకటియు (ఛాయ) నొకదాని నొకటి యేప్రకారము విడువక యుండునో, అటులనే మంచిచెడుగులు రెండును ఒకదాని నొకటి అనుసరించియే యుండును. చీకటి అనగా వెలుతురుయొక్క అభావమే. కొందరు తలచినటుల, ఈ విభేదముచే, జరత్కృష్టుని మతము ద్వైతమతము కాదు. ఏల ననగా అతని బోధ లన్నియు * "ఏకమేవాఽద్వితీయం" అనెడి అద్వైతవాదమునే బోధించుచున్నవి.

3. ప్రతిమతమునందును భగవంతుని తెలిసికొనుటకు మూడు మార్గములు కనిపించుచున్నవి. (1) జ్ఞానము, (2) భక్తి, (3) కర్మ (సేవ).

జరత్కృష్టుడు ఈ సేవామార్గమునకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చి, నిష్కామ కర్మయోగమును బోధించి, జన్మ మెత్తినందులకు ఈ దేహమును పరోపకారార్థమును, పరులనిమిత్తమే యుపయోగించుచుండ వలెననియు బోధించి మోక్షసంపాదనయందు మానవసేవకు అగ్రస్థాన మిచ్చెను.

ఇప్పటికిని పారసీకులు ఈ మార్గమునే హిందూస్థానమున అవలంబించుచు తమ మతముయొక్క ఘనతను నిలుపుకొనుచున్నారు. సేవ అనెడి ఒక పదమునందే పారసీకమతముయొక్క సర్వస్వమును ఇమిడి యున్నది. వ్యాసమహర్షి యొక్క ఆదర్శముకూడ ఇదియే.

"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్."

—వ్యాసకృత మహాభారతము.

క్రీ. శ. 936 లో అరేబియానుండి మహమ్మదీయమతము వచ్చినప్పటికి జరత్కృష్టమతము శిథిల మగుటచే, చాలభాగము మహమ్మదీయుల

* ఛాందోగ్యోపనిషత్తు 6, 2-1.

దాడికి లోబడిపోయినది. కాని, దృఢవిశ్వాసముగల కొందరు తమ అగ్ని హోత్రములను చేత బట్టుకొని, తమ మాతృభూమిని విడిచి, సోదరియగు ఆర్యావర్తమునకు వచ్చి చేరిరి. బొంబాయికి ఉత్తరమున ఎనుబదిమైళ్ళ దూరములోనున్న ఉద్వాడ అను చిన్న పట్టణమునందు పవిత్రమయిన అ యగ్నిని భరతఖండమున ప్రతిష్ఠించి అచ్చట ఒక పారసీక దేవాలయ మును నిర్మించిరి. ఈ యగ్ని పారసీకభక్తుల హృదయములందుండెడి అంత రాగ్నిని నిరంతరము ప్రజ్వలింప జేయుచుండును. భరతఖండమునే పార సీకులు మాతృభూమిగ నెంచుకొని స్వల్పసంఖ్యాకు లయినను, కోట్లకొలది గా నుండు సోదరసంఘములకు సేవచేయుచు తమ మతమునందలి ప్రధాన సూత్రమగు పరోపకారమార్గమును విడువక పారసీక మతకీర్తిని ఆచంద్రా ర్కముగ చేయుచున్నారు.

---

# 6. ఆధునిక యుగము

(క్రీ. శ. 1858 నుండి .........)

[విషయ సంగ్రహము:—ఆధునిక యుగము-జాతీయోద్యమము-మతసహనము- ఐకమత్యము- అహింసాసూత్రము.]

---

ఆధునిక యుగమునందు ఐరోపీయుల నాగరికతయు, భాషయు, దేశమందు వ్యాపింపజొచ్చెను. మహమ్మదీయుల రాజ్యములో వారి వేష భాషలను అవలంబించి నటులనే, సహజముగ ఈ శతాబ్దమునందును ఐరోపీయుల వేషభాషలను, వారి ఆచారములను ప్రజలు అవలంబించుచు వచ్చిరి. పాశ్చాత్య వ్యామోహ మెక్కువైనందున, హిందూధర్మమును, మహమ్మదీయధర్మమును నిర్లక్ష్యముగా జూచుచు విదేశరాజుల ప్రవర్తనలే అన్ని విధముల మంచివని ప్రజలు అవలంబించుచు వచ్చిరి. కాని, త్వరలోనే పాశ్చాత్యుల నాగరికత, వారి వ్యాపార పద్ధతి, రాజ్యాంగ విధానము, సాంఘిక మర్యాదలు లోపభూయిష్ఠములై యున్నవని తెలుసుకొనిరి.

## జాతీయోద్యమము

క్రమక్రమముగా మనవారలు కండ్లు తెరచి అఖిలభారత జాతీయ మహాసభను 1885 న స్థాపించి జాతీయోద్యమము అను పేర జాతీయ కళలు, శాస్త్రములు మొదలైన సమస్తవిషయములందును మన దేశ పరిస్థితులను బట్టి ప్రజలు ఎంతవఱకు అభివృద్ధి చేసికొనగలరో అంతవఱకు అభివృద్ధి చేయుచు వచ్చిరి.

శ్రీస్వామి వివేకానందుడు ప్రపంచమున గల అన్నిమతములలోను అద్వైత (వేదాంత) మే శ్రేష్ఠతమమైనదని ఘంటాపథముగ 1893 సంవత్సరమున అమెరికా దేశమున సర్వమత సమావేశమునందు నిరూపించెను.

క్రైస్తవమతము ఈ దేశమున అధికముగా ప్రచారమునందుండిన సమయమున దానికి ప్రతిబంధకముగా శ్రీ రాజా రామమోహనరాయలు 1828 సంవత్సరమున బ్రహ్మసమాజమును స్థాపించెను. అమెరికాలో న్యూయార్కు నగరమునందు 1875 సంవత్సరమున దివ్యజ్ఞాన సమాజము స్థాపింపబడెను. ఈ సమాజపు ముఖ్యప్రవర్తకురాలగు శ్రీ అనిబిసెంట్, యావజ్జీవము హిందూస్థానముయొక్క స్వాతంత్ర్యమునకై పోరాడెను. ఈమె దక్షిణ హిందూస్థానమున సనాతనధర్మమును పునరుద్ధరించినది. 1890వ సంవత్సరమున శ్రీ స్వామి దయానందసరస్వతి ఆర్యసమాజమును స్థాపించెను. ఇదిగాక, ఇంకను అనేకసమాజములు తమతమ శక్తికొలది స్వమతాభిమానమును స్వదేశ స్వరాజ్యాభిమానమును పునరుద్ధరించి ఐకమత్యమును బోధించుచున్నవి.

శ్రీ తిలక్ మహాశయుడు కారాగృహమునుండి అమూల్యమైన గీతారహస్యమును 1915 లో ప్రచురపరచెను. 1914-1918 లో ఐరోపీయ మహాసంగ్రామము జరిగినప్పుడు క్రైస్తవమతముయొక్క యథార్థమైన శక్తి బయలుపడి పాశ్చాత్యుల నాగరికత ధ్వంసమాయెను.

## మతసహనము - ఐకమత్యము

జాతీయోద్యమమునందు హిందువులును మహమ్మదీయులును ఏకమైరి. అనేకమంది ప్రాణములను త్యజించిరి. కొందరు కారాగారవాసమును ఇచ్ఛగించిరి. కైలాసము మొదలు కన్యాకుమారివఱకు హిందూస్థానమంతయు ఒకవ్యక్తిగా నిలిచెను. ఇందు ఎన్నిజాతులవారును, ఎన్ని మతముల

వారును ఇదివఱకు నివసించియున్నను, వా రందరును ఒక తల్లిబిడ్డలని గ్రహించిరి. అందరికిని స్త్రీ,పురుష లనక హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పారశీకులు, జైనులు, బౌద్ధులు, నాగరికులు, అనాగరికులు, బీద వారలు, ఐశ్వర్యవంతులు అనెడి భేదభావము లేక సర్వజనులును స్వారాజ్య కాంక్ష గలిగి ఒక్క జెండాక్రింద నిలిచిరి. ఇందులకు దేశభక్తి ప్రధాన మని తెలిసికొనిరి. "జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ." దేశభక్తి పూర్ణముగా లేకపోవుటచేతనే మనము పరదేశీయులకు లోబడవలసిన పరిస్థితులు కలిగినవి. ప్రథమమున దేశము, అ తరువాతయే మతము. భేదబుద్ధులకు కారణములు వ్యక్తులనుబట్టి పుట్టినవి గాని మతమును బట్టి పుట్టలేదు. ఇప్పుడు మహమ్మదీయమతముయొక్క అభివృద్ధికొరకను మిషతో వితండవాదములు సలుపుచున్న శ్రీ మహమ్మదాలీ జిన్నాగారి అమ్మమ్మ హిందూమతస్థురాలే. జిన్నాగారి మతము మారినను, వారి జన్మభూమి మారునది కాదు. హిందూస్థానమునందు నివసించు సర్వజనులకును స్వారాజ్యము జన్మహక్కు. "హిందూస్థాన్ హమారా" అని దేశరక్షణకై ప్రజలందరును పరమత సహనముగలిగి ఐకమత్యముకలవారై నడుము కట్టుకొనిన తప్ప దేశస్వాతంత్ర్యమునకును, ప్రపంచశాంతికిని వేరుమార్గము లేదు.

"లోకాః సమస్తాః సుఖినో భవంతు"

"సమస్త లోకములు సుఖముగ నుండుగాక!"

అను సనాతనమగు ఈ ధర్మమును ప్రపంచ మంతయు వ్యాపింప జేయవలె ననిన ఐకమత్యము ఒక్కటే మార్గము.

"నాన్యః పంథా అయనాయ విద్యతే" (తైత్తిరీయ)

"ముమ్మాటికి నింతకంటె వేరుమార్గము లేదు."

## అహింసా సూత్రము

పాశ్చాత్యులకును, భారతీయులకును, జీవితాదర్శములందు భేదము లుండుటచేత,ఎవరివిజ్ఞానము సత్యమైనదోఎవరిది అసత్యమైనదో తెలుసుకొనుటకు ఇంకను కొంత కాలముపట్టును. వారి నాగరికత యంత్రబలము నాధారముచేసుకొన్నది. మనది ఆత్మబలము నాశ్రయించినది. హిందూస్థానము ఎన్ని జాతులవారు వచ్చిచేరినను వారినెల్లరిని తనగర్భములో నిముడ్చుకొనుచున్నది.

భిన్నభిన్న అంగములచేత చతురుడైనశిల్పకారునిచే కల్పించబడినవిగ్రహము ఏ ప్రకారముగ ఏకశిలారూపమును దాల్చిన పిమ్మట జీవకళలను కురిపించునో, ఆర్యుల నాటినుండి క్రమక్రమముగా వృద్ధిజెందిన హిందూస్థానము ఎల్లజాతుల, మతములవారు వచ్చి చేరినను, వారిని సహనబుద్ధితో తనలో చేర్చుకొనిన భారతజాతీయత ఇప్పటికిని సజీవమై యుండుటచే తన ఆశయములను ప్రపంచమునకు ఇంకను బోధింపగల దని ఆశింపవచ్చును. భారతజాతీయత సజీవముగ ప్రవాహ మగుటకు నిదర్శనముగా శ్రీ గాంధి మహాత్ముడు ఒక్కడే చాలును. గాంధీమహాత్ముడు ప్రబోధించునది అహింసాసూత్రము. ఈ సూత్రము చరకసంహితయందు సారభూత మగు సూత్రస్థానమున కడపటి ఉపన్యాసముగా నున్న 30 వ అధ్యాయమున ఈ ప్రకారము గలదు.

"అహింసా ప్రాణినామ్ ప్రాణవర్ధనానామ్ ఉత్కృష్టతమమ్"

"ప్రాణములను రక్షించుటకు ప్రధానతమమైనమార్గము ఏది యనగా అహింసయే!" ఇట్లు చెప్పు ఆయుర్వేదవాక్యము త్రికాలసత్యమై యుండును గాక!

హిందూస్థానముయొక్క కీర్తి వర్ధిల్లును గాక!!

రాజకీయబానిసత్వముచే ప్రజల నావరించియున్న దీనత్వము పోయి భారతీయులు ఉత్సాహపూరితులుగను, కర్మవీరులుగను అగుటకు ఈ భారతీయ విజ్ఞానము సహాయపడును గాక!!!

"క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!" *

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

* గీత 2—3.

## 3 వ అ ధ్యా య ము

# హిందూస్థానమున విద్యావ్యాప్తి

[విషయసంగ్రహము :— హిందూస్థానమున విద్యావ్యాప్తి - ప్రాచీనవిద్యాపద్ధతి - యజ్ఞములు, వివిధవస్తుప్రదర్శనములు - విద్యాశాలలు - అరణ్యములలో పాఠశాలలు - సభలు, ఉపన్యాసములు - తీర్థయాత్రలు, భజనలు, కీర్తనలు - విశ్వవిద్యాలయములు: ద్వార పండితులు - నలందా - తక్షశిల - భాష-లిపి : బ్రాహ్మీలిపి - ఖరోష్ఠిలిపి]

హిందూస్థానమున ఆయుర్వేదాభివృద్ధి ఐన కాలమునందు వ్యాప్తమైయున్న విద్యాపద్ధతులనుగూర్చి ముందుగా తెలుసుకొనవలెను.

తక్షశిల, నలందా, దక్షిణదేశమున అమరావతి, మధుర, కంచి మొదలగు పట్టణములందలి విశ్వవిద్యాలయములలో ఆయుర్వేదము ఒక శాఖగా బోధింపబడుచుండెను. ఇదిగాక ఆ సేతు హిమాచల పర్యంతము నెలకొని యుండిన గురుకులాశ్రమములలో అన్నిశాస్త్రములతో బాటు ఆయుర్వేదము నభ్యసించుచుండిరి.

ఏడవ సంవత్సరము మొదలుకొని శబ్దశాస్త్రము, వ్యాకరణము, శిల్పశాస్త్రము, చికిత్సాశాస్త్రము, (వైద్యము) తర్కశాస్త్రము, ఆధ్యాత్మికశాస్త్రము అను ఐదు శాస్త్రములు ప్రతివిద్యార్థియు నేర్చుకొనవలసియుండెను. ఇవి అన్నిజాతుల వారికి అవసరమని గుర్తింపబడెను. ఇందుచే ఆ కాలమున విద్యాధికారులు ఇప్పటి విద్యాధికారులకంటె గొప్ప ఆదర్శములు కలిగియుండిరని చెప్పక తప్పదు. i ఇట్టి విద్యాప్రణాళికయే అక్బరు చక్రవర్తి కాలమువరకును ఆచరణయందుండెను.

i History of Aryan Rule in India – E. B. Havell.

ఆ కాలమున 32 శాస్త్రములు, 64 కళలక్రింద సమస్తవిజ్ఞానమును విజృంభించి ఏశాస్త్రమున కా శాస్త్రము, ఏకళ కా కళ సర్వతోముఖముగ రాజులచేతను ప్రజలచేతను ప్రోత్సహింపబడుచుండెను.

నగరములలో ఒకప్రక్క విజ్ఞానమును, విషయసుఖములును మితిమించి వర్ధిల్లుచుండ-ఇంకొకప్రక్క గ్రామనివాసులు ఆశ్రమములు నిర్మించి జ్ఞానసంపాదన నిమిత్తమై సర్వోత్కృష్టమగు తత్త్వవిమర్శలను చేయుచుండిరి. జ్ఞానముల కాటపట్టగు ఆశ్రమములను నగరములు పోషించుచుండెను. విషయ సుఖములయందు మునిగియుండు పట్టణవాసులు అజ్ఞానమార్గమును తొక్కకుండ ఆశ్రమవాసులు ఆత్మతత్త్వజ్ఞానవ్యాపనముచే వారిని రక్షించుచుండిరి.

ఈ ప్రకారము సంఘములోని కట్టుబాట్లు ధర్మార్థ కామమోక్షము అనెడు చతుర్విధ పురుషార్థముల విషయమై తమతమ హద్దులను మీరకుండ భారతీయ నాగరికతను పెంపొందించుచు వచ్చినవి. అప్పటి వైభవము, రామాయణము, మహాభారతము మొదలగు గ్రంథములలో వర్ణింపబడినవి చూచినచో, ఎవరికైనను ఆశ్చర్యము గొలుపక మానదు.

ఆసేతుహిమాచలమువరకు నుండు రాజమార్గములు, చైనా మొదలు రోము వరకు వ్యాపించిన వ్యాపారపద్ధతి, మనము నమ్మినను నమ్మకపోయినను రావణుని రాజ్యమునందు వర్ధిల్లిన ఐశ్వర్యము, విమాన ప్రయాణములు మొదలగు సమస్తసంపదలతో గూడిన భారతదేశమున ఇతర కళలతో బాటు వర్ధిల్లిన ఆయుర్వేదముయొక్క పూర్వచరిత్రయు అప్పటి విద్యాపద్ధతియు విద్యార్థులందరును తెలుసుకొనదగినది. అందుచే సంగ్రహముగా దీనిని గూర్చి వివరింపదలచియున్నాము.

## ప్రాచీన విద్యాపద్ధతి

హిందూస్థానమునందలి విద్యాపద్ధతి ఇతరదేశములందలి విద్యాపద్ధతి వంటిది కాదు. రామాయణమునాటికే సంఘమునందు ఏ జాతి కా జాతి తమతమ కళలను వృద్ధిచేసికొనుచు రాజ్యాంగమునందు తమతమ స్థానముల నలంకరించియుండె నని మేము వ్రాసినయెడల అనేకులు నమ్మకపోవచ్చును.

దశరథుని రాజ్యములో నాస్తికుడైనవాడుగాని, అసత్యవంతుడుగాని,

నిరక్షరుడైనవాడుగాని లేడని రామాయణము బాలకాండ 6 వ సర్గమున 8-14-15 శ్లోకములలో చెప్పినదానినిబట్టి ఆ కాలపు రాజులయొక్కయు, మంత్రులయొక్కయు సామర్థ్యమునుగూర్చి వేరుగ వ్రాయనక్కరలేదు. ఇప్పటి ఇంగ్లీషు పరిపాలనమున నూటికి పదిమందికంటె చదువను, వ్రాయను నేర్చినవారు లేరుగదా!

## యజ్ఞములు. వివిధ వస్తుప్రదర్శనములు

ఈ కాలమునందు ఉన్నట్లు పాఠశాలలు, పరీక్షలు లేకున్నను ఇంత కంటె జ్ఞానదాయక మగు పద్ధతులు హిందూస్థానమున వర్థిల్లియుండెను. రాజు ఒకయజ్ఞము చేసినాడనగా అది ఒక పెద్దప్రదర్శనము అని చెప్ప వలెను. అక్కడ వివిధప్రాంతములనుండి వచ్చిన పండితులు, మతకర్తలు, వ్యాపారులు మొదలగు సమస్త మహాజనులకు ఆకరములగు సభలు జరుగు చుండెడివి. దిగ్విజయముచేసి సంపాదించిన ధనమంతయు రాజు వివిధ శాస్త్రములందు ఆరితేరిన శిల్పులకు, పండితులకు, కళావంతులకు దక్షిణలుగా పంచిపెట్టుచుండెను. ఒక యజ్ఞమైన తరువాత రాజు తిరిగి తనకు తాను కల్పించుకొనిన కటికి దరిద్రమును అనుభవింపవలెను. సమస్తైశ్వర్యములను విడిచి కుండపాత్రలలో వంటచేసుకొనుటకు ప్రారంభించి తిరిగి వెనుకటి వలె అర్థిక స్థితిని అభివృద్ధినందించుకొనవలెను. i సామ్రాజ్యమునందు చేరిన సంపద ప్రజలకు తిరిగి పంచిపెట్టుటకై ఏర్పడిన ఈ పద్ధతి తులాభార మను పేరుతో మొగలుచక్రవర్తుల కాలములోకూడ అనుసరింపబడెను. దేశ మునకై ఇంతకంటె త్యాగము ఉండగలదా? దశరథమహారాజు పుత్ర కామేష్టి చేసినప్పుడు వివిధ ప్రాంతములనుండి చిత్రకారులు, శిల్పులు, జ్యోతిష్కులు, నటకులు, నర్తకులు మొదలగు సమస్త విద్యలయందును ఆరితేరినవారలు ఆహ్వానింపబడిరి.

## విద్యాశాలలు

విద్యాశాలలయందు పిల్లల చదువు ఏడవ సంవత్సరమున ప్రారంభించ బడి 12 అధ్యాయములు గల సంస్కృత గ్రంథమును అక్షరములనుండి ప్రారంభించి లోకమున సామాన్య పౌరునకు కావలసిన జ్ఞానమంతయు

i రఘువంశము.

కలిగియుండెను. ఇది మన ప్రాథమిక పాఠశాలల చదువువలె 5, 6 సం. లోపల ముగియునదిగా నుండును. ఆ పద్ధతి ఇంకను కొంతవఱకు మన పెద్ద బాలశిక్షలో గలదు. "ఓం నమశ్శివాయ సిద్ధం నమః" అనెడి శైవప్రార్థనతో పిల్లలు విద్యాభ్యాసము అప్పటినుండి ఇప్పటివరకు హిందూస్థానమున ఓనమాలతో ప్రారంభించు ఆచారము వచ్చుచున్నది. కాని యంత్రశాలలో ఒకేరీతిగ యంత్రసహాయముచే లక్షలకొలది వస్తువులను తయారు చేసినట్లును, ఇప్పటి కళాశాలలలో వేలకొలది విద్యార్థులను ఒకేరీతిగ తయారుచేసినట్లును అప్పటి పద్ధతి ఉండెడిదికాదు. 7500 మంది విద్యార్థులు నివసించుటకు అవకాశము గల నలందా విశ్వవిద్యాలయమునందు 1500 మంది ఆచార్యులు వారితో కూడా నివసించియుండిరి. ఇంతటి జనసంఖ్యగల విశ్వవిద్యాలయములో గూడ ఒక ఉపాధ్యాయునకు ఐదారుగురు శిష్యులే ఉండిరి. ఉత్తమ, మధ్యమ, అల్పబుద్ధులగు త్రివిధశిష్యులకును వారివారి బుద్ధి కుశలతను బట్టి విద్య గరపగల సౌకర్యములు కలిగి యుండెడివారు. ఒక ఉపాధ్యాయుడు ఇప్పటివలె నలుబదిమందివిద్యార్థులకు విద్య నేర్పవలసివచ్చినచో అట్టి సౌకర్యము కలుగనేరదు. అందుచేత ప్రాచీన హిందూస్థానమున ప్రతి విద్యార్థికి అతని శక్తికి తోడ్పడునట్లు ప్రత్యేక విధముల విద్యగరపు పద్ధతి గురుకులములయందేగాక పెద్దపెద్ద సంస్థలయందుగూడా వ్యాపించి యుండెను. క్రొత్తగా వచ్చు విద్యార్థికి ప్రాతవిద్యార్థి గురువుగానుండును. ఈ విద్యార్థి అంతకంటె తెలిసిన మఱియొక విద్యార్థివద్దనుండి తనకు కావలసిన విషయముల గూర్చి నేర్చుకొనుచుండును. ఒకరికి విద్యార్థిగా నుండువాడు ఇంకొకరికి గురువుగా నుండును. ఈ గురువునకు ఇంకొక గురువును, వానికి తిరిగి గురువును ఇట్లు గురుపరంపరలు ఏర్పడి ఒకేగురువు ఒకేసారి అనేక విద్యార్థులకు ఇప్పుడున్నట్లు క్లాసులపద్ధతిని చెప్పవలసిన అవసరములేకుండా వారివారి బుద్ధి కుశలతనుబట్టి మెల్లగానో వేగముగానో విద్య నభ్యసించుటకు అవకాశము లుండెడివి. మందమతులు పైకెక్కలేకపోయినను, బుద్ధిశాలురు వెంటవెంటనే తమ ప్రజ్ఞలను ప్రదర్శించుటకు అవకాశ ముండెడిది. తుదకు విశ్వకళాశాలయందు అధిపతి యగు శీలభద్రుడను పేరుగల ప్రధాన గురువు ఏ ఐదారిగురికో ఉపన్యసించును గాని, అనేక తరగతుల బుద్ధి కుశలత గలవారికి ఉపన్యసించ నవసరముండదు. మండనమిశ్రునకు షుమారు

500 మంది విద్యార్థులు శాఖోపశాఖలుగా నుండి విద్యాభ్యాసము చేయుచుండిరని శంకరవిజయములో నున్నది.

## అరణ్యములలో పాఠశాలలు

ఇది గాక భారతదేశమునందు పట్టణములకంటె విశ్రాంతి పూర్వకముగ నుండు అరణ్య నివాసమే జ్ఞానాభివృద్ధికి తోడ్పడినది. వారు ఈ పట్టణమునందలి జనసమ్మర్దమును దుమ్ము, మురికి, శబ్దము, అనాచారము వీని నుండి దూరముగ నుండుటకు ప్రయత్నించిరి. కొంత కాల మైన తరువాత ఏర్పడిన బౌద్ధవిహారములు గూడ ఇదేపద్ధతి నవలంబించి జ్ఞానాభివృద్ధికి తోడ్పడినవి. గురుకులవాసము, బ్రహ్మచర్యము ఈ రెండును విద్యాభ్యాసమునకు కావలసిన చిత్తవృత్తినిరోధమునకు అవసరమని వారు తలంచిరి.

## సభలు, ఉపన్యాసములు

ఐతే పెద్దపెద్ద సభలు ఉపన్యాసములు భారతీయులకు తెలియకపోలేదు. ఋగ్వేదమునందే సంఘము లను పేర సభలు జరిగి పండితులు ఉపన్యాసము లిచ్చుచు చర్చలు జరుపుచుండిరి. ఆయుర్వేద వైద్యులు గూడ ఇట్టి సభలు చర్చలు జరుపుచుండి రని చరకసంహిత యందు అనేకచోట్ల చూడగలము. అందు ముఖ్యముగ విమానస్థానమునందు "రోగభిషగ్జితీయము"అను ఎనిమిదవ అధ్యాయమున చక్కగ వివరింపబడినది. ఈ పద్ధతి వేదములలోనిదే.

ఛాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తులందు ఇట్టి పరిషత్తుల వివరము గలదు. విదేహ దేశమున జనకు డను రాజర్షి సభగావించినప్పుడు మిక్కిలి దూరముగ నున్న మేరు, పాంచాలదేశముల నుండి పండితులు వచ్చియుండి రని తెలియుచున్నది. ఈ పరిషత్తునందు "గార్గీవాచ కనపి" అను స్త్రీ గొప్ప విద్వాంసురాలు. ఆమె తన వాదముచే యాజ్ఞవల్క్యఋషి అంతటి వానిచే పురస్కరించ బడిన ఋషుల నందరిని ఓడించె ననియు తెలియుచున్నది. "లోపాముద్ర" మొదలగు స్త్రీలు కొన్ని మంత్రములకు ఋషులుగా నున్నట్లు ఋగ్వేదమునందు గలదు. ఋషియనగా క్రొత్త విషయమును కనిపెట్టినవాడు.

జనకుడను పాంచాల దేశపు రాజు ప్రతిదినము ఉదయమున పండిత పరిషత్తునకు వెళ్ళుచు తన రాజ్యము నందలి పండితుల సాహచర్యము వలన జ్ఞానము సంపాదించుచుండెడి వాడని ఉపనిషత్తులలో గలదు.

## తీర్థయాత్రలు, భజనలు, కీర్తనలు

కాబట్టి గురుకులమున ప్రత్యేక విద్యార్థి రహస్యముగను, పవిత్రముగను ఉండు పరిస్థితులలో విద్యార్థికి బుద్ధికుశలతకు తగినట్లు విద్య గరపెడి వారనియు సభలు, పరిషత్తులు, తీర్థయాత్రలు, భజనలు, పురాణములు, ఇతిహాసములు వీని మూలమున కూడా జనసామాన్యమునకు విద్యాబోధ చేసెడివారనియు స్పష్టపడుచున్నది.

## వి శ్వ వి ద్యా ల య ము లు

ప్రాచీన హిందూస్థానమునందు రాజుల పోషణచే అభివృద్ధినందిన విశ్వవిద్యాలయములు ఖండాంతరములయందు గూడ ప్రసిద్ధిజెందియుండినవి. అందు ముఖ్యమైనవి తక్షశిల, నలందా, విక్రమశిల, జగదళ, ఉద్దండాపుర, వలభి, మిథిల, ఉజ్జయిని, కాశి, నడియాడ్, గుంటూరు ప్రాంతమునను న్న అమరావతి, కంచి, మధుర మొదలగు ఈ స్థలములయందు ఉండినవి మిక్కిలి ప్రసిద్ధిజెందినవి.

తక్షశిలానగరమునందు ముఖ్యముగా వైద్యమభివృద్ధిజెందియుండెను. నలందాయందు బౌద్ధదర్శనములును, నడియాడ్‌నందు తర్కమును, అమరావతియందు రసాయన, శిల్పకళలును, ఉజ్జయినిలో జ్యోతిశ్శాస్త్రమును మధురయందు సాహిత్యమును, కాశి యందు వేదాంతమును ప్రత్యేకముగా నభివృద్ధి జెందియుండె నని తెలియుచున్నది. అన్ని విశ్వవిద్యాలయముల యందును సాధారణముగ అన్నిశాస్త్రములను నేర్పుచుండెడివారు. అందు ముఖ్యముగ వేదాంతము, వైద్యము, జ్యోతిషము వృద్ధిజెందుచుండెడివి.

## ద్వా ర పం డి తు లు

ఈ విశ్వవిద్యాలయములయందు ప్రవేశము గలుగుట మిక్కిలి కష్టమైనది. ఇందు ప్రవేశించకముందు ద్వారపండితులను తృప్తి చేయవలెను. వీరు ప్రవేశముకొరకై వచ్చువారి నందరిని క్లిష్టప్రశ్నలచే శలాకపరీక్ష గావించి, హెచ్చుప్రవీణత గలవారు మాత్రమే విశ్వవిద్యాలయములందు చేరునట్లు చూచుచుందురు.

శలాకపరీక్ష యనగా ఒక పుస్తకమునందు సూది గ్రుచ్చగా ఆ సూది ఏ పుటలోనికి దిగునో ఆ పుటలోని విషయములను గూర్చి పరీక్ష;

అనగా ఏ విషయములను గూర్చి ప్రశ్నించినను సంపూర్ణజ్ఞానమును ప్రదర్శింపవలెను.

## నలందా

ముఖ్యముగా నలందా విశ్వవిద్యాలయమునందు ప్రవేశము దొరకిన దనగా అది గొప్ప గౌరవము. భారతదేశమునందును, ఖండాంతరములందును, "మేను నలందా పండితులము" అనగా అగ్రస్థాన మిచ్చెడు వారు. కొరియా, మంగోలియా, బఖారా, జపాన్, చైనా, టిబెట్ మొదలగు ప్రాంతముల నుండి 56 గురు విద్యార్థులు వచ్చి నలందాలో నివసించి యుండినట్లు "హుయన్ స్యాంగు" అను చైనా యాత్రికుడు వ్రాయుచున్నాడు. ఇతడు భారతదేశమున క్రీ. శ. 629 మొదలు 645 వరకును 16 సంవత్సరములు ఉండె నని రికార్డు గలదు. అచ్చట నుండు స్తంభాల మంటపములును, విశాలమగు మందిరములును అనేక చిత్తరువులతో చెక్కబడి వివిధరంగులతో ప్రకాశించుచు పవిత్రమగు దేవాలయములతో నిండి యుండెను. అచ్చటి ఆరామములలో విశాల మగు నీడనిచ్చు దట్టమగు మామిడిగున్నలను, గుత్తులు గుత్తులుగ పుష్పించియున్న కనకవృక్షములను, నిర్మలమగు నీళ్లనిచ్చు జలయంత్రములను, నల్లకలువలచే మనోహరములగు కొలనులను ఈ ప్రయాణికులు వర్ణించియున్నారు.

7500 విద్యార్థులకును 1500 ఉపాధ్యాయులకును వీరి ఆశ్రితులగు నౌకరులు వగైరాలతో చేరి 12000 మందికి నివసించుటకు స్థానము; ఆహారము, దుస్తులు, విద్య, సమస్తమును ఉచితముగ ఇవ్వబడుచుండెను. రాజులును ప్రజలునుగూడ ఈ విశ్వవిద్యాలయమును పోషించుచుండిరి. దీని వంటి 200 గ్రామములు ఈ విశ్వవిద్యాలయమునకు చేరియుండెను. ఈ గ్రామములనుండి బియ్యము, పాలు, పెరుగు, నెయ్యి, కూరలు, వస్త్రములు, ఇవి అవి అననేల? సమస్తమును వచ్చుచుండెను. వ్యవసాయముగూడ విశ్వవిద్యాలయము వారిచేతనే చేయింపబడుచుండెను.

## తక్షశిల

పాంచాలదేశమునందుండిన తక్షశిలానగర విశ్వవిద్యాలయము వైద్యశాస్త్రమునకు నిధియై యుండెను. చైనా మొదలు రోమ్‌వరకు ఇచ్చట చదువుటకు విద్యార్థులు వచ్చుచుండిరి. బుద్ధుని వైద్యుడని ప్రసిద్ధిజెందిన

జీవకుడు మగధదేశమునుండి తక్షశిలకు బోయి 7 సం. వైద్యవిద్యాభ్యాసము చేసి ఆ కాలమున అనేకమంది చక్రవర్తులకు వైద్యము చేసియుండె నని నిదర్శనములు గలవు.

బౌద్ధ గ్రంథములలో మహాయాన మతకర్తగా ప్రసిద్ధిజెందిన నాగార్జునుడు ఆంధ్రదేశమున అమరావతి సమీపమున నాగార్జునకొండయందును శ్రీశైలమునందును నివసించి రసాయనశాస్త్రమునందు గొప్ప ప్రజ్ఞ గలిగి యుండెనని తెలియుచున్నది. గుంటూరుజిల్లాలో పల్నాడు సీమయందు నాగార్జునునికొండ యను ప్రదేశమున ఇప్పుడు అనేకములగు మందిరములును విహారములును బయలుదేరుచున్నవి.

## భాష, లిపి, సాహిత్యము

ఈ దేశమున అనాదినుండి వ్యాపించియుండిన వేదములలోని సంస్కృతభాషయొక్క ఉత్కృష్టతను గురించి ఎంత వ్రాసినను వ్రాయవచ్చును. కాని ఇచ్చట స్థలము చాలదు. ఆయుర్వేదము అభ్యసించుటకు అభిలాష గల వారలు సంస్కృతభాష నేర్చుకొనుట అవసరము. ఈ భాషయొక్క ఔన్నత్యమునుగూర్చి తెలుసుకొనుట మిక్కిలి అవసరము. ప్రపంచము నందలి భాషలు అన్నిటికి సంస్కృతము తల్లి. ఇప్పటికిని శాస్త్రీయపదములలో చాలా భాగము ఏభాషయందైనను సంస్కృత ధాతువులనుండియే పుట్టినట్లుగా తెలియగలదు. సంస్కృతభాషలో ఒక్కొక్క ధ్వనికి ఒక్కొక్క అక్షరము చొప్పున 56 అక్షరములు గలవు. ఇంగ్లీషు, అరవము మొదలగు కొన్ని భాషలవలె ఒకే అక్షరము అనేక ధ్వనులను సూచించదు. వేదములలో స్వరముల యొక్క ఉచ్చారణ ఎంతో జాగ్రత్తతో కాపాడుచు వచ్చియున్నారు. ఇందు కొరకై అనేక శిక్షలు, వ్యాకరణములు, నియమములు ఏర్పడి యున్నవి. క్రీ. పూ. 170 నాటికే 'పాణిని' అను ఒక గొప్ప వ్యాకరణ వేత్త భాషా శాస్త్రమునకు పునాది వేసియున్నాడు. ఇప్పటి ఇంగ్లీషు నెలలలో సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిసెంబరు అను సామాన్య ఇంగ్లీషు పదములు గూడ సప్త, అష్ట, నవ, దశ, అను సంస్కృతపదములనుండి పుట్టినవే అని చెప్పిన సంస్కృతభాషయొక్క వ్యాపకత్వము తెలియగలదు.

## లి పి

భారతదేశమున అనాదినుండి రెండు లిపులు ఉండినట్లు తెలియుచున్నది.

## 1. బ్రాహ్మి లి పి

ఇది తెలుగు లిపివలె ఎడమనుండి కుడికి వ్రాయునది. బ్రాహ్మీలిపినుండి ప్రస్తుతము హిందూస్థానములో వాడుకలోనున్న ఉత్తర దక్షిణదేశపు లిపు లన్నియు పుట్టినవి. అరవము, కన్నడము, మళయాళము, తెలుగుకూడ బ్రాహ్మిలిపినుండి పుట్టినవే. బర్మా, సయాం, కాంభోజ, జావా, ఫిలిప్పైన్, సింహాళము మొదలగు ప్రాంతముల లిపులుకూడా ఈ బ్రాహ్మి లిపినుండి పుట్టినవే.

## 2. ఖ రో ష్ఠి లి పి

ఇది ఉర్దూ లిపివలె కుడినుండి ఎడమకు వ్రాయబడును. ఇది పశ్చిమోత్తరమున హిమాలయ ప్రాంతములందు మాత్రము ప్రచారములోనున్నది. అఫ్గనిస్థాన్, తుర్కస్థానులలోగూడ నీ లిపిలో వ్రాయబడిన శాసనము లున్నవి. అప్పు డార్యావర్తము అంతవరకు వ్యాపించియుండె నని అర్థము.

అశోకుడు వ్రాయించిన శాసనములు క్రీస్తుశకము 272 మొదలు 231 వరకు హిమాలయపర్వతములనుండి మైసూరువరకును, బంగాళాదేశము నుండి గుజరాతువరకును గలవు. ఇవి అన్నియు సంస్కృతములోను పాళి మొదలగు దేశభాషలలోను వ్రాయబడి యున్నవి. పశ్చిమోత్తర సరిహద్దులలోనివి మాత్రము ఖరోష్ఠిలిపిలో నున్నవి. అన్ని లిపులుకూడ అథర్వవేదమునందలి తాంత్రికసంబంధమగు రేఖారూపముగా వ్రాయబడిన దేవతా సూచకములైన ప్రతిమల గుర్తులనుండి క్రమక్రమముగా పుట్టినవి. ఆ గుర్తులు ఆ యా దేవతల నామములందలి ప్రథమాక్షరములను బట్టి పరిణమించిన వని లిపి శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

ఉదా:— కామునకు (శివునకు) తంత్రశాస్త్రమునందు పెట్టబడిన "ప్లస్"గుర్తు (+) క్రమముగా "క" అను అక్షరముగా మారినది.

ఇట్లే అన్ని అక్షరములును వేదకాలము నుండియే యున్నట్లు నిదర్శనములు గలవు. చంద్రగుప్త చక్రవర్తికి పూర్వము 153 రాజులు ఈ దేశమును 6451 సంవత్సరములు పాలించినట్లుగా చక్రవర్తుల సంవత్సరవారీ పట్టీలు గలవు. అంకెలు, లిపి తెలియనిచో, ఈ లెక్కలు ఎట్లు వ్రాసియుందురు? రోడ్లసంధులయందును, సేనాశిబిరముల యందును మార్గములను సూచించు గుర్తు స్తంభములమీద అక్షరము లున్నట్లు నిదర్శనములు గలవు. దశాంశరాసుల విధానమును (Decimals) కోట్లసంఖ్యను మించిన లెక్కలును జ్యోతిశ్శాస్త్రము నందు గలవు. ఇది అంతయు 7000 సంవత్సరములకు పూర్వమే ఈ దేశము నందు వ్రాతయు గణితమును ఉండెనని ఋజువు చేయుచున్నవి. పాశ్చాత్య దేశములనుండి హిందూదేశీయులు లిపిని నేర్చుకున్నా రను మాక్సుముల్లరు మొదలగువారి వాదములు విశ్వాసపాత్రములు కావని ఇందుమూలముగా తెలియగలదు.

---

115

# 4-వ అధ్యాయము

---

# వాఙ్మయము

[విషయసంగ్రహము : వాఙ్మయము - వేదములలోని వైద్యము : వృత్తికిని ఆరోగ్యమునకును సంబంధము - దైవప్రార్థనల ప్రయోజనము - సూర్యుడు - సూర్యరశ్మి : వెలుతురు చికిత్స - అగ్నిచికిత్స - శస్త్రచికిత్స - వేదములలోని వ్యాధులు - త్రిధాతువులు - అశ్వినీ దేవతలు - వైద్యులు - గూఢార్థములు; కవిత్వము - కర్మజ్ఞానమార్గములు - ఆయుర్వేదమునకు వేదములు మూలాధారములు - ఉపనిషత్తులు : ప్రస్థానత్రయము - జీవాత్మ, పరమాత్మలు - స్మృతులు, పురాణములు - ఇతిహాసములు : రామాయణము - మహాభారతము, పంచతంత్రము - భగవద్గీత - కావ్యములు : శాకుంతలము - ఆయుర్వేద గ్రంథములందలి కావ్యరచన.]

---

ఈ ప్రపంచమున ప్రప్రథమమున మానవునకు తెలిసిన గ్రంథములు వేదములు. వానికంటె పూర్వపు వ్రాతగాని, పాటగాని ఏదియు ఇంతవఱకు కానరాదు. వేదము అనుపదమునకు "జ్ఞానము" అని అర్థము. జ్ఞానము అనాది, అనంత మగుటచే వేదముగూడ అనాది అనియు, అనంత మనియు చెప్పబడును. వేదవాఙ్మయము ఒకరిచే రచియింపబడిన దని తెలియక పోవుటచే అపౌరుషేయ మనియు, ఒకరివలన ఇంకొకరు విని గ్రహించుటచే శ్రుతి యనియు చెప్పబడును. ఈవేదములు నాలుగు 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అథర్వవేదము. ఈ వేదముల తరువాత ఉత్పన్నమైన వాఙ్మయము స్మృతి అనబడును. శ్రుతి, స్మృతుల

నుండి వివరముగా వ్రాయబడిన కథలు పురాణము లనబడును. ఈమూడును హిందూస్థానమున సమస్త వాఙ్మయమునకును మూలములు.

## వేదములలోని వైద్యము

వైద్యవిద్యార్థులు శ్రద్ధగ పరిశీలించినచో, ఆయుర్వేదముయొక్క ప్రారంభభాగము లన్నియు వేదములలో నున్నట్లు తెలిసికొనగలరు. ఈ దృష్టితో చూచినప్పుడు, వేదములందలి ప్రతిఅధ్యాయమును ఏదో యొక విధమున వైద్యశాస్త్రమునకు సంబంధించినదిగానే నాకు తోచినది.

## వృత్తికిని ఆరోగ్యమునకును సంబంధము

ఆర్యులు నిరాడంబరులై, ఆరోగ్యవర్ధకము లగు వ్యవసాయము, పశు పాలనము - వీనిచే దీర్ఘాయుష్మంతులై యుండిరి. ఆయుఃక్షీణతకు మనః క్లేశములు గలిగించు ఈకాలపు ప్రజలవృత్తులు, నడవడికలు ఎట్లు సహ కారము లగుచున్నవో పోల్చి చూచుకొనదగును.

ఆర్యులు కోరినది మంచివర్షములు, పుష్కలమైన పంటలు, సర్వ పావన మగు సూర్యకాంతి, ప్రాణప్రద మగు వాయువు, పెద్దపెద్దపొదుగు లతో బలిసిన ఆవులు, బలిష్ఠమై ఓజోవంతమగు శరీరము, ధనధాన్యసంపత్తి, ఇవియే. సంపత్తు ఆరోగ్యవర్ధకము, దారిద్ర్యము ఆరోగ్యనాశకము. ఇట్లే వేదములందు ఆరోగ్యశాస్త్రమునకు సంబంధించిన విషయములు అనేకములు గలవు.

## దైవప్రార్థనల ప్రయోజనము

"మమ్ము మా శత్రువులనుండి రక్షింపుడు" అనియు "మా కష్ట ములనుండి మమ్ము రక్షింపుడు" అనియు అనేకదేవతలకు మ్రొక్కు చుండుట చూడగలము.

సర్వసుఖములు గలిగి వైభవములలో పొర్లాడునపుడు దేవుడు కనపడక పోవచ్చును. కాని దుర్వారమైన కష్టములు వచ్చినప్పుడు, దేవుని ప్రార్థిం చుట అందరకును సహజము. ఈ మధ్య లండను నగరముమీద బాంబులు పడి, జర్మనుల దాడి బ్రిటిషు సామ్రాజ్యముపైని దుర్భరమైనప్పుడు, బ్రిటిష్ ప్రధానమంత్రియైన చర్చిల్‌గారు దేవుడు తమ పక్షమున నుండుటకై సామ్రాజ్యమునందంతట సమస్తమతములవారిని వారి వారి దేవాలయ

ములలో ప్రార్థనలు జరుపవలసిన దని కోరియుండిరి. ఆ కాలమునందు ఆర్యులు పవిత్రమైన మనస్సుతో, తమకు సహాయకారులగు సూర్య చంద్రాదులను సాత్త్వికముగా, కృతజ్ఞతాపూర్వకముగ గాని, ఏదైనను ఒక ఫలమును కోరిగాని పూజలు జరుపుటయందు ఏమాత్రము అనాగరికత లేదు. అనాగరకత లేకపోవుటయేగాక, మహోత్కృష్టమైన నాగరికతను సూచించుచున్నది. దేవతాపూజకూడ ఒక విధమైన వైద్యపద్ధతియే. భక్తి విశ్వాసములు అనునవి ఏ మందును చేయలేని పనులను ఒకానొకప్పుడు చేయును. ఈ విషయమై చికిత్సాభాగమున వివరింపబడును.

ఎన్ని పేర్లు పెట్టి ప్రార్థించినను పరమేశ్వరుడు ఒక్కడే యని ఆ కాలమునందే ఆర్యులు గ్రహించిరి.

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి"

ఆ మహాశక్తి ఒక్కటియే! విద్వాంసులు దానినే అనేకవిధముల వర్ణింతురు. దేవత యను శబ్దము "దివ్"అను ధాతువునుండి పుట్టినది. దేవశబ్దమునకు కాంతి (Bright or Shining) అని అర్థము. ఆర్యులు పూజించిన దేవతలు తేజోవంతమైన నైసర్గిక దృశ్యములు. ఈ భూమండలమునకు కాంతి నిచ్చు వాడు సూర్యుడు. సూర్యునికే ఆదిత్యుడనియు, గాయత్రి, సావిత్రి అనియు నామాంతరములు గలవు.

భూమికిని సూర్యునకును మధ్య నున్న లోకము అంతరిక్షలోకము. ఇందు మేఘమండల ముండును. దీనికి అధిపతి ఇంద్రుడు లేక వాయువు. భూలోకమునకు అధిపతి అగ్ని. స్వర్గలోకము, ద్యులోకము, భూలోకము అని మూడులోకములుగా వర్ణించినను, సృష్టి అంతయు ఒక్కటే. దీనికి బ్రహ్మాండమని పేరు. జీవరాశియొక్క ఉత్పత్తిక్షయనాశనములకు సూర్యరశ్మి ఎంత ఉపయోగకారియో ఆర్యులకు తెలిసినంత నవీన ప్రకృతిశాస్త్రజ్ఞులకు ఇంకా తెలియలేదని చెప్పవచ్చును.

## సూర్యుడు

భౌతికమగు సూర్యుని పరమాత్మయొక్క ప్రతిమగా సంకేతము నేర్పరచుకొని హిందూస్థానమున ఇప్పటికిని ఉపయోగములో నున్న దైనిక ప్రార్థనలో—అతి పవిత్రముగా నెంచబడు గాయత్రీమంత్రము.

ఋగ్వేదము 3-62-10 నందును, శుక్లయజుర్వేదము 4-35 నందును, సామవేదము 2-8-12 నందును గలదు.

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్॥

భూలోక, భువర్లోక, సువర్లోకములకు అధిపతియై శ్రేష్ఠమైన ఓ సూర్యుడా! మా యొక్క బుద్ధిని వికసింప జేయుదువు గాక.

ఇచట ఈ ఋషి సూర్యునియొక్క ప్రకాశమును, మానవుని యొక్కబుద్ధివికాసమును ఒకటే పదార్థమని ఊహించినట్లు ఈ మంత్రము నందు స్ఫురించుచున్నది.

ప్రపంచమునందలి సర్వశక్తులకును అనగా వేడిమి, వెలుతురు, విద్యుత్తు, యంత్రశక్తి, క్రియాశక్తి మొదలగు సర్వవిధములైన శక్తులును (All Kinds of Energy) సూర్యునినుండియే ఉత్పన్నమగుచున్నవని అంగీకరించియున్నారు. కాని ఆధ్యాత్మికమైన, లేక, బుద్ధిసంబంధమైన శక్తి కూడ సూర్యుని అనుగ్రహమువలననే మానవులకు ప్రాప్తమగుచున్నదని భౌతిక శాస్త్రవేత్తలు ఇంకను కనిపెట్టలేదు. సూర్యుని ప్రకాశమును, మానసిక ప్రకాశమును రెండును ఒకటియే యని హిందూ ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞుల అభిప్రాయము. కాబట్టి సూర్యుని శక్తిచే భౌతికవ్యాధులేగాక, ఆధ్యాత్మికవ్యాధులు కూడ నివారణ యగు నుద్దేశ్యము గాయత్రీమంత్రము నందు గలదు.

రజస్సత్త్వ తమోగుణములలో రజస్సు- ఎఱుపు; సత్త్వము- తెలుపు; తమస్సు - నలుపు. రజస్సు శక్తిమంతముగాన ఎరుపురంగు ఉద్రేకకరముగ ఎంచబడినది. రజోగుణ యుక్తమగు ఎరుపురంగు వలన, వాతము (క్రియా శక్తి) వృద్ధియగును. సత్త్వగుణ యుక్తమగు తెలుపు శాంతి నిచ్చును. తమోగుణ యుక్తమగు నలుపు లేక చీకటి శక్తిని తగ్గించును. ఇట్లు సూర్యకిరణములలోని రంగులు మానవతత్త్వముమీద ఏవో కొన్ని గుణములు కలుగ జేయునని వారు కనిపెట్టిరి.

"ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్" అని ఆరోగ్యమునకు గాని, అనారోగ్యమునకుగాని సర్వజీవరాసుల జ్ఞానాజ్ఞానములకు, ఉత్పత్తి, వృద్ధి, క్షయములకుగాని సూర్యుడే ఆధారము. ఇట్లే సూర్యుని అనేక విధముల ఆర్యులు ప్రార్థించుట విచిత్రము గాదు. సూర్యరశ్మిని చికిత్సలో ఆర్యులు ఎట్లు ఉపయోగించిరో దానిని గుఱించి మాత్రము కొంచెము చెప్పెదము.

## సూర్యరశ్మి - వెలుతురు చికిత్స

సూర్యునిగుఱించి అసంఖ్యాకము లగు సూక్తములు గలవు.

'యేనా పావక చక్షసా భురణ్యన్తం జనా అను
త్వం వరుణ పశ్యసి.''
—ఋగ్వేద. అను. 1, సూ. 7, మం. 6.

అర్థము:—అన్నిటినీ పవిత్రము చేయునట్టియు, వ్యాధులను నివారించునట్టియు ఓ సూర్యుడా ! జనులను ఏ ప్రకాశముతో రక్షించుచున్నావో దానిని స్తుతింతుము.

"ఉద్యన్నద్య మిత్రమహ (ః) ఆ రోహ న్నుత్తరాం దివమ్
హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ.
—ఋగ్వేద అను. 1, సూ. 7, మం. 11.

అందరకును అనుకూలమగు దీప్తి నిచ్చు సూర్యుడా! ఇపుడుదయించుచు ఎత్తైన అంతరిక్షమునం దెక్కుచు నీవు నా హృదయరోగమును బాపుము. కాంతిని తగ్గించునట్టియు (పాండువు) పచ్చని వర్ణము కలిగించునట్టియు (కామెల) మొదలగు రోగములను నశింపచేయుము.

ఈమంత్రములో హృద్రోగ మనగా మానసికసంబంధమైన దైన్యము. నాడీమండలమునకు సంబంధించిన బలహీనత [మానసికోత్సాహము, ప్రాణశక్తి (Vitality) సంపూర్ణముగ లేకుండుట] మొదలగునవి అన్నియు సూర్యకాంతిచే నివారణయగునని వారికి తెలిసినట్లు స్ఫురించుచున్నది. చీకటియు, అజ్ఞానమును వ్యాధికారకములు. వెలుతురును, జ్ఞానమును వ్యాధిహారములు.

సూర్యుడు జ్ఞానమును, వెలుతురును ఇచ్చువాడగుటచే శారీర, మానసిక వ్యాధులు రెండింటిని నివారించు శక్తిగలవాడు.

సూర్యకాంతిలో విటమిన్ డి. ఉన్నదనియు, సూర్యుని కిరణములు తాకినమాత్రముననే రక్తమునందలి దోషములు పోవుననియు ఇప్పుడు పాశ్చాత్యులుపపాదించు సిద్ధాంతము ఇక్కడ స్పష్టముగా కనబడుచున్నది. పాండువు, కామెల మొదలగు వ్యాధులకు సూర్యరశ్మిలోనుండి వివిధగుణములుగల కిరణములను విడదీసి చికిత్సచేయువారలు (Chromo Therapeutists) వేదములలోనే ఈ విషయమున్నదని తెలిసికొనిన ఆశ్చర్యపడక మానరు. శ్విత్రము (Leucoderma) నకు నీలి (Indigo) చికిత్సగా వేదములలో చెప్పబడియున్నది.

సూర్యకిరణమునందలి రంగు లేడును, ఏడు గుఱ్ఱములుగా వర్ణింపబడినవి. వేదములను చక్కగా తెలుసుకొనవలెననిన అందలి పదముల గూఢార్థము నెరుగవలెను.

## వేదములయందు జలచికిత్స
## (Hydropathy)

వేదమునందు జలచికిత్సకు ఆధారమంత్రములు అనేకములు గలవు.

అప్స్వ౨న్త రమృతమప్సు భేషజమపాముత ప్రశస్తయే
దేవా భవత వాజినః

ఉదకముల మధ్యను అమృత మున్నది. ఉదకములయందు భేషజమున్నది. మఱియు ఉదకముల ప్రాశస్త్యము తెలుసుకొనుటకు వేగిరపడుడు. (ఋగ్వేద అధ్యాయ. 1,అనువాక. 5, సూక్త 6, మంత్రం 19-23)

అప్సుమే సోమో అబ్రవీ దంతర్విశ్వాని భేషజా।
అగ్నించ విశ్వశంభువ మాపశ్చ విశ్వ భేషజీః

ఉదకముల మధ్యను సమస్త ఔషధములును గలవు. వాటియందు ప్రపంచమునకు సుఖకరుడగు అగ్నికలడని సోముడు నాకు చెప్పెను. ఉదకము సర్వమునకు ఔషధము.

ఇద మాపః ప్రవ హత యత్కించ దురితం మయి।
యద్వాహ మభి దుద్రోహ యద్వా శేప ఉతానృతమ్॥

ఓ ఉదకములారా! నాయందేదైన పాప మున్నను, లేక నే నెవ్వరి నైన ద్రోహము చేసినను, ఎవరినైనను తిట్టినను అబద్ధమాడినను ఆ పాపము నా నుండి మీరు కడిగివేయుదురుగాక! ఇట్లే ఈ అనువాకములో క్రింది మంత్రములలో ఉదకమున స్నానము చేసిన యెడల ఉత్సాహము, బలము గలుగునవియు, ఆయుర్దాయము వృద్ధి యగుననియు చెప్పబడియున్నది.

శం నో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే శం యో భిరస్రవన్తునః।

అర్థము:—దివ్యమైన ఈ జలములు మా అభీష్టము కొఱకును పానము కొఱకును శుభప్రదములగుచు గాక! మాకు అవి ఆరోగ్యమును సుఖమును సుస్రవించుగాక! ఈ మంత్రము అథర్వవేదము (1-6-1) లోను; ఋగ్వేదము (10-9-5) లోను శుక్ల యజుర్వేదము (1-2-1) లోను సామవేదము (1-33) లోను- ఇట్లు అన్ని వేదములలోను కనబడు చున్నది. జలము ఆరోగ్యమును సుఖమును ఇచ్చుటను గూర్చి ఎంత ముఖ్య ముగ ఆర్యులు తలంచిరో దీనినిబట్టి తెలియుచున్నది.

## అగ్ని చికిత్స

## (Thermal Treatment)

ఉదకమునందు అగ్ని యున్నదని చెప్పుట వేదములలో అనేకచోట్ల గలదు. అగ్ని నాలుగు విధములుగా నున్నదని చెప్పిరి.

1. సూర్యసంబంధమైన అగ్ని, 2. భూలోకము నందలి అగ్ని, (కఱ్ఱల రాపిడిచే పుట్టునది.) 3. ఆకాశమునందలి (అంతరిక్షమునందలి) అగ్ని. మేఘములందలి విద్యుచ్ఛక్తి. 4. నీటిలోనుండు అగ్ని. మహాసముద్ర మందుండు అగ్నికి బడబాగ్ని అని పేరు.

ఈ నాలుగు విధములగు అగ్నులకును మూలము ఒక్కటే, అన్నియు సూర్యుని నుండి ఉత్పత్తియైనవే.

ఋగ్వేద అ. 1, అ. 11, సూక్త. 2, మంత్ర. 1.

ఇతరాగ్ను లన్నియు దీని శాఖలే. చక్రమునందు ఇరుసువలెనే- శరీర పోషణమునందు ముఖ్యమైన అగ్ని (జఠరాగ్ని) జఠరమునం దుండు అగ్ని మానవు డనుగృహమునకు స్తంభము వంటిది. అందుకనియే చరక మహర్షి "ఆయు ర్వర్ణో బలం స్వాస్థ్యం ఉత్సాహోపచయౌ ప్రభా ఓజ స్తేజోఽగ్నయః ప్రాణా శ్చోక్తాః దేహాగ్ని హేతుకాః" అని తెలిపి యున్నాడు. అందుచే అగ్నిని కాపాడవలయును. అన్నము జఠరాగ్నిని పెంచును గావున- అన్నము అగ్నికి పోషకుడగు తండ్రి. అగ్ని సర్వపావకుడు (Purifier) అనియు, వ్యాధి పుట్టించు సూక్ష్మజీవులను నశింపజేయువనియు (Disinfectant) అనేక విధముల అగ్నిని స్తుతించి యున్నారు. ఇట్లు సృష్టియందలి అగ్ని, వెలుతురు, సూర్యుడు అను శక్తులు అహారమును ఉత్పత్తి చేయునవిగను, ఆరోగ్యమును సంపదను ఇచ్చునవిగను ఋగ్వేదము అనువాకము 15, సూక్తము 1-6 లన్నియు ఈ విషయమునే బోధించుచున్నవి.

## శస్త్ర చికిత్స (Surgery)

వేదములను బట్టి అప్పటి వైద్యులకు శారీరశాస్త్రజ్ఞానమును, శల్యతంత్ర (Surgery) జ్ఞానమును ఉండెనని ఈక్రింది సూక్తములవలన తెలియుచున్నది. యజ్ఞయాగాదులలో జంతువులను ముక్కలు ముక్కలుగా కోసి అగ్నిలో హోమము చేయవలసి వచ్చుటచే శరీరమునందలి వివిధభాగములు అప్పటివారికి తెలిసియుండుట ఆశ్చర్యము కాదు. మరియు, అథర్వవేదపు పదియవ మండలమునందు వర్ణింపబడిన పురుషశరీరమునుండి ప్రాచీనార్యులకు గల అస్థిపంజరజ్ఞానము విశదము కాగలదు.

అశ్వినీదేవతలు దేవవైద్యులుగా అనేకశస్త్రకర్మలు చేసినట్లును, గ్రుడ్డివాండ్రకు కండ్ల నిచ్చినట్లును (ఋ. 116-16) కుంటివాండ్రకు కాళ్ళు ఇచ్చినట్లును గలదు. (ఋ. 1-112-8) ఖేలుడను రాజుభార్య యగు విశ్పల అను నామె, తన భర్తతో కూడ యుద్ధమునకు పోగా, ఆమె కాలు పక్షి రెక్క తెగగొట్టబడినట్లు తెగగొట్టబడెననియు, అశ్వినీ దేవతలు ఇనుముతో చేయబడిన పాదమును సంధించినట్లును (1-116-15) తెలియగలదు. అథర్వవేదమునందు సినీవాలి, సరస్వతి మొదలగు మంత్రస్థానుల పేర్లు గలవు.

ఇట్లు అనేకచోట్ల ఉత్కృష్టమైన శస్త్రకర్మలు గలవు. వీని వివరము లను ఆ యా శీర్షికలలో చూడనగును.

## వేదములలోని వ్యాధులు

మొత్తముమీద ఆయుర్వేదము వేదములలోనుండి వేరుపడిన ఒక ఉపవేదముగా నుండెను.

అన్ని వేదములందును, అందు ముఖ్యముగా అథర్వ వేదమునందును విషమజ్వరము (మలేరియా - చలిజ్వరము) కామిలా, గండమాల, కాసము, రాజయక్ష్మ, కండ్లకలక, ఇంద్రలుప్తము (తలవెంట్రుకలు రాలిపోవుట) కుష్ఠము మొదలగువ్యాధుల వర్ణనలును, చికిత్సలును పాముకాటు మొదలగు విషజంతువుల కాటులకు చికిత్సలును వివరింపబడియున్నవి. ఇటులనే, ద్రవ్య గుణశాస్త్ర విషయములును పెక్కులు వివరింప బడియున్నవి.

వేదములందు ఈ వ్యాధులనుగూర్చిన వివరములను ఆయా శీర్షికల క్రింద చికిత్సాస్థానమున చూడనగును.

## త్రి ధా తు వు లు

ఋగ్వేదమునందు త్రిధాతువులను గూర్చి 1 - 7 - 4 - 6 వ మంత్రమునందు కనబడుచున్నది.

"త్రిర్నో అశ్వినా దివ్యాని భేషజా త్రిః పార్థివాని త్రిరుదత్తమద్భ్యః
ఓమానంశంయోర్మమకాయసూనవే త్రిధాతుశర్మవహతం
శుభస్పతీ."

ఈ వేదములకు వ్యాఖ్యానములు రచించిన శ్రీ సాయనాచార్యుల వారు త్రిధాతు అనగా వాత, పిత్త, శ్లేష్మము లనియు, వీని సామ్యావస్థ శర్మ అనగా సుఖ మనియు, పృథివ్యాది పంచభూతయుక్తమగు ఆహారము లను ఔషధములను త్రిదోషప్రకోప ముపశమించునట్లుగా ఉపయోగించు టచే ఆరోగ్యము సమకూరు ననియు వ్రాసిరి.

ఈ మంత్రమును, ఈ సూక్తములోని 12 మంత్రములును అశ్వినీ దేవతలను స్తుతించునవిగా నున్నవి.

## అశ్వినీ దేవతలు

అశ్వినీదేవతలు దేవవైద్యులు. వీరి రథమునకు మూడుచక్రములు. వీరు రథముమీద పట్టుకొనుటకు మూడు స్తంభములు కలవు. మూడుసార్లు రాత్రి యందును, మూడుసార్లు పగటియందును వీరు తిరుగుచుందురు. ఇట్లు ఈ అనువాకమునందు చరకసూత్రస్థానమందుగల "త్రిస్రైషణీయము" అను అధ్యాయమునందు (11 వ అధ్యాయము) వలెనే మూడు; మూడు సంఖ్యగల వాటి నన్నింటిని ఒక్కచోటుకు ప్రోగుచేసినట్లుగా, మూడు చక్రముల బండి మీద, మూడు మారులు వచ్చి, మూడు కర్మలను నేర్పి, మూడు మారులు మేఘము ఉదకము ఇచ్చినట్లు కర్మఫలముగా అన్నమును, సౌభాగ్యమును, బుద్ధులను ఈ మూడు వస్తువులను మూడు సారులు ఇవ్వమని అశ్వినీదేవతలకు స్తుతివాక్యములు కలవు. ఆసందర్భమున త్రిధాతువులనుగూర్చిన పైమంత్రము చెప్పబడినది. దీని అర్థ మిట్లు గలదు:

ఓ అశ్వినులారా! దివ్యమైన ఔషధములను, పృథ్వియందు పుట్టిన ఔషధములను, ఆకాశమునందు పుట్టిన ఔషధములను ఈ మూడు విధము లైన ఔషధములను, మీరు ఇంతకుముందు బృహస్పతికుమారుడైన "శం" అనువాని కిచ్చి సుఖమును కలిగించిన ఆ సుఖమును నా కుమారున కిండు. సుఖప్రదమైన ఔషధములకు అధికారులగు అశ్వినీదేవతలారా! వాత, పిత్త, కఫములు అను మూడు ధాతువులయొక్క సామ్యమును సుఖమును ప్రసాదింపుడు."

దీనినిబట్టి చూడగా చరకుడు వైదికసాంప్రదాయమును ఎంతవఱకు అనుకరించినది తెలియగలదు.

## వైద్యులు

వేదములు గాక ఆనాటికే అనేక ఇతర వైద్యగ్రంథములు ప్రచార ములో నుండి పైన ఉదహరించిన వ్యాధులయొక్క ఉత్పత్తి లక్షణములు, చికిత్సను తెలియజేయు ఇతరగ్రంథములు లేనియెడల ఇంత విపులమైన జ్ఞానము లభించుట దుర్లభము. సందర్భానుసారముగా వేదములలో వైద్యక విషయములను గూర్చి ప్రసంగింపబడి యుండవచ్చును గాని ప్రత్యేక గ్రంథములు అప్పటికే యుండి యుండవలెను. [డబ్బు పుచ్చుకొని వైద్యము చేయుచు, వైద్యవృత్తిచేతనే జీవించువారలు ఆ కాలమున నుండి రని నిశ్చయముగ తెలియుచున్నది. (ఋగ్వేద 10-112-1)]

రుద్రుడు తనతోగూడ మందులను తీసికొని పోవుచుండెననియు అతడు వైద్యులకు వైద్యుడనియు అనేకచోట్ల గలదు. (ఋగ్వే 2-33-7-12; 5-42-11; 7-46-3; 1-114-5).

ఓ వైద్యుడా! నీకు ఒక గుఱ్ఱమును, ఒక ఆవును, దుస్తులను ఇవియే గాక, నా సర్వస్వమును నీ కిచ్చెదను అని కలదు. (ఋగ్వే 10-97-4)

అప్పటి వైద్యగ్రంథము లన్నియు ఇప్పుడు నశించిపోయి యుండ వచ్చును.

ప్రజలచే అతిపవిత్రముగా నెంచబడుటచే, ఎన్ని కష్టములనో దాటి ఒక అక్షరముకూడ పోకుండ వేదములుమాత్రము నిలిచియున్నవి. మొన్న మొన్నటిదగు బైబిలునుగూర్చి అతిపురాతనగ్రంథ మనియు, దానిని మించిన గ్రంథము ఈ లోకమున లేదనియు క్రైస్తవులు పొగడుకొనుచుండ — 50,000 సంవత్సరముల పూర్వకాలపునవగు వేదములను కాపాడుటయందు హిందువులకు గల పట్టుదలను పొగడుటకు వేయి నోరులైనను చాలవు. భూలోకమునందు ప్రప్రథమమగు అక్షరము కాని, శబ్దము కాని, భాషగాని, కవిత్వముగాని, సాహిత్యముగాని వేదములే. ఇట్టి వేదములు హిందువులకే గాక సర్వమానవజాతులవారికిని గౌరవింపదగిన వని చరిత్రయందు ఏ మాత్రము అభిమానముగలవారైనను ఒప్పుకొనక మానరు.

## గూఢార్థములు, కవిత్వము

ఇప్పటికిని వేదములు మనకు సరిగా అర్థము కాలేదు. ఒక్కొక మాట అనేకగూఢార్థములలో ఉపయోగింపబడియున్నది. గోవు లనగా మేఘములు, సూర్యుడు. సూర్యకిరణములు గుఱ్ఱములుగా వర్ణింపబడియున్నవి. ఆవు పొదుగు అనినకూడ మేఘమే. పాలు అనగా వర్ష ధారలు. గుఱ్ఱములు నీటిని త్రాగుచున్న వనగా నీరు ఆవిరి రూపముగా అగుచున్నదని అర్థము.

సూర్యకిరణములు, అగ్ని ఈ రెండు పదములుకూడ మేఘ మనెడి అర్థములో నుపయోగింపబడినవి. సూర్యకిరణములచేతను, అగ్నిచేతను, నీరు ఆవిరిరూప మయి ఆ ఆవిరియే ఆకాశమున మేఘము లయి, ఆ మేఘములే తిరిగి నీరయి, వర్షమయి, భూమిమీద పడి సస్యమయి, ప్రాణుల కాహార మయి, జఠరాగ్నియయి, ఆహారమును తిరిగి దహించునదయి అనేక రూపాం

తరముల జెందుచున్నను ఇంచుకైనను నాశనములేని సూర్యుని శక్తి (Solar Energy) ఇన్ని విధములుగా మారుచుండు ననియే ఋషుల అభిప్రాయము.

ఒకే శక్తి అనేకరూపాంతరముల జెందుచుండుటచే ఋషులు తమ కవిత్వమునకు అనుకూల మగునట్లు ఆయా పదములను తమ ఇచ్చవచ్చినట్లు ఉపయోగించుచు వచ్చిరి. కొన్ని సందర్భములందు ముఖ్యముగా ఉషః కాల మను కన్యను వర్ణించుటయందు ఈ కవుల పోకడలు నిరుపమానమై మనోరంజకముగా నున్నవి. ఉషోదేవిని ఒకచోట సూర్యుని భార్యగాను, మఱియొకచోట సూర్యుని తల్లిగాను, ఇంకొకచోట కన్యగాను ఇట్లు అనేక విధముల వర్ణించియున్నారు. వర్ణనలు అట్లు చేసిరేగాని ఉష నిజముగా స్త్రీ కాదని ఎవరికి తెలియదు? ఇప్పటికిని ఈ ఘట్టమునందలి కవిత్వమునకు తుల్యమైన కవిత్వము లేదని తద్‌జ్ఞుల అభిప్రాయము.

## కర్మజ్ఞాన మార్గములు

ఋగ్వేదమునందు రెండు కథలు తఱచుగా కనబడుచుండును.

(1) వృత్రుడు నీటిప్రవాహమునకు అడ్డము వచ్చుట - ఇంద్రుడు వృత్రుని చంపి నీటిని ప్రవహింపజేయుట.

(2) బలుడను వాడు ఆవులను కొండవెనుక దాచివేయుట-బృహస్పతి వాటిని తిరిగి సంపాదించుట- ఆవు లనగా ఇచ్చట జ్ఞానము.

మొదటి కథయందలి గూఢార్థము కర్మమార్గమును సూచించును. యజ్ఞముచే దేవతలు ప్రీతి నొంది మనము కోరిన వరము లిత్తురు. రెండవది జ్ఞానమార్గమును సూచించును. స్తుతికీర్తనములవలన దేవతలు తృప్తులై భగవంతుని తెలిసికొనుటకు తగిన జ్ఞానము నిత్తురు. కర్మ వృషభమునకును, జ్ఞానము గుఱ్ఱమునకును తఱచు పోల్చబడుచుండును. సంహితాభాగములలో కర్మమార్గమును, ఉపనిషద్భాగములలో జ్ఞానమార్గమును ఎక్కువగా కనబడుచుండును.

## ఆయుర్వేదమునకు వేదములు మూలాధారములు

ఇంతకును ఆయుర్వేదమునకు మూలాధారము వేదములలో నున్నది. వైద్య విద్యార్థులును, పరిశోధకులును ఎక్కువ శ్రద్ధతో ఈ వేదములను పఠించి, చర్చించి, తఱచిన కొలదిని ఇంకను నవీనసిద్ధాంతములకు ఆధార

భూతములగు సూత్రములను కనిపెట్టుటకు చాల అవకాశము లున్నవని తెలుపుటకయి మేము ఇంతగా వ్రాసియున్నాము. ఋగ్వేదమునందు 1,53,826 పదములును 4,32,000 అక్షరములును కలవు. ఈ ప్రకారము, ఒక్కొక్క వేదమునందు ఉన్న అక్షరములను, స్వరములను కూడ లెక్క పెట్టి ఏ కాలమునకును ఒక్క స్వరమైనను మారి పోకుండునట్లు మన పూర్వులు స్థిరపరచి యున్నందులకు మన మెంతయు గర్వపడుచు, ఈ శాస్త్రము నభివృద్ధి జేయుభారము మనమీద నున్న దని గ్రహింపవలసి యున్నది.

## ఉపనిషత్తులు

ఒక్కొక వేదమునకు సంబంధించి మంత్రము లనియు, బ్రాహ్మణము లనియు, ఉపనిషత్తు లనియు మూడుభాగము లుండును.

మంత్రములే సంహితలు. వీనియందు ప్రార్థన లుండును.

బ్రాహ్మణములందు యజ్ఞయాగాదికర్మలు చేయుపద్ధతులు వివరింప బడును.

ఉపనిషత్తులందు సృష్టితత్త్వమునుగూర్చి వివిధములగు చర్చలుండును. ఇందు కొన్ని అరణ్యములలో ఋషులకు స్ఫురించుటచే అరణ్యక భాగము లైన వని చెప్పుదురు. అందు ముఖ్యమైనవి 108 ఉపనిషత్తులు.

1. దశోపనిషత్తులు - సంఖ్య 10 :—(1) ఈశ, (2) కేన (3) కఠ, (4) ప్రశ్న, (5) ముండక, (6) మాండూక్య, (7) తైత్తిరీయ, (8) ఐతరేయ, (9) ఛాందోగ్య, (10) బృహదారణ్యకము లను ఉపనిషత్తులు.

2. యోగోపనిషత్తులు - సంఖ్య 20:—(1) అద్వయతారక, (2) అమృతనాద, (3) అమృతబిందు, (4) క్షురిక, (5) తేజోబిందు, (6) త్రిశిఖ బ్రాహ్మణ. (7) దర్శన, (8) ధ్యానబిందు, (9) నాదబిందు, (10) పాశుపత బ్రహ్మ, (11) బ్రహ్మవిద్య, (12) మండలబ్రాహ్మణ, (13) మహావాక్య, (14) యోగకుండలి (15) యోగచూడామణి, (16) యోగతత్త్వ, (17) యోగశిఖ, (18) వరాహ, (10) శాండిల్య, (20) హంసోపనిషత్తులు.

3. సామాన్య వేదాంతోపనిషత్తులు - సంఖ్య 24:— (1) అక్షి, (2) అధ్యాత్మ, (3) అన్నపూర్ణ, (4) ఆత్మ. (5) ఆత్మ

బోధ, (6) ఏకాక్షర, (7) కౌషీతకీబ్రాహ్మణ, (8) గర్భ, (9) నిరాలంబ, (10) పైంగల, (11) ప్రాణాగ్నిహోత్ర, (13) మహ, (14) ముక్తిక, (15) ముద్గల, (16) మైత్రాయణి, (17) వజ్రసూచిక, (18) శారీరక, (19) శుకరహస్య, (20) సర్వసార, (21) సావిత్రి, (22) సుబాల, (23) సూర్య, (24) స్కందోపనిషత్తులు.

4. సన్యాసోపనిషత్తులు-సంఖ్య 17:—(1) ఆరుణి, (2) అవధూత, (3) కఠరుద్ర, (4) కుండిక, (5) జాబాల, (6) తురీయాతీతావధూత, (7) నారద పరివ్రాజక, (8) నిర్వాణ, (9) పరబ్రహ్మ, (10) పరమహంస పరివ్రాజక, (11) పరమహంస, (12) బ్రహ్మ, (13) భిక్షుక, (14) మైత్రేయి. (15) యాజ్ఞవల్క్య, (16) శాట్యాయనీయ, (17) సన్యాస ఉపనిషత్తులు.

5. శైవోపనిషత్తులు - సంఖ్య 15:—(1) అక్షమాలిక, (2) అథర్వశిరస్, (3) అథర్వశిఖ, (4) కాలాగ్ని రుద్ర, (5) కైవల్య, (6) గణపతి, (7) జాబాలి, (8) దక్షిణామూర్తి, (9) పంచబ్రహ్మ, (10) బృహజ్జాబాల, (11) భస్మజాబాల, (12) రుద్రహృదయ, (13) రుద్రాక్షజాబాల (14) శరభ, (15) శ్వేతాశ్వతర ఉపనిషత్తులు.

6. వైష్ణవోపనిషత్తులు - సంఖ్య 14:—(1) అవ్యక్త, (2) కలిసంతారణ, (3) కృష్ణ, (4) గరుడ, (5) గోపాలతాపిని, (6) తారసార, (7) త్రిపాద్విభూతి మహానారాయణ, (8) దత్తాత్రేయ, (9) నారాయణ, (10) నృసింహతాపిని, (11) రామతాపిని, (12) రామరహస్య, (13) వాసుదేవ, (14) హయగ్రీవ ఉపనిషత్తులు.

7. శాక్తోపనిషత్తులు - సంఖ్య 8:—(1) త్రిపుర, (2) త్రిపుర తాపిని, (3) దేవి, (4) బహ్వృచ, (5) భావన, (6) సరస్వతీరహస్య, (7) సీతా, (8) సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తులు.

మొత్తము ఉపనిషత్తులు 108. ఇందు చాలాభాగము బౌద్ధయుగమునకు పూర్వమే రచింపబడినవి. వీనిలో దశోపనిషత్తులకును, నరసింహపూర్వతాపిని అను ఉపనిషత్తునకును శ్రీ శంకరాచార్యులవారు వ్యాఖ్యానము చేసిరి.

ఈ ఉపనిషత్తులందు చాలాభాగము అనేకరీతుల మనకు గోచరించు సృష్టియంతయు ఒకేపదార్థమునుండి కలిగెననియు, దానికి బ్రహ్మమని పేరనియు, అట్టి బ్రహ్మమునుండి ఆకాశము, వాయువు(గాలి), తేజస్సు(అగ్ని), అప్పు (జలము), పృథ్వి (భూమి) యను పంచభూతములును, వాటినుండి సమస్త సజీవ, నిర్జీవకోటియు నుత్పన్నమైన వని బోధించును. వేదములందలి వాయువు, సూర్యుడు, చంద్రుడు అను ఈమూటి సాదృశ్యమున ఆయుర్వేదమునందు క్రమముగా వాత, పిత్త, కఫములు నిరూపింపబడినవి.

## ప్రస్థానత్రయము

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత ఈమూడును ప్రస్థానత్రయ మనబడును. ఇవి వైదికమతమునకు మూడు స్తంభముల వలె నేర్పడి ఇప్పటికిని ఎన్నితరములు గతించినను హిందూధర్మమునకు మూలాధారములై వర్ధిల్లుచున్నవి. అందు భగవద్గీత ఖండాంతరములయందు వ్యాపించిన గ్రంథములలో ఉత్తమమైనది. ఆత్మతత్త్వమును బోధించు గ్రంథము, ఇంత మధురమైనది, ఇంత సులభమైనది, ఇంత శాస్త్రీయమైనది, ప్రపంచమునందలి ఏ భాషయందును లేదని చెప్పవచ్చును. ప్రతి అధ్యాయాంతమున భగవద్గీత యొక ఉపనిషత్తు అని వ్రాయబడి యున్నది. ఇందు మానవశరీరము యొక్కయు, ఈ సృష్టియొక్కయు వివరము లన్నియు చక్కగా పోల్చి వర్ణింపబడినవి. ఆయుర్వేదము కూడ ఈ భగవద్గీతయందలి ప్రవృత్తి, నివృత్తి మార్గములను వివరించి ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములను సంపాదించు పద్ధతులను బోధించుచున్నది.

## జీవాత్మ, పరమాత్మలు

భారతీయ నాగరికత యొక్క సారము ఉపనిషత్తులందును, ఆ ఉపనిషత్తుల సారము భగవద్గీతయందును గలదు. ఈ యుపనిషత్తులందు పరమాత్మ, జీవాత్మ, ప్రకృతి ఈ మూడు తత్త్వముల సంబంధమును గూర్చి ఋషులనేకులు, వివిధరీతుల తమ స్వానుభవములను తెలిపిరి. రామానుజాది వ్యాఖ్యాతలు గూడ తమ మార్గమునకు తగినట్లుగా వ్యాఖ్యానములుచేసి యున్నారు. కాని, మొత్తముమీద "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మను. (బృ.ఉ. 1-4-10) "తత్త్వమసి" నీవే అది (ఛాం. ఉ 6-8-7) "అయమాత్మా బ్రహ్మ" ఈఆత్మయే బ్రహ్మము (మాండూ ఉ. 2.) "సర్వం

ఖల్విదం బ్రహ్మ" ఇది అంతయు నిజముగా బ్రహ్మమే (ఛాం.ఉ. 3-14-1) ఇట్టి వాక్యములను బట్టి అద్వైతసిద్ధాంతమునే ఉపనిషత్తులు ఎక్కువగా బోధించుచున్నట్లు కనబడుచున్నది. ఉపనిషత్తుల యందలి బ్రహ్మము సగుణుడును, నిర్గుణుడును అని గూడ చెప్పవచ్చును. ఇతడే సృష్టి కర్త. మంచి పనులను చేసిన వారిని మెచ్చి వారికి సంపత్తును మోక్షమును ఇచ్చును. చెడ్డపనులను చేసినవారిని శిక్షించును. నిర్గుణ బ్రహ్మము, "ఇది కాదు" "అది కాదు"అను వ్యతిరేక వర్ణనల చేతనే తెలుసుకొన దగినవాడు. వర్ణనాతీతుడు. (బృ.ఉ. 3-8-8) *జీవాత్మయు, పరమాత్మయు ఒక్కటే. ఉపాధిభేదముచే వీనికి భేద మున్నట్లు గనబడవచ్చును గాని నిజముగా భేదము లేదు. రెండు చక్కని పక్షులు (ఒకటి జీవాత్మ, మరొకటి పరమాత్మ) ఎల్లప్పుడును ఒకదానితో నొకటి ఎడబాయక ఒకే పేరు గలిగి, ఒకే అశ్వత్థవృక్షమును (శరీరమును) ఆశ్రయించి యుండును. అందొకటి (జీవాత్మ) పండును తియ్యతియ్యగా తినుచుండును. (పండ్లు తినును. అనగా పూర్వకర్మలయొక్క ఫలితములను అనుభవించుచుండును.) కాని మఱియొక పక్షి (పరమాత్మ) ఏమియు తినక ఊరికే సాక్షిగ చూచుచుండును. ఇదే చెట్టులో నివసించుచు, ఆ శరీరమే తా ననుకొనుచు జీవాత్మ ఏమియు చేయు శక్తిలేక కష్టపడుచుండును. కాన పరమాత్మయొక్క నిజ స్వరూపమును తెలుసుకొనునప్పుడు సర్వక్లేశములు పోయి శాంతి నొందును.

ఈ మంత్రములకు అద్వైతులు, ద్వైతులు కూడా తమ తమ సిద్ధాంతములకు అనుకూలించునట్లు అర్థము చెప్పుకొనెదరు.

సత్యమును తెలుసుకొన్నప్పుడు కట్టు కథ విడిపోయినట్లు భావము తేటతెల్లమగును. మట్టి ఎలుక, మట్టి ఏనుగు ఈరెండును మనము వేరు వేరు పదార్థము లని తలచినప్పుడు అవి వేరు పదార్థములే! ఈరెంటెని నీళ్లలో కలిపి వేసినప్పుడు అవి రెండును ఒకశే మట్టియై ఏకపదార్థ మని తెలియును. ఇట్లే జీవాత్మ, పరమాత్మలు ఒకటి ఐనను, ఉపాధిభేదముచేత విభేదముగా నుండినట్లు తెలియును. అజ్ఞానము అను తమస్సే విభేదబుద్ధికి కారణము. అది పోయినప్పుడు నిజము తెలియును. ఈ వివరములు ఇంకను దర్శనములలో చూడనగును.

---

* (ముండక.ఉ. 3 - 1 - 1 - 2 శ్వేతాశ్వతర.ఉ. 4, 6, 7.)

చీకటిలో నున్న వానికి ఏమియు తెలియనట్లే అజ్ఞానికి సమస్తమును అగాధముగా నుండును. ఉపనిషత్తులు అను దీపమును చేతబట్టుకొన్న వానికి ఏవిధమైన అటంకములును మార్గమందు లేక జీవయాత్ర యను ప్రయాణము నందు శాంతియు సౌఖ్యమును చేకూరును. అందుచేతనే ఈ ఉపనిషత్తులను ప్రపంచమునందలి అన్నిఖండముల వారును హెచ్చుగా పొగడుచున్నారు.

## స్మృతులు, పురాణములు

వేదముల తరువాత స్మృతులయొక్క అధికారము చెల్లును. స్మృతి అనగా జ్ఞప్తికి తెచ్చుకొనుట. వేదములయొక్క గ్రంథకర్తలు మనకు తెలియరు. కాని స్మృతులకు గ్రంథకర్తల నామములు గలవు. అందు ముఖ్యముగా మనుస్మృతి హిందూ ధర్మములను గూర్చి చక్కగా శాసించి యున్నది. స్మృతుల యొక్కయు, పురాణముల యొక్కయు వివరములు 2 వ అధ్యాయమునందు పౌరాణిక యుగములో చూడనగును.

## ఇతిహాసములు

ఇతిహాసము లనగా చరిత్రములు. వానిలో శ్రీమద్రామాయణము, మహాభారతము ముఖ్యమైనవి. ఈ రెండు గ్రంథములలోను నిజమైన చరిత్ర భాగము లెంత ఉండినను ఈ రెంటివలనను హిందూస్థానమునందు కలిగిన విజ్ఞానము ఇంతింత అని చెప్పరానిది. ఇందులో లేని చరిత్ర, విజ్ఞానము, తత్త్వజ్ఞానము, నీతి, రాజ్యాంగము, ఇంక వేరెందును గానరావు.

## రామాయణము

రామాయణము నుండి హిందూదేశము యొక్కయు, పరదేశముల యొక్కయు అప్పటి భూగోళజ్ఞానము తెలియగలదు. దశరథుని రాజ్య వైభవము, అతని సైనిక బలము, అతని రాజ్యమునందు రాచకార్యములలో ప్రజలకు గలిగిన హక్కులు, విద్యయొక్క ఉద్దేశము, వ్యాపనము, ధర్మ పరిపాలనము మొదలగు విషయము లనేకములు రామాయణము నుండి గ్రహింపగలము. భౌతికసుఖము లెన్నియున్నను, అవి ఆధ్యాత్మిక సుఖముకంటె హీన మని ఋజువుచేయుటకై దృష్టాంతములుగా వర్ణింపబడిన రాముడుచేసిన వనవాసము, అతడు పడిన కష్టములు, రావణ సంహారము,

రాజసముపై సాత్త్విక గుణమునకు గలుగు జయమును నిరూపించును. సత్యమునకే జయమని రామాయణమునుండి మనము నేర్చుకొను ముఖ్యమగు నీతి. అందుచేతనే రాముడే దైవమని లోకమునందు అతనిని పూజించుచున్నారు. అప్పటినుండి ఇప్పటివఱకు ఎందరో కవులు అనేకవిధముల సత్యముయొక్క అవతారపురుషుడని అతనిని గూర్చి కీర్తనలు పాడుచున్నారు. ఎందరో చిత్రకారులు అతని విలాసముల రచియించుచున్నారు. ఎందరో శిల్పులు అతని రూపమును చిత్రించుచున్నారు. ఇంతకంటె హెచ్చు గౌరవమును ఏ రాజులు పొందియున్నారు? ఇప్పటికిని ప్రజలు తమపిల్లలతో, ఆడువాండ్రతో కూడి అతని కథలు వినుచు అత్యాసక్తితో గుంపులుగా కూడి తమ విరామకాలములను గడుపుచున్నారు గదా!

## మహాభారతము

ప్రపంచమునందలి పురాతన గ్రంథములలో మిక్కిలి పెద్దది మహాభారతము. ఇందు లక్ష శ్లోకములు గలవు. క్రీస్తు పూర్వము 500 సంవత్సరములకు పూర్వమే మహాభారతము ఎక్కువగా ప్రచారములో నున్నట్లు కనబడుచున్నది. అప్పటికే అనేక వైయాకరణులు, భాగవతులు, రాజకీయవేత్తలు, కవులు, నాటకరచయితలు మహాభారతము నందలి మహాపురుషులను గూర్చి వివరించిరి. క్రీస్తుపూర్వము రెండవశతాబ్దములో గ్రీకురాయబారులు, మహాభారతములోని నీతులను తమగ్రంథములలో కీర్తించిరి. ఎక్కడో ఆసియాఖండమున తూర్పుననుండు కంబోడియా రాజ్యములో క్రీస్తుశకము ఆరవశతాబ్దములో దేవాలయములలో ఈ కావ్యమంతయు పఠించుచుండిరి. ఏడవశతాబ్దమునందు మంగోలియాదేశములో తురుష్కులు హిడింబవధ మున్నగు కొన్ని ఉత్సాహపూరితములగు కథలను తమ స్వంత కథలుగా జేసుకొని ఆనందించుచుండిరి. జావాదేశమునందు పదవశతాబ్దమునకు పూర్వమే మహాభారతము వారి భాషలోనికి తర్జుమా చేసుకొని ఉండిరి. హిందూస్థానమునందలి ప్రజలయొక్క సాంఘిక, రాజకీయ రహస్యములన్నియు సంగ్రహించిపెట్టిన ఖజానావలె మహాభారతము వెలయుచున్నది.

యుధిష్ఠిరుని రాజ్యకాలమున సప్తఋషిమండలము మఘా నక్షత్రమునందు ఉన్నట్లును ఈ లెక్కనుబట్టి ఇప్పటికి (1942)4389 సంవత్సరములు గడచిన వని గణితశాస్త్రజ్ఞులు లెక్కించుచున్నారు.

భాగవత పురాణమునందును, విష్ణుపురాణమునందును లెక్కింప బడిన సూర్యచంద్రవంశపురాజులయొక్క రాజ్యకాలములనుబట్టిగూడ ఇది రమారమిగా సరిపోవుచున్నది. ఈ మహాభారత యుద్ధమునాటికి విశ్వామిత్రుని కుమారుడగు సుశ్రుతునిపేరు ప్రకటముగా తెలిసి యున్నది. *ఆయుర్వేదమనియు, అష్టాంగచికిత్స యనియు, కృష్ణాత్రేయ చికిత్స యనియు పేర్లు ఇందు గలవు. అప్పటికే కాయచికిత్సకులు, శస్త్రచికిత్సకులు, విషచికిత్సకులు మొదలగు వివిధచికిత్సాభాగములందు ప్రత్యేకముగ ప్రసిద్ధిజెందినవారలును, ధన్వంతరి సాంప్రదాయకులును, ఆత్రేయ సాంప్రదాయకులును వేరువేరుగా ఉండినట్లు మహాభారతమునుండి స్పష్టముగ తెలియుచున్నది.

## పంచతంత్రము

ఖండాంతరములయందు భారతీయ నాగరికతను వ్యాపింపజేసిన గ్రంథములలో రాజకీయముగ ప్రవృత్తిమార్గదర్శిని యగు పంచతంత్రమును, నివృత్తిమార్గమును బోధించు భగవద్గీతయు ముఖ్యమైనవి. పంచతంత్రమునకు నీతిచంద్రిక యనియు పేరుకలదు. పంచతంత్రమునందు కరటకదమనకులు అను రెండునక్కలద్వారా రాజనీతి అంతయు చర్చింపబడెను. జంతువులకు చమత్కారమగు పేర్లు పెట్టి సామ, దాన, భేద, దండము లను చతుర్విధోపాయములతో కార్యములను సాధించుమార్గములు ఇందు వివరింపబడియున్నవి.

## భగవద్గీత

రెండవగ్రంథమగు శ్రీ భగవద్గీత కురుక్షేత్రమున భారతయుద్ధము జరుగు సమయమున శ్రీకృష్ణుడు అర్జునునకు క్షత్రియధర్మమును బోధించు నుపదేశమును ముఖ్యసూత్రముగా గలిగియున్నదైనను-ప్రతిమానవుని మనస్సునందును అనుదినమును ధర్మాధర్మప్రవర్తనలవిషయమై జరుగు యుద్ధమును చర్చించును. భగవద్గీతయందు నిరూపించబడిన నీతిమార్గములు అన్ని జాతుల వారికి అన్ని కాలములయందు అన్వయించును. ప్రతిమానవుడును స్వాలాభా

* "ఆయుర్వేదవిద స్తస్మాత్ । త్రాతుం మాం ప్రచక్షతే."
(శాంతి. మోక్షే. 130)

"కచ్చి త్తే కుశలా వైద్యా । అష్టాంగేచ చికిత్సితే." (సభా. 35)
"దేవర్షి చరితం గార్గ్యః । కృష్ణాత్రేయ చికిత్సితం."(శాంతి.మోక్షే.138)

పేక్ష లేక తనధర్మమును తాను నిర్వర్తింపవలెనని భగవద్గీత బోధించుచున్నది. తాను చేయు కార్యముయొక్క ఫలమును తానే అనుభవించును గాబట్టి, స్వధర్మాచరణమే నిర్భయముగ చేయవలెననియు, దానియందే ముక్తి గలదనియు గీతయందలి రహస్యము. భగవంతునియందే భారము వైచి "తత్ సత్ బ్రహ్మార్పణ మస్తు" అని కార్యఫలమునంతయు భగవంతునికి ధారపోసి తాను తనకు విహితమైన కర్మలను చక్కగా చేయుచుండవలెను. ఇదియే యోగము. ("యోగః కర్మసు కౌశలం") భగవద్గీత అనుదినమును పఠింపవలసిన ఒక పాటవంటిది (గీత=పాట). దీనిని మూడుగంటలలో పూర్తి చేయవచ్చును. ఇందు అన్ని అంతస్థుల మానసిక వికాసము గలవారికిని ముక్తిమార్గముల బోధించు సూత్రములు గలవు. జ్ఞానులకు జ్ఞానమార్గము, యోగులకు యోగమార్గము, సామాన్యులకు భక్తిమార్గము, అందరకును కర్మమార్గము ఇందు గలవు. ఈ భగవద్గీత హిందూదేశపునాగరికత అను మహావృక్షముయొక్క పరిమళమును వెదజల్లు పుష్పము వంటిది. షడ్రసోపేతమగు ఫలము వంటిది. పాశ్చాత్యులు పశుబలముచే ప్రాచ్యదేశీయుల రాష్ట్రమును గైకొని వారి సంపత్తులను నేడు స్వాధీనపరచుకొనియున్నను, భారతీయులు మానసికబలముచే ఖండాంతరవాసులను జయించి ఇప్పటికిని నైతిక, సాంఘిక, దైవిక మార్గములయందు సామ్రాజ్యమును ఏలుచున్నారు. ఒక్క గాంధీ మహాత్ముడు ప్రపంచమున కంతకును ఇప్పుడు నాయకుడై వెలుగుచున్నాడనగా అది శ్రీ భగవద్గీతాఫలమే.

ఆయుర్వేదము కూడ ఈ భగవద్గీతనే అనుసరించి రాగద్వేషములు వదలి నిస్సంగముగ మనోవాక్కాయకర్మ శుచి గలిగి జ్ఞానవంతు డగుటయే జీవన్ముక్తి యను అద్వైతసిద్ధాంతమును బోధించును.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" (భ.గీ. అ. 6.)

భగవద్గీతయందలి ఈ శ్లోకమునందు గల విషయమే.—

"లోకే వితత మాత్మానం లోకం చాత్మని పశ్యతః
పరాపరదృశః శాంతిః జ్ఞానమూలా న నశ్యతి." (చరక. శా. అ. 5.)

సర్వ ప్రపంచములయందును తాను వ్యాపించియుండు నట్లును, ప్రపంచమంతయు తన యందున్నట్లును, ఆత్మను అనాత్మను చక్కగ

తెలుసుకొనిన వారికి సత్యమూలక మగు శాంతి కుదురును. ఆ శాంతి యొకప్పుడును నశించదు. ఇట్టి శాంతి లభించిన వారికి తామరాకుపై నీటివలె లోకసంబంధ మున్నను సుఖదుఃఖములు వారిని అంటవు అనునదియే ఆయుర్వేదముయొక్క సారాంశము.

## కావ్యములు

సంస్కృతవాఙ్మయమునందు పుట్టిన కావ్యములు అన్నియు సామాన్యముగా రామాయణము, మహాభారతము నందలి కథలను సంబంధించి యున్నను, కావ్యములయొక్క విజ్ఞానమే వేరొక రీతిగ నుండును. ఈ సారస్వతము అగాధమైనది. దీనినిగూర్చి కొద్దిస్థలములో వ్రాయుటకు ప్రయత్నించుట సాహసము. ఐనను ఈ శీర్షిక క్రింద కొంత వ్రాయుట తప్పక మేము ఇందులకు ప్రయత్నించుచున్నాము.

## శాకుంతలము

"కావ్యేషు నాటకం రమ్యం । నాటకేషు శకుంతలా"

ప్రపంచమునందలి ఉత్తమోత్తమ నాటకరాజములలో ఒక్కటి యగు శాకుంతలనాటకమును గూర్చి కొంచెము వివరించి, అభిలాషగల విద్యార్థులు ఇతరత్ర ఈవిషయములను గూర్చి అధికముగ తెలుసుకొన గోరుచున్నాము. ఈ శకుంతలానాటకమును కలకత్తా హైకోర్టులో జడ్జిగా నుండిన "సర్ విలియం జోన్సు" అను ఆంగ్ల పండితుడు ఇంగ్లీషులోనికి భాషాంతరీకరించెను. యూరప్ ఖండమందలి కవిశ్రేష్ఠుడని ప్రఖ్యాతి జెందిన "గెయిటీ" అను జర్మను కవిసార్వభౌముడు ఈ నాటకమును చదివి ఆనందమును పట్టలేక నృత్యము చేసెనని చెప్పుదురు. భూలోక స్వర్గలోకములలోని సౌందర్య మొక్కచోట చూడవలయు నన్న ఈ శాకుంతలమే చాలును అను అర్థముగల పద్యమును అతడు అప్పుడు రచించెను.

ఇంగ్లీషుభాషలో 12 టికి మించిన భాషాంతీకరణములును, జర్మను భాషలో 18, ఇటాలియనులో 4 ను, రష్యనులో 3 ను, డేనిష్‌లో 2 ను, డచ్చిలో 2 ను, స్పానిష్, పోలిష్, హంగేరియన్, బొహీమియన్, ఐస్‌లాండిక్ భాషలలో ఒక్కొక్కటియు శాకుంతలనాటకమునకు భాషాంతర

కరణములు గలవు. హిందూస్థానమునందలి దేశభాషలలోను అసంఖ్యాకము అగు భాషాంతరీకరణములుగలవు.

కాళిదాసమహాకవి ముఖ్యకథను మహాభారతమునుండి తీసుకొన్నను, దానియందు కొన్ని మార్పులు చేసి మెరుగు పెట్టియున్నాడు.

ఈ కథను ఇచ్చట వ్రాయుటకు స్థలము లేదు. కాని, మచ్చుకొఱకు కొన్ని స్థలములను చూపెదము. అవస్థాభేదమునుబట్టి జంతువుల గమన మెట్లు మారునో ఇందు కాళిదాసు చక్కగ వర్ణించి యున్నాడు.

"ముక్తేషు రశ్మిషు నిరాయతపూర్వకాయాః
నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణాః."

అనగా కళ్ళెము సడలింపగనే మిక్కిలి సాగి పొడవైన పూర్వకాయములు కలవై కదలకుండ ఊర్ధ్వముగా పైకెత్తిన అగ్రములుగల తోకలతో చెవులు నిక్కబొడిచికొని గుఱ్ఱములు పరుగెత్తినట్లు వర్ణింపబడినది.

"గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభియా భూయసా పూర్వకాయమ్
దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా,
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోక ముర్వ్యాం ప్రయాతి."

అనగా - వెనుకనుండి పరుగెత్తి వచ్చుచుండు రథమును మెడ వెనుకకు త్రిప్పిచూచుచు, వెనుకనుండి బాణము వచ్చిపడును అను భయము చేత తన వెనుకటి సగోరు శరీరమును ముందు శరీరములోనికి ఇముడ్చుకొని పరుగెత్తుటచే గలుగు శ్రమవలన తెరచుకొని యున్న నోటినుండి సగము నమిలిన గడిపరకలను తోవ పొడవునను రాల్చుచు, పెద్దపెద్ద దాటులు వేయుచు, భూమిపైని కాళ్ళు అంటీఅంటకుండా ఆకాశములోనే ఎక్కువగా దుముకుచు లేడి పరుగెత్తె నని వర్ణింపబడెను.

మఱియు శీఘ్రయానమగు రథమును ఆరోహించినవారికి పార్శ్వభూము లెట్లు గోచరించుచనదియు "యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివతత్ । ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః" అనగా కండ్లకు దూరముగా నుండుటచే సూక్ష్మముగా కనబడువస్తువులు అతిశీఘ్రముగా సమీపించుటచేత వెంటనే పెద్దదిగా

నయి కనబడుచున్నవి. మధ్యమధ్య తెగియున్న కొండలపంక్తులు, మార్గములు, పొలములు మొదలైనవి ఒకదానిలో ఇంకొకటి కలిసియున్నట్లు కనబడు చున్నవి. నిజముగా వంకరటింకరగా నుండు మార్గములు తిన్నగా నున్నట్లు కనబడుచున్నవి అని వర్ణింపబడెను. ఇప్పటి శీఘ్రయానమగు రథములో గూర్చుండిన వారికి హృదయంగమములని వేరుగా చెప్పవలెనా?

ఇక శకుంతలను సాగనంపునపుడు చెప్పిన రెండు శ్లోకముల భాషాంతీకరణమును ఉదహరించుచున్నాము.

ఉ. కొండల మండె డెందము శకుంతల తా నిపుడేగునం చయో!
క్రిందుగ బాష్పరోధమున గంఠమునుం జెడె, దృష్టిమాంద్యముం
బొందె; నొకింత పెంచిన తపోధనులే యిటు కుంద, నెంతగాఁ
గుందుదురో తమంతఁ గను కూతులఁ బాయు గృహస్థు లక్కటా!

(శ్రీ కందుకూరి వీరేశలింగముగారు).

చ. గురువులఁ గొల్వుమమ్మ సరికొమ్మలఁ జెల్మిని జూడవమ్మ, మిం
చి రమణుఁ డేమి విప్రియము సేసిన నల్క నెదుర్పకమ్మ, బ
ల్కరుణ మెలంగుమమ్మ, బలగంబు దెస న్సిరి నుబ్బకమ్మ, దా
ల్తురు గృహిణీపదం బిటు సతు ల్మఱి వామలు వంశపాంసనల్.

(శ్రీ రాయదుర్గము వెంకటనరసయ్యశాస్త్రిగారు).

పూర్వకాలపు రాజులు ప్రజల యెడజూపు సానుభూతిని గూర్చి యిట్లు వర్ణింపబడెను.

—“యేన యేన వియుజ్యంతే ప్రజా స్స్నిగ్ధేన బంధునా।
స స పాపాదృతే తాసాం దుష్యంత ఇతి ఘుష్యతామ్.”

ప్రజలలో నెవ్వరికైనను ప్రేమపాత్రులగు బంధువులు గతించినచో అట్టివారికి మారుగా దుష్యంతుడే వారి బంధువుగానుండి వారి భారమును వహించుననియు, అట్లు బంధువుగా నుండుటలో పాపకార్యముల విషయమున మాత్రము విముఖుడగుననియు గలదు. (అనగా స్త్రీలకు భర్తలు పోయినచో వారి స్థానము నాక్రమింపక ధర్మశాస్త్రరీతిని భర్తయనంతరమున స్త్రీలకు ప్రధానబంధు వగు పుత్రునివలె నుండునని తాత్పర్యము.)

ఇంకొక వర్ణనను చూపి దీనిని ముగించెదము. ప్రతిమానవుడును తనలో నిమిడియుండు సహజమహిమను వెలిబుచ్చుటకు తగిన హేతువు మంచి ఉదాహరణతో ఇట్లు నిరూపింపబడియున్నది. ఎట్లనగా —

"జ్వలతి చలితేంధనోవహ్నిః విప్రకృతః పన్నగః ఫణాంకురుతే।
ప్రాయః స్వం మహిమానం క్షోభా త్ప్రతిపద్యతేహి జనః."

పొయ్యిలోనుండు కట్టెలు దిగకాలుచుండునప్పుడు కొంచెము కదల్చినచో బాగుగా మండును. పాము నేల నంటి పోవుచుండగా ఏదయినా నిరోధము దానికి కలిగించినచో బుస్సుమని పడగనెత్తును. అట్లే ప్రతిమనుజుడును క్షోభవలన తనమహిమను బయలుపరచునని చెప్పబడెను.

ఇట్టివి అనేకములైన లోకోత్తరభావములు శాకుంతలమునుండి మనము తెలుసుకొనగలము.

## ఆయుర్వేద గ్రంథములందలి కావ్యరచన

పూర్వకాలపు ఆయుర్వేద గ్రంథములు వైద్యమునేగాక సాహిత్యమునుగూడ బోధించును. పాశ్చాత్య వైద్యగ్రంథము లన్నియు వచన కావ్యము లగుటచే ఒకప్పుడు చదువుటకు విసుగుపుట్టును. ఆయుర్వేద గ్రంథములం దట్లుగాక అందలి పద్య (శ్లోక) శైలి, కవితారచనయు ఆనందముగా నుండును.

చరకసుశ్రుతముల మృదుమధురశైలి సాధారణముగా అనుకరింప శక్యముకానిది. వాగ్భటుని స్వాభావిక వర్ణనలు చదువువారికి ఉత్కృష్ట కావ్యమును చదువునప్పుడు గలుగు ఆనందము అనేకఘట్టములయందు గలుగును. జీవానంద నాటకమునందు క్షయ, జ్వరము, అతీసారము మొదలగు పాత్రములు రంగస్థలమునందు తమతమ స్వాభావిక లక్షణములతో నాట్యమాడుట మిక్కిలి చమత్కారముగ రచియింపబడెను. ఆంధ్రదేశమునందు వైద్యులచే పఠింపబడు "లోలంబరాజీయము" కావ్యములలో ఉత్తమకావ్యమై, వైద్య విషయములందుగూడ శ్రేష్ఠమై హెచ్చుగా పొగడదగియున్నది.

# 5 వ అధ్యాయము

## సంఘనిర్మాణము

[విషయసంగ్రహము: సంఘనిర్మాణము - హిందూ సంఘము - వర్ణాశ్రమ ధర్మములు - స్వభావజమగు గుణములు - స్వభావజము లగు కర్మలు - చాతుర్వర్ణ్య సిద్ధాంతము - వర్ణసంకరము-వర్ణవ్యవస్థ, ఆయుర్వేదము.

సంఘనిర్మాణము అను శీర్షికక్రింద సంఘమునందలి వివిధశాఖల వారిలో ఒకరి కొకరికి గల సంబంధములును, అట్టి సంబంధములను బట్టి మొత్తము సంఘమునకు గలుగు కీడు మేళ్లును తెలుసుకొనబడును. జాతి అంతయు ఒకేవ్యక్తివలె అవసరమైనప్పుడు ఒక్కమార్గమున నడవవలెను. భారతదేశమునందు జాతీయాభివృద్ధిని పురస్కరించుకొని అనేకస్మృతులును, చట్టములును చిరకాలమునుండి గలవు. అందు మనుస్మృతి ఇప్పటివఱకును భారతీయ సాంఘికజీవనమును పరిపాలించు గ్రంథములలో మొదటిది. సముద్రములో పెద్దచేప చిన్నచేపను మ్రింగి తన పొట్ట పోసుకొనును. ఈ పెద్దచేప కంటె పెద్దచేప దానిని మ్రింగివేయును. దీనికి "తిమి తిమింగిల న్యాయము" అని పేరు. ఇట్లే బలవంతుడు తన లాభముకొఱకు బలహీనులను ఉపయోగించుకొనుచుండును. ఇది తప్పనిసరియైనను, లోకసంగ్రహార్థమనగా సంఘముయొక్క సంపూర్ణ అభివృద్ధికి కొన్ని నియమములు ఇందుకొఱకే పుట్టుచున్నవి. ఏ సంఘములో ఈ నియమములు చక్కగా నడచునో ఆ సంఘము వర్ధిల్లును. ఎక్కడ సాంఘికలోపము గలుగునో అక్కడ దేశ, కాలపాత్రలను బట్టి అది నశించును.

ఈజిప్తు, బాబిలోన్, రోమ్, గ్రీస్ మొదలగు సామ్రాజ్యములు నామమాత్రావశిష్టమై తమ నాగరికతను కోల్పోయినను, భారతదేశము ప్రపంచమునందు తలయెత్తి ఖండాంతరములకుగూడ ఇప్పటికిని అనేక

విషయములలో మార్గదర్శకము కాగలుగుటకు మన్వాదుల సాంఘిక నిర్ణయములే కారణములని చెప్పవచ్చును.

## హిందూ సంఘము

హిందూసంఘము ఒక్క శిలయందు చెక్కబడిన సుందర విగ్రహమువలె నున్నదని ఇదివఱకు చెప్పితిమి. ఇందలి శాస్త్రములు, కళలు, వేదాంతములు, నీతులు, సాంఘికమర్యాదలు అన్నియు ఒకే ఆదర్శమును బోధించును. అది ఏదనిన సంఘముయొక్క సర్వతోముఖమైన అభివృద్ధి. ఇచ్చట మతము వేరుగాను, నీతి వేరుగాను ఉండదు. హిందూమతమునందు ఒకొక్కని జీవితములో జన్మమెత్తినది మొదలు ఆమరణాంతము ప్రతివ్యక్తియు మతసంబంధమైన కట్టుదిట్టములకు లోబడి యుండవలసినదే. గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, వివాహము మొదలగు షోడశకర్మలును; బ్రహ్మచర్యము, గార్హస్థ్యము వానప్రస్థము, సన్యాసము అను ఆశ్రమములును, ప్రతిమానవులకును విహిత ధర్మములు. ఇవి ఒక్క సూత్రమున గుచ్చినట్లుగా చట్టనిర్మితమై ప్రతివానికిని వానివాని వర్ణమునుబట్టి పుట్టుకతోడనే నిశ్చయింపబడినవి. అదృష్టకర్మచే తాను పుట్టిన కుటుంబవశముననను, తనకు భగవంతుడిచ్చిన గుణగణముల మహిమచేతను, సంఘమునందు తన కేర్పడిన స్థానములను బట్టి చాతుర్వర్ణ్య ధర్మములకును, ప్రతివ్యక్తియు లోబడి యుండును. అప్పటి ఆర్యసంఘము యొక్క చట్టనిర్మాతలకు రెండు పనులు ముఖ్యమని తోచెడివి.

(1) అజ్ఞానియగు శిశువునకు వయస్సు వచ్చినతరువాత జ్ఞానము గల్పించుట. ఇది వ్యక్తి సంబంధమైన చతురాశ్రమ పద్ధతి.

(2) జ్ఞానహీనులగు వర్ణముల వారికి కాలక్రమమున జ్ఞానోపదేశము చేయుట. ఇది రెండవ దగు చాతుర్వర్ణ్య పద్ధతి. తమతో సంబంధముగల అనార్యులును, అనాగరికులును అగు జనులకు క్రమమగు శిక్ష నొసగి వారిని నాగరికులనుగా జేసి తమ ఆర్య సంఘములోనికి క్రమముగ లీనము చేసుకొనుటకై ఇది పుట్టినది, ఇది సంఘమునకు సంబంధించినది. ఆ కాలము నాడే భారతీయ సాంఘిక శాస్త్రజ్ఞులు సామ్యవాదమును కనిపెట్టి అందుకు

తగిన నియమముల నేర్పరచిరి. ప్రస్తుతము అమెరికా దేశములో సాంఘిక విప్లవములను నిరోధించుటకు వారు హిందూదేశవర్ణాశ్రమ ధర్మములను కాలానుగుణ మగు మార్పులతో స్థాపించుటకు ప్రయత్నించుచున్నారు.

## వర్ణాశ్రమ ధర్మములు

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్''*

అని భగవద్గీతలో చెప్పినట్లు స్వభావజన్యములైన గుణకర్మల యొక్క ఫలముగా ఒక్కొక్కని జీవితమంతయు నిర్ణయించబడును. ఇది సృష్టిలోనే ఉన్నది.

## స్వభావజ మగు గుణములు

హిందూశాస్త్రములను బట్టి స్వాభావికములగు గుణములు సాత్త్వికము లనియు, రాజసములనియు, తామసము లనియు విభజింపబడినవి. ఈ గుణములు ఒక్కొక్కని పుట్టుకతో గూడ వచ్చియుండును. ఈ మూడు విధములగు గుణములు గలవారికిని జ్ఞానమునందును వారు చేయు కార్యము నందును వారి వారి ఆదర్శమునందును భేదముండును.

♦ ఆసక్తి లేనివాడును, తనది అనిగాని తన సంబంధమైన అనిగాని అనుకొననివాడును, కార్యము సిద్ధించినను లేకపోయినను వికారము చెందని వాడును, ధైర్యము, పట్టుదలయు గలవాడును సాత్త్వికు డనబడును.

† విషయాసక్తుడును, కర్మఫలమును కోరువాడును, పరధనాభిలాషి, హింసించు స్వభావముగలవాడును, లాభాలాభములు గలిగినప్పుడు సంతోషము, దుఃఖముగలవాడును రాజసు డనబడును.

---

* భగవద్గీత అధ్యాయము. 4 శ్లోకము 13,

♦ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే.

† రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః.

* చలచిత్తుడును, అవివేకియు, జడుడును, మాయచేయువాడును, ఇతరుల పనులను చెఱచువాడును, సోమరియు, దుఃఖశీలుడును, ఒకగంటలో చేయదగిన పనిని ఒకరోజువఱకు చేయువాడును (దీర్ఘసూత్రి) తామసు డనబడును. *

ఒకమానవునియొక్క నైజగుణములను బట్టియే వాని కర్మలుండును. ఈ గుణకర్మలను ఆధారముచేసుకొని నాలుగు వర్ణములు లేక నాలుగు ముఖ్యమైన జాతిభేదములు ఈదేశమునందే గాక ప్రపంచకము నందంతటను మానవకోటిలో చూడవచ్చును. ఈ సహజము లగు గుణాతిశయములను బట్టియే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర లను ముఖ్యజాతులు సృష్టి కర్తచేత నే సృజింపబడిన వని చెప్పబడియున్నది.

(1) శమదమాది సాత్త్వికగుణములు బ్రాహ్మణులకును

(2) శౌర్యాది రాజసగుణములు హెచ్చుగను, కొంచెము తక్కువగా సాత్త్వికగుణములు క్షత్రియులకును

(3) హెచ్చుగ లోభాది రాజసగుణములును ఇంకను తక్కువగా సాత్త్వికగుణములు వైశ్యులకును

(4) హెచ్చు తామసగుణములును, కొద్ది రాజసగుణములు, అంత కంటె తక్కువ సాత్త్వికగుణములు శూద్రులకును ఉండునట్లు ఈ వర్ణనియ మము చేయబడినది.

## స్వభావజము లగు కర్మలు

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల యొక్క కర్మలు వారి వారియొక్క స్వభావజన్యములైన గుణములను బట్టి వేరువేరుగ విభజింప బడినవి.

శమము, దమము, తపస్సు, శుచిగ నుండుట, శాంతి, ఆర్జవమనగా చక్కని నడవడి జ్ఞానము అనగా ఆధ్యాత్మజ్ఞానము, విజ్ఞానము అనగా వివిధ

---

* అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైకృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.

(భగవద్గీత. అ. 18- శ్లో. 26, 27, 23)

శాస్త్రజ్ఞానము, ఆస్తిక్య బుద్ధి- ఇవి బ్రాహ్మణులయొక్క స్వభావజన్యము లైన గుణములు. *

శౌర్యము, తేజస్విత, ధైర్యము, నేర్పు, యుద్ధములో వెనుకదీయ కుండుట, దాతృత్వము, ప్రజలను రక్షించుట ఇవి క్షత్రియునకు స్వభావ జన్యములైన కర్మలు. ♦

కృషి, వాణిజ్యము, గోరక్షణము, అనగా పశుపరిపాలనము మొదలగునవి వైశ్యులకు స్వభావజన్యము లగు కర్మలు. †

నాలుగువర్ణముల వారివలన ఏర్పడిన సంఘమునకు సేవచేయుట నాల్గవ వర్గమువారగు శూద్రులకు స్వభావజన్యము లగు కర్మలు.

చతుర్వర్ణానుసారముగ ప్రాప్తములైన కర్మను నిష్కామబుద్ధితో చేయుదుమేని అవి పరమేశ్వరునియొక్క యజనపూజనములే యగును అని సంఘసేవయే పరమాదర్శముగా గీతయందే గాక మహాభారతము నందును ఇతర వాఙ్మయమునందును చెప్పబడుచుండును.

## చాతుర్వర్ణ్య సిద్ధాంతము

ఈ నిర్ణయమునుబట్టి చాతుర్వర్ణ్య సిద్ధాంతము మాత్రమేగాని ఏ కాలమునందైనను సంపూర్ణశమదమాదిగుణములు గల బ్రాహ్మణులుగాని వారివారి కుచితములగు గుణము లన్నియు గల క్షత్రియ, వైశ్య, శూద్రులు గాని శాస్త్రములో చెప్పినట్లు ఉండిరని అర్థము కాదు.

మొట్టమొదట జన్మములనుబట్టిగాక గుణములనుబట్టి అధిక సాత్వికులను బ్రాహ్మణులుగను, అధిక రాజసులను క్షత్రియులుగను ఈ రీతిగానే

* శ్లో॥ శమోదమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవమేవచ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మ కర్మ స్వభావజమ్.
గీత - అధ్యాయ 18 శ్లో. 42.

♦ శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్.
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్.
గీత - అధ్యాయ 18 శ్లో. 42.

† శ్లో. కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్.
(గీత. 6-18 శ్లో. 44)

తక్కినవర్ణముల వర్గీకరణము ఏర్పరచినను పిమ్మట కొంత కాలమునకు వంశ పారంపర్యముగ పుట్టుక చేతనే గలుగు వర్ణభేదములు ఏర్పడియుండవచ్చును.

మొట్టమొదట గుణము చేతనే గలుగు వర్ణము తుదకు జన్మముచేతనే గలుగు నట్లూహించబడి నాలుగుజాతులుగా స్థిరపడియుండవచ్చును. మహా భారతమునందు పొడుగునను జన్మచే కలిగిన బ్రాహ్మణత్వముకంటె గుణ ముచే గలిగిన బ్రాహ్మణత్వమునే ఎక్కువ శ్లాఘించుచు వచ్చిరి. భగవద్గీతకూడ ఇదే విషయమును త్రిప్పిత్రిప్పి చెప్పుచున్నది.

భారతీయ వాఙ్మయముయొక్క సంప్రదాయము తెలియనివారు ఈ దేశమునందలి వర్ణములను, కులములను ఆక్షేపింపవచ్చునుగాని వాని తత్వమును తెలిసినవారు జ్ఞానాభివృద్ధికిని, ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరి స్థితులను కాపాడుటకును, ఇతరదేశములరీతిని తలుచు సంఘము విప్లవములకు పాలై నాశము చెందకుండుటకును సనాతములైన ఈ ధర్మములే కారణము లని యూహింపజాలరు.

ఉపనిషత్తులును శ్రీశంకర రామానుజ మధ్వాచార్యులును అసంఖ్యా కులగు శైవ వైష్ణవభక్తులును ఈ కాలమున గాంధీమహాత్ముడును మానవజాతి యొక్క ఏకత్వమును సోదరభావమును చాటించుచు వచ్చిరి. ఈ దేశము నందు పుట్టి ఖండాంతరములయందుకూడా వ్యాపించి విజృంభించిన బౌద్ధ మతము, మఱియు జైనమతము సర్వమానవసౌహార్దమును బోధించుచున్నవి.

ఈ దేశమునందు బౌద్ధమతము ఇప్పుడు లేకున్నను తత్సంప్రదాయ ములు హిందూమతసారస్వతమునందు లీనమై యున్నవి. వేర్వేరు మత ములుగా నేర్పడినను జైనమతము సిక్కుమతమునుగూడ సంస్కరింపబడిన సూఫీ హిందూమత సిద్ధాంతములనే బోధించును. ఇప్పుడేర్పడిన క్రైస్తవ సంఘములవారికి మాత్రము ఇంతకంటె సమత్వ బుద్ధిగల దనుట భ్రమ పూర్వకముగాని, సత్యముగాదు. హిందూసంఘము స్వయంనిర్ణయసూత్ర ముల (Democratic waves of Thoughts) మీద ఆధారపడియున్నది.

ఒక్కొక్కకులము లేక వర్ణము స్వపరిపాలనము గలిగిన ఒక్కొక్క రాష్ట్రమువంటిది. హిందూమహాసంఘము అనేక రాష్ట్రములుచేరిన సంయుక్త రాష్ట్రము (Federation) వంటిది. ప్రతిరాష్ట్రమునకు స్వవిషయములను గూర్చి తాము తీర్మానించుకొనుటకు స్వాతంత్ర్యము గలదు. క్రొత్తకులములు లేక సంఘములు సంయుక్తమహాసంఘమునందు చేరుటకు అవకాశము గలదు.

ఒక కులము తక్కువ మఱియొక కులము ఎక్కువ అన్నమాట వేదములలో నెచ్చటను లేదు.

ఈ తరువాత వచ్చిన మహామ్మదీయులుగూడ మొదట మొదట విగ్రహారాధనమును దూషించుచుండినను, తుదకు వారిలో కొందఱు పీరులను పంజాలలో పెట్టి ఒక విధమైన విగ్రహారాధనకు లోనై అల్లాస్వామిని పూజించుచు భారతదేశీయకులములలో ఒక కులముగా ఏర్పడి సంఘములో లీనమైపోయి యున్నారు. అద్వైతసంప్రదాయమునకు చెందిన మహామ్మదీయులేగాక విశిష్టాద్వైత సంప్రదాయమునకు చేరిన క్రైస్తవులుకూడ భక్తిమార్గ ప్రవర్తకులగుచున్నారు.

సంఘములో ఇప్పుడున్న ఎక్కువ తక్కువలు పూర్వముకూడ ఉన్నవని కొందరు తలచినచో, అది ప్రథమసంఘనిర్మాణకారుల అభిప్రాయము కాదు. హిందూసంఘమునందు ఏ కులములో ఉన్నను ఏ వర్ణమునకు చెందినను ప్రతివ్యక్తికిని తన ఇచ్చవచ్చినట్లు స్వతంత్రముగ ఆ యా కులధర్మములను బట్టి దైవప్రార్థనము చేసికొనుటకును, మోక్షము పొందుటకును ఆటంకము లేదు. ఒక తేనెపట్టునందు ఒకగది పైది, ఇంకొకగది క్రిందది, ఒక గది పెద్దది, మఱియొకగది చిన్నది, అను విభేదములు ఎట్లు లేవో, అట్లే అన్ని వర్ణములయొక్కయు సర్వతోముఖమైన సమాభివృద్ధికి సంఘమునందు హెచ్చుతగ్గు లనెడి విభేదము లుండకూడదు.

ఒక యంత్రము బాగుగ నడచుటకు పెద్ద చక్రమువలెనే మిక్కిలి చిన్నచక్రమును అవసరమగునట్లే సర్వజగద్రక్షణ మను ఈ గొప్పకార్యము చెడకుండ కాపాడుటకు గొప్ప యధికారులవలె చిన్న యధికారులు సైతము అవసరమని అందరకిని తెలిసినవిషయమే.

ఇప్పటికిని పుట్టుకచే శూద్రులై గుణములచే బ్రాహ్మణులుగానుండువారు సమస్త గౌరవములను పొందుటయు, పుట్టుకచే బ్రాహ్మణులై గుణములచే వర్ణహీను లగువారు నిరసింపబడుటయు సంఘమర్యాదగా నున్నది. మన్వాది శాసనకర్తల ఆశయ మేమనగా, క్రమపరిణామముచే అన్ని కులముల వారును తుదకు బ్రాహ్మణులు కావలెననియే!

వర్ణసాంకర్యమై హెచ్చుగుణములు గల బ్రాహ్మణాదులు క్షీణించకుండ నుండుటకును హీనగుణములుగల శూద్రాదులు గుణవంతు లగుటకును వీరు మార్గములను చూపిరి.

## వర్ణసాంకర్యము

ఈ దేశమునందు ప్రధానమైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములుగాక 64 కళలు నేర్చినవారలు 64 కులములుగాను, క్రొత్తగా నెన్ని కళలుగాని, వ్యాపారములుగాని, దేశమునందు వృద్ధి చెందినవో అన్ని క్రొత్తకులములు ఏర్పడుచు వచ్చినవి. ఒక్కొక వ్యాపారమున నుండు వారు మఱియొక వ్యాపారస్థులతో పోటీచేసి ఒండొరుల వ్యాపారములను ధ్వంసము చేసుకొనకుండునట్లు ఈ కట్టుబాట్లు పుట్టినవి. ఇట్టి కట్టుబాట్లు చెడిపోవుటయే వర్ణసాంకర్యము (Class Confusion). వర్ణసాంకర్యమైనచో సంఘవిప్లవము (Social anarchy) పుట్టి సంఘమునందు అంతఃకలహములు ఏర్పడి సంఘనాశన మగును.

అందుచేత పరస్పర ద్వేషములకు అవకాశము లేకుండుటకై, ఈ సంఘనిర్మాణము ఆయా కాలముల పరిస్థితులనుబట్టి భారతదేశమున పుట్టినది.

సంఘపరిణామము (Evolution of Society):—జడ పదార్థముల నుండి క్రమముగా స్థావరములగు వృక్షములు, అటుపైని క్రమక్రమముగా ఇంద్రియవ్యాపారాభివృద్ధిని సూచించు జంతుజాలమును, అంతకంటె ఎక్కువగా జ్ఞానవిజ్ఞానములు గల మానవులును, ఎట్లు పరిణమించిరో అట్లు జడతుల్యములగు శూద్రజాతులనుండి క్రమముగా జ్ఞాన విజ్ఞానాభివృద్ధిచే వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణజాతులు పరిణమింపవలయు నని హిందూ సంఘనిర్మాతల ఆదర్శము. "మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః." మనుష్యు లందరును జ్ఞానవంతులై తుదకు బ్రహ్మమునందు ఐక్యము చెందుటయే సృష్టియందలి పరిణామసూత్రము. ఇది ఒకతరమునం దగునది కాదు. తగినంత జ్ఞానము గలుగుటకు అనేక జన్మములు ఒక్కొకరికి కావలసి వచ్చును. కాని తుదిపరిణామము బ్రహ్మైక్యమే.

బ్రాహ్మణుడు అనగా బ్రహ్మవేత్త - భగవంతుని తెలుసుకొనుటకు కావలసినంత జ్ఞానము కలవాడని అర్థము. బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణుడు క్రిందికి పడిపోకుండుటకును జ్ఞానశూన్యులగు ఇతరులు జ్ఞానాభివృద్ధిచే బ్రాహ్మణులుగా పరిణమించుటకును ఏర్పడిన ఆదర్శపూర్వకమైన చట్టములే హిందూధర్మమునకు ఆధారములు.

ఇందుకొరకై బీజరక్షణము ప్రధానముగా నెంచి, అనులోమ వివాహములను ప్రోత్సహించి, ప్రతిలోమవివాహములను నిషేధించిరి.

ఇప్పటికిని మలబారు ప్రాంతములందు క్షేత్రమును, బీజమును పూర్వపద్ధతులనుబట్టి రక్షించు మార్గములు గలవు.

కుమ్మరి కుండలను, సాలెవాడు వస్త్రములను నిర్మింపనియెడల రాజు జాగ్రత్తగ ప్రజలను రక్షించినను లోకసంగ్రహ మను కార్యము పూర్తి కానేరదు. రైలుబండి నడపుటయందు ఒక చిన్న అధికారి, తుదకు జెండాను చూపు సేవకుడు, తన కర్తవ్యమును చేయడేని వాయువేగముతో రాత్రింబవళ్ళు నిర్భయముగ ఎట్లు రైలుబండ్లు పరుగెత్తలేవో, అట్లే పై మెట్లులందు రాజుగాని, క్రింది మెట్లయందు ఒక సామాన్యుడగు మానవుడు గాని, సంఘసేవ చేయనియెడల యథాన్యాయముగ రాష్ట్రపరిపాలనము జరుగదు. హెచ్చుతగ్గులు ఆ యా వ్యక్తులయొక్క స్వభావసిద్ధములైన గుణభేదములనుబట్టి యుండునుగాని వారికి విహితములైన పనులనుబట్టి యుండవు.

ఒకే జాతిగల ఐరోపా మొదలగు ఖండములలో కూడ బలముచే గాని, బుద్ధిచేగాని, ధనముచేగాని అధికులగువారు ఇతరుల మీద కొంత అధికారమును గలిగి యుందురు. ఇట్టి బలవంతులపిల్లలు కొందరు సాధారణముగా తండ్రియొక్క గౌరవమును, గుణమునుకూడ కలిగియుండ వచ్చును. తరువాత కొంత కాలమునకు తండ్రి తాతల గుణములును ఐశ్వర్యమును లేక పోయినను పుట్టుకచే మాత్రము కలిగిన కులములు ఏర్పడును. ఇప్పుడు పాశ్చాత్యదేశములలో మన దేశములో నున్నట్లు నిర్బంధమగు కులములు లేకపోయినను ఐశ్వర్యమునుబట్టియు, వృత్తినిబట్టియు, వంశపారంపర్యముగా వచ్చు రాజకీయబిరుదముల బట్టియు ఏదోవిధముగ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు తుల్యము లగు జాతిభేదములు (Class distinctions) కులభేదములు ఏర్పడుచున్నవి. ఒక ప్రభువు కూతురు సామాన్య కార్మికుని వివాహము చేసుకొన్నయెడల ప్రభుసంఘములోని వారికి చాలా కష్టముగానే యుండును. ఇంగ్లండుదేశపు రాజగు 8 వ ఎడ్వర్డు అమెరికా దేశపు సామాన్యపు కన్యను పెండ్లియాడినప్పుడు చాలవిచిత్రముగా కనపడి, ఇంగ్లండు ప్రజలు దానిని సహించలేకపోవుటచేత అతడు రాజ్యభ్రష్టుడు కావలసివచ్చెను. ఇంతకంటె కులనిర్బంధము ఏమి కావలెను? ఒకేజాతి ప్రజల

లోనే కార్మికుడు (శూద్రుడు) కర్షకుడు (వైశ్యుడు) రాజకీయోద్యోగి (క్షత్రియుడు) విద్వాంసుడు (బ్రాహ్మణుడు) మొదలగు భేదములు స్పష్టముగా కనబడుచున్నవి. ఇవియే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర విభాగముల క్రింద హిందూదేశమున ఏర్పడియున్నవి. శ్రీకృష్ణుడు.

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం, గుణకర్మవిభాగశః"

సృష్టికర్త యగు తానే జాతిభేదములను సృష్టించినట్లు చెప్పినది ప్రపంచమున కంతకును చెప్పినమాటగాని ఒక్క హిందూస్థానమునకు మాత్రము చెప్పినది కాదు. ఈ విభజన వారివారికి సహజములగు గుణములచేతనో, కర్మలచేతనో ఏర్పడిన దగుటనేత, సంఘమునందు ఒక్కొక్కరు సంపాదించుకొను అధిపత్యము తనకు భగవంతుడిచ్చిన శక్తి సామర్థ్యములను బట్టి ఏర్పడునని స్పష్టముగ రెండవ పంక్తిలో గలదు. సంఘమునందు అందరును ఒకటే జాతికి చేరిన పరిస్థితులలో ఇట్టి కులభేదములు ఏర్పడుచుండగా రమారమి ఐరోపాఖండమున కంతకును సమానమైన విస్తీర్ణము గలిగి, గాంధారము మొదలు కాంబోడియా వఱకును (అనగా ఇప్పటి పర్షియా మొదలు హిందూచైనావఱకును) వ్యాపించిన భరత ఖండమునందు నివసించుచుండిన అనేకజాతులవారు ఒక్క సంయుక్తనుహా సంఘముగా, ఏర్పడి ఏ కులమున కా కులము స్వతంత్ర జీవితమును నిరభ్యంతరముగ గడపుటకు మార్గదర్శియైన హిందూధర్మశాస్త్రము చాల విశాల దృష్టి గలిగి మానవసంఘపరిణామమునకు ఎక్కువగా తోడ్పడిన దనిన ఆశ్చర్య మేమియును లేదు. ఇప్పటికిని వర్ణసంకరముల భయము, నలుపు తెలుపు విభాగములు అమెరికాలోను అఫ్రికాలోను విపరీతమైన ద్వేషములకు కారణమగుచున్నవి. ఒక్క నీగ్రోజాతి మానవుడును, తెల్లజాతి స్త్రీయును అన్యోన్యముగా ఇష్టపడి వివాహమాడినను అట్టిపురుషుని ముక్కలు ముక్కలుగ చీల్చి బ్రతికి ఉండగానే ఇప్పటికిని కాల్చి వేయుదురు. ఇంతకంటె కులకట్టడియొక్క వైపరీత్యమునకు దృష్టాంతము వేరుగా కావలయునా? లించ్‌లా (Lynch Law) అని దీని కొకచట్టముకూడ గలదు. ఇప్పుడు ప్రపంచమున ఘోరముగా మూడు సంవత్సరములనుండి జరుగుచున్న యుద్ధము గూడ కొంతవఱకు ఇట్టి కులభేదములను బట్టి వచ్చినదే. ఆర్యులమని చెప్పుకొను జర్మనులు అనార్యులైన యూదులను అనేకవిధముల చిత్రవధలు చేయుచున్నారు. హిందూదేశమునందలి కట్టుబాటులను వెక్కిరించు

క్రైస్తవమతగురువులు గురిగింజ తన కున్న నలుపును తెలుసుకొననట్లు, ఏదో చెప్పుచుందురు గాని స్వవిషయమునకు వచ్చి నప్పుడు బదులు చెప్పలేరు. జాతి సామ్యమును గూర్చి బోధించు ఒక ఫాదిర్‌ని నీ కూతురు క్రైస్తవమతము లో చేరిన ఒక ఆదిద్రావిడుని వివాహ మాడుటకు అంగీకరించెదవా? అని ఎవ రైన ప్రశ్నించినయెడల నిర్ఘాంతపోవును. హిందూదేశమునందు కులభేదము లెన్ని యున్నను ఇతరకులములవారిని ద్వేషించుటలేదు. తండాలు తండా లుగా ఈ దేశముపై దండెత్తి వచ్చిన అన్ని జాతులవారిని సమస్తనదులను తన పొట్టలో నిముడ్చుకొను మహాసముద్రమువలె హిందూసంఘము అందఱిని ఆదరించినది. పారశీకులు, పఠానులు, ఇతర మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు ఎన్ని జాతుల వారు వచ్చినను సుఖముగ తమతోగూడ జీవింప గల సౌహార్ద్రమును జూపి అందఱను భారతమాత తనయొక్క పుత్రులనుగా చేసుకొన్నది. ఇంతకంటె సంఘనిర్మాతలు చేయగల్గిన దేమి గలదు?

• "Sir George Campbell, a distinguished European Civil servant and a noted anthropologist writes in his book, after he travelled in the United states of America, with a view to study the nature of the relation between the whites and the blacks as follows — "In India, I have had the experience of how Communities of people, who vary in character, culture and rank and racial qualifications, have lived for centuries amicably side by side, and this has been possible in India only through the organisation of Caste."

## వర్ణవ్యవస్థ—ఆయుర్వేదము

చరకుని కాలమునాటికి పూర్వమునుండియే ఆయుర్వేదశాస్త్రము అన్నివర్ణముల వారిచే నభ్యసింపబడుచుండె నటుల తెలియగలదు.

సచాధ్యేతవ్యో బ్రాహ్మణ రాజన్య వైశ్యైః
తత్రానుగ్రహార్థం ప్రాణినాం బ్రాహ్మణైః
ఆత్మరక్షార్థం రాజన్యైః, వృత్త్యర్థం వైశ్యైః
సామాన్యతోవా ధర్మార్థ కామ పరిగ్రహార్థం సర్వైః *

• Bhagavat Gita, By Prof. M. Rangacharya, Vol 1; Page 577.
* చరక. సూ. అ. 30.

అనగా సకలప్రాణుల హితార్థము బ్రాహ్మణులచేతను, ఆత్మసంరక్షణార్థము క్షత్రియులచేతను, వ్యాపారార్థము వైశ్యులచేతను, ధర్మార్థకామములనిమిత్తము సామాన్యముగా సర్వజనులచేతను అధ్యయనము గావింపవలెనని యర్థము.

ఆయుర్వేదము వేదములనుండి పుట్టిన సనాతనధర్మమును పరిపాలించు శాస్త్రమగుటచే ఈ శాస్త్రమునందు అనుసరింపబడిన వర్ణాశ్రమధర్మములనుగూర్చి కొంత విశదముగ వ్రాయవలసి వచ్చినది.

సర్వభూతసమత్వమును, సర్వభూతహితత్వమును, సర్వలోకహితమును ప్రోత్సహించు ఆయుర్వేదము ఈ విషయమునందు ప్రపంచమునందలి ఇతర దేశముల వారికిని మతములవారికిని మార్గదర్శకముగ నుండగల దనుటలో సందేహము లేదు.

---

# 6-వ అధ్యాయము

## ఆర్థికస్థితి

[విషయసంగ్రహము: ఆర్థికస్థితి - దేశపరిపాలనము - యుద్ధపరికరములు - మహానదులు, తటాకములు - నౌకాయాత్రలు సామ్రాజ్యములు - వలసరాజ్యములు.]

ప్రస్తుతపు హిందూస్థానము యొక్క దరిద్రస్థితిని బట్టి ఈ దేశము అనాదినుండియు ఇట్లే యుండియున్నదని తలపరాదు. సృష్టికర్త సహజముగ సకల వైభవములను భారతమాతకు ప్రసాదించి యున్నాడు. ప్రపంచమునందు అన్ని దేశములకంటె ఫలవంతము లగు భూములు ఇచ్చటి నదీముఖములందు గలవు. ఏ శీతోష్ణస్థితి గావలసిన ఆ శీతోష్ణస్థితి కన్యాకుమారి మొదలు హిమాలయమువఱకు ఏదో యొకచోట చూడనగును. మొదటినుండియు వరహాలచెట్టు (Pegoda tree) అను పేరు ఈ దేశమునకే చెల్లినది. ప్రసిద్ధి జెందిన ఈ దేశమునకు వ్యాపారము నిమిత్తమై రోము, ఈజిప్టు మొదలగు ప్రాంతములనుండి మనకు చరిత్ర తెలిసినప్పటినుండియు రాకపోకలు గలవు. అందును ఆంధ్రులు మిక్కిలి యుత్సాహపూరితముగ తూర్పు, పడమరలు, మహాసముద్రములమీద వ్యాపారము చేసినట్లు చాలా నిదర్శనములు గలవు. ఆంధ్రుల నాణెములమీద ఓడ యొక్క చిత్తరువు ముద్రింపబడియుండెను. దేశమునందు పాలును, తేనెయు సమృద్ధిగా ప్రవహించుచుండెనను ప్రతీతి గలదు. తక్షశిలానగరమున ఆకాశమువలె నీల వర్ణముగల గాజు ఇటికలచే నిర్మింపబడిన వీథి దేవాలయము చుట్టునుండెనని ఇప్పుడు దృష్టాంతపూర్వకముగా నిరూపింపబడినది. ఈ గాజు ఇటికెలు $10\frac{1}{2}$ అంగుళముల పొడుగును,వెడల్పును, 1 అంగుళము, 2 వీసములు దళసరియు గలిగి స్వచ్ఛముగ ఒక వైపునుండి మఱియొకవైపునకు కాంతిని ప్రసరింప జేయునవిగా నున్నవి.

వీటి నమూనాలను పాట్నా మ్యూజియము నందును లండను మ్యూజియమునందును చూడనగును. భరతఖండమునందు సువర్ణాదిలోహము అన్నియు ఉపయోగించుచుండిరని వేదములనుండి తెలియుచున్నది. స్త్రీలు మనోహరములగు నగలను, జెలగల దుస్తులను నాజూకుగా ధరించుచుండిరి. వీరు పురుషులతో సమాన అధికారములను పొందియుండిరి. స్త్రీలలో కవులు, యుద్ధభటులు, వేదాంతులు గలరు. తమ ఇచ్ఛవచ్చిన పురుషులను యుక్త వయస్సు వచ్చిన తరువాత వివాహ మాడుచుండిరి. ఆ నాటికే ఈ దేశమందు హెచ్చు నాగరికత యుండెననియు ఆ కాలము అన్నివిధముల ఉత్తమమైన దనియు అప్పటినుండి క్షీణదశయేగాని అంతకంటె ఉత్కృష్ట దశ ఎప్పుడు లేదనియు కొంతమంది అభిప్రాయము. తరువాత ఒక్కొక శతాబ్దమునందు విదేశీయుల దండ యాత్రలచే ఎన్ని దెబ్బలు తిన్నను ఆర్య నాగరికత, ఆర్యసంప్రదాయములు అనేక వేలసంవత్సరముల తరువాత గూడ ప్రపంచమునం దంతటను గౌరవింపబడుచున్నవని చెప్పుటయందు ఉత్ప్రేక్ష లేదు.

## దేశపరిపాలనము

భరతఖండము పేరున కొక రాష్ట్రముగా నున్నను మొదటినుండియు అనేక రాష్ట్రములు చేరిన ఒక ఖండమువంటిది. స్వతంత్రములగు 56 రాజ్యములు ఇందు చేరియుండినవి. ఒక్కొక రాజ్యముయొక్క పరిపాలన పద్ధతి ఒక్కొక విధమున నుండును. సాధారణముగా ఒకరాజు, ఏడెన మండ్రి మంత్రులు గలిగి ప్రజాభిప్రాయమును పంచాయతీల మూలముగా తెలుసుకొనుచు రాజ్యములు చేయు సంస్థానములుగా ఉండెను. మహాభారతము నాటికి ఉత్తరమున బదరీనారాయణము మొదలు దక్షిణమున కన్యాకుమారి వఱకును, తూర్పున బ్రహ్మపుత్ర మొదలు పశ్చిమమున ఉర్ఘుంత పర్వతముల పరిసరములనుండు ద్వారవతి వఱకును ఆర్యావర్తము వ్యాపించి యున్నట్లును, అందు మధ్యదేశమను పేర గంగానదియొక్క ఉత్తరభాగము ఎక్కువ అభివృద్ధిలో నుండెననియు తెలియుచున్నది. ఆనాటికి పాటలీపుత్రముయొక్క పేరు బైటికి రాలేదు. ధర్మరాజు అశ్వమేధయాగమునకై దిగ్విజయము చేసి భరతవర్షమంతయు ఏకచ్ఛత్రాధిపత్యమునకు తెచ్చెను గాని ఆయా రాజులందరు తమతమ రాజ్యములను స్వతంత్రముగ నేలుకొనుచు నామకముగా సామ్రాట్టునకు ఏదో సూచనగా లోబడియుండునట్లు అంగీక

రించిరి. సామాన్యముగ రాజులకు వంశపారంపర్యపు హక్కు, అంగీకరింప బడినను అదిపర్వమునందలి పురువంశానుకీర్తనమును బట్టి ఒక్కొక దేశము నందు ప్రజలే రాజును, తమలో ఉత్తముడగు వానిని, ఎన్నుకొను పద్ధతి యుండెనని తెలియుచున్నది.

కొన్నిచోట్ల రాజు లేకుండగనే సంఘముఖ్యులగు పెద్దలు ఒక సంఘముగా నేర్పడి రాజ్యము చేయుచుండినట్లును గలదు. శాంతిపర్వ మందు మంత్రివర్గము రాజునకు సలహానిచ్చుటకై ఈ క్రింది ప్రకారము ఒక మహాసభ యుండవలెనని గలదు. నలుగురు బ్రాహ్మణులు, ఎనమండుగురు క్షత్రియులు, ఇరవైఒక్కమంది వైశ్యులు, ముగ్గురు శూద్రులు, ఒక సూతుడు ఈ ప్రకారము రాజుచే నెన్నుకొనబడినవారు సలహాసభగా ఏర్పడియుండవలెను.

## యుద్ధ పరికరములు

ఒక సేనాధిపతి అధికారము క్రింద "అనీకినీ," "చమూ", "పృతన", "వాహిని" అను పేర్లుగల పటాలములు ఒకటికంటె నొకటి పెద్దదిగా నుండవలెను. రథములు, ఏనుగులు, గుఱ్ఱములే గాక - నౌకాదళము, సేవక దళము, చారులు మొదలగు అంగములు కూడ సేనలో చేరియుండెను. యుద్ధమునందు ఒక్కొక్కరి కొక్కొక ధ్వజము ప్రకాశించుచుండును. మహాభారతయుద్ధమునాటికి శతఘ్నులు అనగా నూరుమందిని ఒక్కసారి చంపగల అగ్నియంత్రములు కూడా ఉండెనని తెలియుచున్నది.* సామాన్యముగా క్షత్రియులు మాత్రము యుద్ధభటులుగా నుండినను బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు కూడా సేనలో వీరులుగా చేరి యుద్ధము చేయుట ధర్మవిరుద్ధము గాదు. యుద్ధమునందు మరణించినవారల కందరకును వీరస్వర్గప్రాప్తి కలుగును. ఇట్లు సకలైశ్వర్యములతో తులతూగుచుండిన భరతఖండము కలియుగారంభమునకు ముందే అంతఃకలహములకు లోనై మహాభారతయుద్ధమున ప్రజానాశనముచే క్షీణించి శోభ తగ్గి, ఇప్పటికిని పూర్వపు ఔన్నత్యమును పొందలేదని చెప్పవచ్చును.

* Cultural Heritage of India; Vol I.

## నదులు, మహాతటాకములు

భారతదేశమునందు ఇప్పటికినీ నూటికి తొంబదిమంది వ్యవసాయముచే జీవింతురు. అందుకొఱకై వర్షపుజలము వృథా పోకుండా నదులకు అడ్డముగ సేతువులు గట్టి మహాతటాకములు సముద్రము లను పేర విరివిగ నిర్మించు ఆచారము ఈదేశమున మొదటినుండియు గలదు. అందు దక్షిణదేశమున చోళచక్రవర్తులు పశ్చిమసముద్రతీరమున కొండలనుండి తూర్పు సముద్రము చేరువఱకు ఎక్కడ నీటికి అక్కడ అడ్డములు కట్టి పరంపరగా ఒకచెఱువు నిండిన తరువాత దాని పొరులు క్రిందచెఱువునకు నడిపించుచు చివఱకు సముద్రమువఱకు వృథాగా నీరు పోకుండా వరుసగా నొకదాని క్రింద నొకటి చొప్పున తటాకములు నిర్మించి దేశ మంతయు ఫలవంతము చేసి, ఒక్కొక్క గ్రామమునకు ఎత్తుపల్లముల ననుసరించి కాలువలు త్రవ్వి "నీరు గంటీలు" అను ఉద్యోగులను ప్రతిగ్రామమునకు నిర్ణయించి నీటి పారుదల శాస్త్రీయముగా నుండునట్లు కట్టుదిట్టములు చేసిరి. ఈకళకు "జలసంసేతనసంహారణ" మని పేరు. ఇందుకొన్ని నదులు, కాలువలు నావికయాత్రికుకూడా ఉపయోగించుచు వ్యాపారాభివృద్ధికి తోడ్పడుచుండెడివి. వీటి నన్నిటిగుఱించి ఒక్కొక్క శీర్షిక క్రింద ఒక్కొక్క పుస్తకము వ్రాయనగును.

## నౌకాయాత్రలు, సామ్రాజ్యములు, వలసరాజ్యములు

ద్వీపాంతరములకు ఓడలమీద ప్రయాణము చేయుచు ధైర్యముగా అటు గ్రీసు, రోమ్ వఱకును ఇటు చైనావఱకును ఓడ ప్రయాణములు భారతీయులు చేయుచుండినట్లు నిదర్శనములు గలవు. "నావిగేషన్" (అనగా నావప్రయాణము) అను ఇంగ్లీషుపదము "నా" అను సంస్కృతపదము నుండి వచ్చినది. నా అనగా నావ. ఋగ్వేదమునందును, ఇతిహాసములందును, సంస్కృత, పాళీ, దేశభాషా గ్రంథములయందును విరివి యగు ఓడ వ్యాపారములు వర్ణింపబడియున్నవి.

సంస్కృతమునందు "యుక్తికల్పతరు"వను గ్రంథమునందు 27 రకముల ఓడల నిర్మాణములు వర్ణింపబడియున్నవి. 64 కళలలో "నౌకారథాదియానానాం కృతిః" అని ఇది ఒక కళగా వర్ణిల్లి యుండెను. 2300

టన్నులు బరువుగలిగి, 276 అడుగుల పొడుగును, 36 అడుగులు వెడల్పును, 27 అడుగుల ఎత్తును గలిగిన ఓడలు నదులలోను, సముద్రములలోను తిరుగుట కుపయోగపడుచుండునట్లు నిర్మింపబడియుండెను. "ఆంధ్రకుషాణ" చక్రవర్తుల కాలములో తూర్పుసముద్రమున హెచ్చుగ వ్యాపారము జరిగినట్లును క్రీ. శ. 75 వ సంవత్సరమునాటికి జావాలో భారతీయులు వలసరాజ్యములను నిర్మించినట్లును, సయాంకు చైనాలోని పసుపుసముద్రము, మణిల్లా, దక్షిణ అమెరికాదేశములలో ఆంధ్రులును, అరవవారును వలసరాజ్యములు ఏర్పరచినట్లును నిదర్శనములు గలవు. 1000 టన్నులమీది పరిమాణముగల ఓడలు వేలకొలది నడచుచుండెను. ఆపాయస్థితులందు జనసంరక్షణకొరకు 10 చిన్న పడవలను ఓడ చుట్టును వ్రేలాడగట్టబడి ప్రయాణికులు సుఖముగ నివసించుటకు ప్రత్యేకమైన గదులుగలిగి 700 మంది ప్రయాణికులను తీసికొని పోగలిగిన ఓడలు 13-వ శతాబ్దమున, అనగా ఐరోపాదేశీయులు బొత్తిగా ఈ వ్యాపారము ఎరుగని రోజులలో, హిందూస్థానమున నుండి యున్నట్లు "మార్కో-పోలో" అను నతడు వర్ణించెను. 17-వ శతాబ్దమున ఐరోపాదేశీయులు ఈ దేశమునకు వచ్చునప్పటికి వారి ఓడలు సాధారణముగా 270 టన్నులు ఉండెడివి. అప్పటివఱకు ప్రపంచమునందలి అన్ని ఓడలలోను హిందూస్థానపు ఓడలే పెద్దవని స్పష్టముగా చెప్పవచ్చును.

ఇంగ్లీషు ఓడలు 12 సంవత్సరములలోపల సాధారణముగా ఆరు ప్రయాణములలో చెడిపోవును. భావనగరు పట్టణమున (పట్టణము అనగా ఓడరేవు అని అర్థము) క్రీ. శ. 1550 లో నిర్మింపబడిన "దరియా దౌలత్" అను పేరుగల ఓడ, 1837 వ సంవత్సరమున అనగా 87 సంవత్సరములైన తరువాత ఇంకను పనిచేయుటకు తగినంత దృఢముగ నుండెనని రికార్డు కలదు.

ఈస్టిండియా కంపెనీవారి సామ్రాజ్యము అభివృద్ధి యైనకొలదిని, ఆయుర్వేదము వలెనే, భారత నౌకాయాత్రలును అడుగంటుటకు ప్రారంభించెను.

తుదకు భరతఖండమునందు తయారు కాబడు చేకు ఓడలకు ఇంగ్లీషు పడవలు సమానము కాజాలనందున 1814 సం||లో భారతీయ నావికులను భారతీయ ఓడలును ఇంగ్లండుకు చేరరాదని పార్లమెంటులో చట్టములు చేయబడెను. *

ఇంతకంటె ఘోరమగు అన్యాయము ఏమి గలదు ?

---

* గాంధిగ్రామ్- సింధియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ, లిమిటెడ్, 1941.

# 7వ అధ్యాయము

## ఆశ్రమ, గ్రామ, నగర, నిర్మాణము

[విషయసంగ్రహము:—వాస్తుశాస్త్రము - ద్వారక - మయ నిర్మిత మందిరము - అయోధ్య - హస్తినాపురము - క్రీడారంగము - ఇంద్రప్రస్థము - పాటలీపుత్రము - కాంచీపురము - శ్రీరంగము - మధుర - విజయనగరము - భారతదేశము గ్రామమయము - గ్రామాదుల యందలి వృత్తులు - పరిపాలనాధికారులు - నివాసయోగ్యాయోగ్య భూములు - భూభేదములు - ఆకారమును బట్టి గ్రామభేదములు - దుర్గములు - గృహరచన - వీథులు - గ్రామ సంభారములు - ఆశ్రమములు.]

### వాస్తుశాస్త్రము

ఇతరశాస్త్రముల కళలయందు వలెనే, వాస్తు శాస్త్రమునందు గూడ హిందూస్థానము ప్రపంచమునకు మార్గదర్శిగా నొప్పియున్నది. వాస్తుశాస్త్ర మనగా గృహ, నగరాదుల నిర్మాణ శాస్త్రము. నగరనిర్మాణ మనగా కొన్ని ఇండ్లను గుంపులు గుంపులుగా కట్టి వీథులకు వీథులను చేర్చుట కాదు. నగరనిర్మాణమునందు కొన్ని ఉన్నతమైన ఆదర్శములను మనస్సునందుంచుకొని, వాని కనుకూలముగా నుండునట్లు, ముందుగా నగరరచన (Town Planning) గావించి, యేయే ప్రదేశములందు ఏయే వీథులు, ఏయే మండపములు, ఉద్యానవనములు, తటాకములు, దేవాలయములు, క్రీడారంగములు, మొదలగునవి యెచ్చటెచ్చట నుండవలయునో నిశ్చయించుకొని, ఆ ప్రకారము నగరనిర్మాణము చేయుట, ఈ దేశమునందు మొదటినుండియు సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్నది. ఇట్టి నివాసస్థానములను నిర్మించుటకు తగిన ప్రదేశములను నిర్ణయించు విధానములు వాస్తుశాస్త్రగ్రంథములందు కలవు ఈ గ్రంథములలో ఇప్పటికిని కృష్ణవాస్తు, రత్నావళి, మయవాస్తు, శిల్పచింతామణి, శ్రీలలిత

నవరత్నము, మానసారము లనునవి కలవు. వీనియందేగాక, శుక్రనీతి, చరక, సుశ్రుతాది వైద్య గ్రంథములందును, ఈ విషయములు పెక్కుచోట్ల ఉదాహరింపబడియున్నవి. మత్స్యపురాణమునందు మిక్కిలి వివరముగా వర్ణింపబడియున్నవి. చరకులు ఆతురాలయములను, సూతికాగార, కుమారాగార నిర్మాణములను వర్ణించుచుపట్టున, "వాస్తువిద్యాకుశలః ప్రశస్త ఏవ" వాస్తువిద్యాకుశలురచే ప్రశస్తమని అంగీకరింపబడిన రీతినే కట్టవలయునని స్పష్టముగ దెలిపియున్నాడు. ప్రతియొక గ్రామాధికారి లేక నగరాధికారి స్వాధీనమున ప్రవీణు లగు వాస్తుశాస్త్రజ్ఞు లుండెడివారు.

గ్రామ నగరాదుల రచన అంతయు స్థాపాణార్హు లను ఆచార్యులును, గణితశాస్త్రవేత్తలును, శిల్ప శాస్త్రజ్ఞులును, వాస్తు విద్యా ప్రవీణులును, అను వివిధశాస్త్రములందు తగిన అనుభవము కలిగినవారి సహాయముతో, ఇండ్లయొక్కయు, వీధుల యొక్కయు తదితరములైన ఉద్యానవనాదుల నిర్మాణములు జరుగుచుండెడివి.

## ద్వా ర కా పు రి

శ్రీకృష్ణుడు ద్వారకను నిర్మించుటకు పూర్వము విశ్వకర్మ యను వాస్తుశాస్త్రవేత్తను పిలిపించి, ఫలానా విధమున దేవాలయములు, మందిరములు, తోటలు, రాజవీధులు మొదలగు వానిని నిర్మించవలె నని ఆజ్ఞాపించెననియు, అటుల ఆజ్ఞాపింపగా, శ్రీకృష్ణునిపద్ధతులమీద నగరనిర్మాణము గావించినయెడల, కొలది దినముల లోపలనే అధికమైన మార్పులు చేయవలసి వచ్చుననియు, స్థలము చాలదనియునని విశ్వకర్మ విన్నవించెననియు అయినను శ్రీకృష్ణుని అభిప్రాయ ప్రకారమే నగరము నిర్మింపగా, కొద్దికాలము లోపలనే ద్వారకాపురము అత్యధికముగా పెరిగిపోవుటచేత, తిరిగి నగరనిర్మాణము అనేకమార్పులతో చేయవలసివచ్చె నని దేవీపురాణమునందు గలదు.

## మ య ని ర్మి త మం ది ర ము

మహాభారతమున మయనిర్మితమందిరము లోకప్రసిద్ధ మైనది. నీళ్ళు గలచోట్ల నీళ్ళు లేనట్లును, నీళ్ళు లేనిచోట్ల, నీళ్ళు ఉన్నట్లును, తలుపులు లేనిచోట్ల తలుపులు ఉన్నట్లును, నిజముగా ఉన్నచోట్ల లేనట్లును, భీమ

కలుగునటుల సభామంటపమును విశ్వకర్మ నిర్మించినటులను, దుర్యోధనుడు ఈ మందిరమును ప్రవేశించినపుడు భ్రమచే, జలములేని ప్రదేశమునందు జల మున్నదని కట్టువస్త్రములను పైకెత్తుకొనెననియు, నిజముగా నీళ్ళున్నచోట్ల తెలియక నీళ్ళలో దిగి కట్టువస్త్రములను తడుపుకొనగా అది చూచి ద్రౌపది నవ్వెననియు మొదలగు కథ కలదు. ఈ కథ సత్యమై యుండవచ్చు ననుటకు నిదర్శనముగా తక్షశిలానగరమున త్రవ్వబడిన మందిరములలోని స్వచ్ఛమగు పలువర్ణముల గాజు ఇటుకనేలను చూచిన వారికి తెలియగలదు.

ఈ సధ్య మొహేంజదారో (మృతినొందిన వారి దిబ్బలు) అనెడి దిబ్బలనుండియు, హరప్పాలోను త్రవ్వగా బయలు వెడలిన ప్రాచీనపు కట్టడములు ఇంకను ఆశ్చర్యమును గొలుపుచున్నవి. ఈ పురాతన నగరముల యొక్క కట్టడములు, వానియందుగల మురుగునీటి పారుదల పద్ధతులు మొదలుగాగల విషయములు 17-వ పేజీలో 'ఇండ్లు' అనెడి శీర్షిక క్రింద వివరించియున్నాము. ఈ మురుగునీటి పారుదల సౌకర్యము కొరకై ఈ కాలమున పురపాలకసంఘములవారు లక్షలకొద్ది సొమ్ము ఖర్చుపెట్టి చేయుచున్నారనిన ఆశ్చర్యము లేదు. కాని, యేడెనిమిదివేల సంవత్సరములకు పూర్వమే-కొందరి చరిత్రకారుల అభిప్రాయప్రకారము వేదకాలమునకు పూర్వమే ఇట్టి నగరనిర్మాణము భరతఖండమున ఉండియున్నదనిన ఆశ్చర్యమే! ఈ పట్టణముల పేర్లేమియో, వానిని పరిపాలించిన రాజు లెవ్వరో, ప్రజలు ఎవరో, ఇప్పటికిని ఇంకా తెలియలేదు. ఆట్టి విషయములను తెలిసికొనుటకు చరిత్రకారులు పరిశోధనలు జరుపుచున్నారు.

మన ప్రాచీనగ్రంథములనుండియు, చరిత్రలనుండియు, అనేక నగరముల నిర్మాణ వివరములు తెలియుచున్నవి. వాని నన్నిటిని గురించి విపులముగా వ్రాయుటకు స్థలము లేకపోయినను, కొన్నిటిని గురించి మాత్రము తెలుపుచున్నాము.

## అయోధ్య

ఇది క్రీ. పూ. 8000 సంవత్సరముల నాటిది. దశరథుని పట్టణము. ఇది పన్నెండు యోజనముల (108 మైళ్ళు) పొడవును, మూడు యోజన

ముల వెడల్పును, కలిగి యుండెననియు, అనేకవిశాలమైన రాజవీధులును, చిన్న చిన్న మార్గములను కలిగి మందమై విస్తారమైన తలుపులతో గూడిన కోటగుమ్మములును, నగరము చుట్టును లోతైన పెద్ద అగడ్తయు, దాని చుట్టును సాలవృక్షముల వరుసలును గలిగియుండెనని వర్ణింపబడి యున్నది. కోటలోపల, ఏడు అంతస్థుల సౌధములు తీరులు తీర్చి కట్టబడెననియు, స్వచ్ఛమై తియ్యని మంచినీళ్ళు పట్టణమునకు ధారాళముగ లభించుచుండె ననియు, స్త్రీలకును పురుషులకును ప్రత్యేకమైన మందిరములు,ఆరామములు, ఉద్యానవనములు నుండి పట్టణము అలంకారముగ నుండెననియు వర్ణింప బడియున్నది.

## హ స్తి నా పు ర ము

ఇది క్రీ. పూ. 3000 సంవత్సరముల నాటిది. కౌరవ రాజధాని యగు ఈ పట్టణమును గూర్చి మహాభారతమునందు ఇటుల కలదు. నగరము మహా సముద్రమువలె రాజమందిరములతో నిండి, ఎత్తైన గోపురములు, ద్వార ములు ఆకాశమునందలి మేఘములవలె కనుపించుచున్నవనియు, పట్టణము లోపల నే నదులయందును, కోనేళ్లయందును, కృత్రిమారణ్యములయందును, ఆరామములయందును ప్రజలు విహరించుచుండిరనియు, జలక్రీడా గృహములు, తోరణములు, ధ్వజములతో నలంకరింపబడి మంగళకరముగ నుండెననియు, తోటలమధ్య, కృత్రిమజలయంత్రములనుండి నీళ్లు చిత్రవిచిత్రముగ చిమ్మబడుచుండెననియు, గోడలును, సౌధోపరిభాగము లును, పలు వర్ణములుగల సాలభంజికలచే నలంకరింపబడి యుండెననియు, ఎక్కడ చూచినను పుష్పజాతులు తమ సుగంధమును వెదజల్లుచు మిక్కిలి మనోహరముగా నుండెననియు, వర్ణింపబడియున్నది.

## క్రీ డా రం గ ము

యోధుల శక్తి సామర్థ్యములను పరీక్షించుటకై ద్రోణాచార్యుని రచనప్రకారము నిర్మింపబడిన క్రీడారంగము (Auditorium) కలదు. దీని నేల అంతయు చెట్లుపొదలు లేకుండ అద్దమువలె చదును చేయబడి అక్క డక్కడ నూతులను జలయంత్రములను కలిగియుండెననియు, ఇంకను స్త్రీ, పురుషులు ప్రదర్శన సమయములందు గూర్చొనుటకు ప్రత్యేకముగా శిబి కలు (ఆసనములు) రంగస్థలము చుట్టును కట్టబడి యుండెననియు వర్ణింప బడి యున్నది

## ఇంద్రప్రస్థము

ఇది పాండవుల పట్టణము. ఇది నాగలోకమందలి భోగవతీ పట్టణమునకు సమానముగా అన్నివిధములను నిర్మాణము గావింపబడినది. ఇందు ఎత్తైన మందిరముల గోపురములు, గరుడపక్షి రెక్కలవలె నిర్మింపబడిన బురుజులు చూడగా నివి ఆకాశమునందలి మేఘములవలె నున్నట్లు వర్ణింపబడినవి. పట్టణముచుట్టును కోటగోడలమీద శతఘ్నులును, ఇంకను పలువిధములగు యుద్ధసామగ్రిలు అమర్చబడియుండెను. నగరము వెలుపల అశోక, అమ్రి, కదంబ, లోధ్ర, అంకోల, నారింజ, చంపక, పున్నాగ, సాల, వకుళవృక్షములు బారులు తీర్చి పెంచబడియున్నవి. ఈ వృక్షములు తాము భరించు ఫలముల భారముచే వంగియున్నవనియు, విహారార్థము అద్దములవలె మెరయుచుండు క్రీడాగృహములును, లతావితానములును, కృత్రిమవనములును, స్ఫటికములవలె మెరయుచుండు నీటిచే నిండియుండు పెద్దపెద్ద చెరువులును, హంసలు, బాతులు, చక్రవాకములు మొదలగు పక్షుల మధురాలాపములతో కూడిన కోనేళ్లు సుగంధయుక్తమగు పద్మోత్పలములతో నిండియుండెననియు, ఇండ్ల ప్రాకారములలోకూడ, విహరించుటకు విశాలమగు ఉద్యానవనములను జలక్రీడాగృహములను కలిగి పట్టణమంతయు నెచ్చట చూచినను ఆరోగ్యవంతమై సంతోషపూరితమగు ముఖవికాసములు కలిగిన నాగరిక ప్రజలతోడను, వివిధదేశములనుండి వచ్చి కాపురమున్న వర్తకులచేతను విరాజిల్లుచుండెను.

## పాటలీపుత్రము

ఇది క్రీ. పూ. 300 సంవత్సరములనాటి మౌర్యచక్రవర్తియైన చంద్రగుప్తుని రాజధాని. ఈ నగరమునుగూర్చి మెగస్తనీస్ అనెడి గ్రీకురాయబారి యీ ప్రకారము వర్ణించియున్నాడు. "ఈ నగరమున ఇండ్లుగల భాగము పదిమైళ్ళపొడుగునను, రెండుమైళ్ళ వెడల్పును కలిగి గంగానదీ తీరమున నలుప్రక్కలను కందకములను కలిగియున్నది. ఈ కందకము 600 అడుగుల వెడల్పును, 45 అడుగులలోతును కలిగి కోటగోడ 570 గోపురములతోను, 64 ద్వారములతోడను నొప్పియుండెను." ఈపట్టణము చుట్టును కఱ్ఱతో కట్టబడిన గోడయును, వంతెనలును, ఇటీవల భూమిలో నుండి త్రవ్వబడినవి. పాట్నాకు ఒక మైలు దూరమున ఇప్పటికిని వీనిని

చూడనగును. "రాజమందిరము నగరమధ్యమునందుండి, ఆ యా వ్యాపారములకు తగినట్లుగా పౌరులసౌకర్యార్థము ఉపనగరములు రాజమందిరము చుట్టును యథానుకూలముగా నిర్మింపబడియున్నవి. ఎక్కడ చూచినను, రమ్యమగు తోటలకును, జలయంత్రములకును, మత్స్యములతో నిండియుండు కోనేరులకును లోటు లేదు."

## కాంచీపురము

పూర్వపు పట్టణములలో దక్షిణదేశమున మిగిలియుండి, ఇప్పటికిని ఆదర్శభూతముగ నున్న పురాతనపట్టణములలో కంచి, శ్రీరంగము, మధుర యెన్నదగినవి. వీనిలో కంచి పతంజలి కాలమునాటికే విఖ్యాతి జెంది నేటికిని "నగరేషు కాంచీ"అనెడి కీర్తిని కలిగియున్నది. ఇందలి విశాలమై రమ్యముగ నుండు వీథుల తీరుపులు చూచితీరవలెను.

## శ్రీరంగము

ఏడు ప్రాకారములు గలిగి, ఒక్కొక్క ప్రాకారములోపల ఒక్కొక్కనగర మమరినట్లు ఇముడ్చబడి కావేరీనదియొక్క రెండు శాఖల మధ్య జలదుర్గముగా నిర్మింపబడిన శ్రీరంగము ఒకవిధముగా ఆదర్శకనగరముగ నొప్పుచున్నది.

## మధుర

మధురానగము మిక్కిలి విశాలమై అతివిస్తీర్ణమగు మీనాక్షి ఆలయము చుట్టును, ఒక్కొక్క నెలకు ఒక్కొక్క ప్రదక్షిణ మార్గము చొప్పున చైత్ర, వైశాఖాదిమాసముల ననుసరించి ఆయా మాసముల నామముచే పన్నెండు వీథులు కలవు. ఆయా మాసములలో ఆయా వీథులందు దేవతోత్సవములు జరుగుచుండును. పాశ్చాత్యనగరనిర్మాణవేత్తలు ప్రాచీనభారత దేశమునందలి నగరరచన చూచి ఆశ్చర్యము నొందని వారు లేరు.

## విజయనగరము

క్రీ. శ. 1420-21 సంవత్సరములో ఈ పట్టణమునందుండిన "నికోలో" అనెడి ఇటలీ దేశపు ప్రయాణికుడును, క్రీ.శ. 1520-22 లలో ఈ పట్టణమునందుండిన "డామెంగోజ్ పై" అను పోర్చుగీసు దేశస్థుడును

ఈ నగరవైభవమును గొప్పగా నిటుల వర్ణించియున్నారు. ఈ నగరము అరువది మైళ్ళచుట్టుకొలత కలిగి, కోటకు వెలుపల అగడ్తయును, దానికి లోపల చాల ప్రదేశమువఱకు వరిచేలును, తోటలును, చెఱువులు, దాని లోపల తిరిగి రాతితో కట్టబడి గోపురయుక్తమైన ద్వారములు కలిగిన మరియొక (మూడవ) ప్రాకారమును, ఒకటి లోపల మరియొకటిగా పట్టణమును రక్షించుచుండెను. మూడవ ప్రాకారములోపల పోర్చుగీసు రాజధానియగు 'లిజ్బన్' పట్టణముననున్న అన్ని మందిరములకు ఎంతస్థలము పట్టునో అంతకంటె విశాలమైన ఖాళీప్రదేశము మధ్య, ఒక్క రాజమందిరముండెను. దానిచుట్టును ధనికులగు వర్తకులు రత్నములు, వజ్రములు, పచ్చలు, ముత్యములు, రాసులు రాసులుగా పోసి అమ్ముచుండు వర్తక మందిరములును, ప్రపంచమునందలి నానాదేశములనుండి వచ్చి దిగియున్న వస్త్రములను సమస్తాభరణములను విక్రయించుచుండెడి వర్తకుల ఇండ్లును, రాజమందిరముతో సమానముగా ప్రకాశించుచుండెననియు వర్ణించియున్నారు. పూలబజారులును, తమలపాకుల బజారులును మైళ్ళ కొలది పొడుగున నుండెనట. ఇంకొక ప్రాకారము లోపల శిల్పులును, చిత్రకారులును, తమతమ కళలను ప్రదర్శించుచుండిరి. ఒక్కొక్క వీథి యందు దేవాలయము లున్నను, ప్రధానమగు విరూపాక్ష దేవాలయము నగరము వెలుపల నదీతీరమున దట్టమగు అరణ్యమును పోలియుండు తోటలోపల నిర్మింపబడియున్నది.

ఇట్టి పట్టణముల శోభ ఎంత వర్ణించినను తనివితీరదు.

## * భారతదేశము గ్రామమయము

నాగరికత అను పదము నగరమునుండియే పుట్టినను, భారతీయ నాగరికతకు నిజముగా ఆలోచించిన, నగరములు కారణములు కావని స్పష్టము కాగలదు. మన నాగరికత అంతయు మన దేశమునందు వర్ధిల్లియున్న జ్ఞానవిజ్ఞానములు, కళలు అను పునాదులపై ఆధారపడి యున్నది.

భారతదేశమున వర్ధిల్లిన ఏడులక్షలకు మించిన గ్రామములు ఈ దేశముయొక్క సమస్తసంపదలకును ఆధారములైయున్నవి. ఇవి అన్నియు

---

* ఈ విషయమును గురించి 63 వ పేజిలో భరతఖండరచన అనెడి శీర్షకక్రింద కూడ చూడనగును.

ఒక్క సూత్రముపై నియమింపబడినవి గాని చిందరవందరగా పుట్టినవి గావని మనము గ్రహించవలెను.

## గ్రామాదులందలి వృత్తులు

ప్రతి గ్రామమునందును వ్యవసాయము, పశుపాలన సామాన్యమైన వృత్తులు. ప్రతిపురమునందును సామాన్యముగా శిల్పము మొదలైన కళలు వృత్తులుగా నుండును. ప్రతిపట్టణమునందును సామాన్యముగా వ్యాపారము వృత్తిగా నుండును. ప్రతినగరమునందును సామాన్యముగా రాజకీయోద్యోగములు ప్రజలవృత్తిగ నుండును. పురియందు కూడ నివియే సామాన్య వృత్తులుగ నుండును.

## పరిపాలనాధికారులు

ప్రతి గ్రామమునకును నాయకుడును, నూరు గ్రామములకు సామంతుడును, వేయి గ్రామములకు రాజును, పదివేల గ్రామములకు మహారాజును, రాష్ట్రమునకు చక్రవర్తియు, అధికారులుగా నుందురు.

## నివాసయోగ్యాఽయోగ్యభూములు

గ్రామాదులరచన గావించుటకు పూర్వము భూమియొక్క యోగ్యతాఽయోగ్యతలను పరీక్ష గావించి, తదుపరి యోగ్యమైన ప్రదేశములందే వానిని నిర్మించుచుండెడివారు.

ఆయుర్వేదశాస్త్రానుసారముగ భూదేశము జాంగలము, అనూపము, సాధారణము అని మూడు విధములు. ఇందు జాంగలము, సాధారణము లనునవి ఆరోగ్యవంతమైనవి. తెలుపువర్ణముగల భూమి ప్రథమతరగతిగను రక్తవర్ణము కలది రెండవ తరగతిగను, పసుపుపచ్చవర్ణము కలది మూడవ తరగతిగను, నలుపురంగు గలది నాలుగవ తరగతిగను ఎంచబడియున్నది. స్ఫుటితమైనట్టియు, సశల్యమైనట్టియు, వల్మీకయుతమైనట్టియు, విషమమైనట్టియు (Uneven) ఊసరక్షేత్రమైనట్టియు భూమి నివాసమునకయోగ్యముగ నెంచబడును. వాస్తురత్నావళి పదునారు రకముల భూమిని వర్ణించియున్నది.

## భూభేదములు

భూమియొక్క ఎత్తుపల్లములను బట్టి గజపృష్ఠము, కూర్మపృష్ఠము, మధ్యోష్ఠము, నాగపృషము అని నాలుగువిధములుగ నుండును. వీనిలో

మొదటి రెండును వాసయోగ్యమైనవిగ నెంచబడియున్నవి. భూమియొక్క వర్ణమును బట్టి బ్రాహ్మణ (శ్వేత), క్షత్రియ (రక్త), వైశ్య (పీత), శూద్ర (కృష్ణ) అని నాలుగువిధములుగను, మరియు విప్రభూమి మధురరసమును, క్షత్రియ వైశ్యభూములు కషాయరసమును, శూద్రజాతి భూమి కటు రసమును కలిగియుండునని తెలుపబడియున్నవి. భూపరీక్ష విధానములు పెక్కులు మత్స్యపురాణమునందును, ఇతరవాస్తుగ్రంథములందును వివరింపబడియున్నవి.

## ఆకారమునుబట్టి గ్రామభేదములు

ఆకారమునుబట్టి గ్రామములు, వృత్తము, సమస్థితము, భద్రాసనము, చక్రవాకము, దండాకారము, సర్పాకారము, కూర్మాకారము మొదలగు స్వరూపములను కలిగియుండును.

## దుర్గములు

రక్షణనిమిత్తము దుర్గములను నిర్మించునపుడు ఆయా స్థల నైసర్గిక స్వరూపమునుబట్టి భూదుర్గము (Under-ground fort), జలదుర్గము (Water fort), అద్రిదుర్గము (Hill fort), అని మూడువిధములును; ఆకారము ననుసరించి మహేంద్ర ( Quadrangular), సర్వతోభద్ర (Square) సింహావలోకన (Oval), నందదుర్గ (Triangular), నంద్యావర్త (Star shaped), అష్టదళ (Octogonal), పురుషాకార (Like a +), ములని యేడువిధములును వర్ణింపబడినవి.

గ్రామములు సాధారణముగా వాని విస్తీర్ణము ననుసరించి గ్రామమనియు (Village Unit), ఖర్వటమనియు (Taluk town or Capital for 200 Villages) ద్రోణముఖమనియు (Capital for 400 Villages) పట్టణమనియు నగర మనియు ఐదువిధములుగ నుండునటుల తెలుపబడియున్నది.

## గృహరచన

పూర్వకాలమునుండియు, చతుశ్శాల పద్ధతి ననుసరించి గృహనిర్మాణము గావించుట మన దేశమునం దాచారమై యున్నది. ప్రతి గృహమును ప్రధానముగ బాహ్యగృహమనియు, అంతరగృహ మనియు రెండుగ

విభజన గావింపబడి ప్రత్యేకప్రత్యేకములైన గదులను ప్రత్యేక కార్యముల నిమిత్త ముపయోగించుటకు దగినటుల నిర్మించెడివారు. ప్రతి గృహము నందును, ఆయా వర్ణభేదము ననుసరించి సూతికాగారముకూడ నిర్మింపబడు చుండినటుల చరక సుశ్రుతాది గ్రంథములనుండి తెలియుచున్నది. "ప్రాగ్ద్వారంవా దక్షిణద్వారంవా"అని సుశ్రుతులు తెలిపినటుల తూర్పు ద్వారములును, దక్షిణద్వారములును నుండుట ప్రశస్తమని తెలియగలదు.

భవననిర్మాణమును గురించి "తత్ర భవనం అసన్నోదకం, వృక్షవాటి కావత్, విభక్త కర్మకక్షః ద్విధా వాసగృహం కారయేత్" అనగా అందు బాటులో నీరును, వృక్షవాటికలును కలిగి ఆయా పనులకు తగినట్లు విభజింప బడిన గదులతో కనీసము రెండు విభాగములైనను కలిగియుండునట్లు కట్ట వలెనని వాత్స్యాయనమునందు కలదు.

## వీధులు

ప్రతి గ్రామమునందును నూరు అడుగుల వెడల్పుగల రాజవీధియు ఆ వీధిని మధ్యభాగమందు కలియు చిన్నదైన అరువది అడుగుల వెడల్పుగల వామనవీధియు, వీధియొక్క ప్రతిచివరను ద్వారములును (Gates), రాజ వీధి, వామనవీధి కలియుచోట, గ్రామవిషయములను పరిష్కరించుటకు బోధివృక్షమును, గ్రామముచుట్టును మంగళవీధియు నుండెడివి. రాజవీధి తూర్పు పడమరలుగను, వామనవీధి ఉత్తర దక్షిణముగను నుండును.

## గ్రామసంభారములు

మరియు ప్రతిగ్రామమునందును,

కం. అప్పిచ్చువాడు వైద్యుడు
ఎప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుడున్
జొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూరఁ జొఱకుము సుమతీ.

అనినట్లు కనీసము ఒక ధనికుడును, ఒక వైద్యుడును, స్నానపాన ములకు నెల్లపుడును ప్రవహించుచుండెడి ఒక ఏరును, ఒక గురుకులమును ఉండవలెను.

# ఆ శ్ర మ ము లు

జనసంకీర్ణమగు గ్రామ పట్టణాదులు గాక, రమ్యములగు నదీతీరము లందును, అటవీప్రదేశము లందును, తృణధాన్య, జల, కాష్ఠసమృద్ధి గలిగి, ఆరోగ్యవంతమైన స్థలములలో పట్టణములకు అనతిదూర మున, ఏకాంతప్రదేశములలో, ప్రజల ప్రోత్సాహముచే ఋష్యా శ్రమములు నిర్మింపబడుచుండెడివి. ఒక ఆశ్రమమునం దొక గురువును, అతని కుటుంబమును శిష్యసహితముగా నివాసము చేయుచు, నిరాడంబర మైన జీవితమును గలిగి, జ్ఞానసంపాదనము, విద్యావ్యాప్తియే తమ ఆదర్శ ములుగా నెంచుకొని సర్వశాస్త్రములును, సర్వకళలును, వృద్ధిజెందుటకు, ఈ దేశమున ఈ ఋషులు తోడ్పడియుండిరి. అన్ని విద్యలకును అన్నివర్ణ ముల వారికిని "వర్ణానామ్ బ్రాహ్మణో గురుః" అను నటుల ఈ ఋషులే ఆచార్యులుగా నుండిరి.

ఇటుల నగరములకు ఆశ్రమములచేతను, ఆశ్రమములకు నగరముల చేతను గలిగిన తోడ్పాటువలన ఐశ్వర్యమును, జ్ఞానమును సమానముగా మన దేశమున అభివృద్ధి చెందుచు వచ్చెను.

ఈ ఆశ్రమ గ్రామ, నగరముల వైభవము పదునేను పదునెనిమిది శతాబ్దములవరకును అవిచ్ఛిన్నముగా వృద్ధిచెందుచు, వచ్చి, పాశ్చాత్యుల వ్యాపారము మన దేశమున అభివృద్ధి చెందుట కారంభించిన కాలదిని యథార్థమైన భారతీయనగరరచన క్రమముగా నశించి, అక్కడక్కడ వంకర టింకరలుగా, ఎవ్విధమైన వాస్తుశాస్త్రనిర్ణయములు లేక కట్ట బడిన యిండ్లును, గుడిసెలును మిగిలి, కడు విచారకరమైన దృశ్యములుగా నేటికి శేషించి యుండుట మిక్కిలి విషాదకరము.

---

# 8-వ అధ్యాయము

# విద్యలు - కళలు

[విషయసంగ్రహము - విద్యలు, కళలు - విద్యలకును కళలకును భేదము - విద్యలవలనను, కళలవలనను ప్రయోజనము - ప్రాణైషణ-ధనైషణ - పరలోకైషణ - 32 విద్యలు - చతుష్షష్టి మూలకళలు - కర్మాశ్రయములు - ద్యూతాశ్రయములు - శయనోపచారములు - ఉత్తరకళలు - శుక్రనీతిసారప్రకారము చతుష్షష్టి కళలు - గాంధర్వవేదమునకు సంబంధించినవి - ఆయుర్వేదమునకు సంబంధించినవి - ధనుర్వేదమునకు సంబంధించినవి - ఇతరములు - కళావిదుల చతుష్షష్టి కళలు - చికిత్సయందు కళల ప్రయోజనము - ఆయుర్వేద సహాయకళలు - ఆయుర్వేద అంగకళలు ఔషధకల్పనకళ - అంగకళలు - శిల్పకళ, చిత్రలేఖనము - శిల్పకళయందు ప్రాచీనాంధ్రుల ప్రావీణ్యము.]

"విద్యా హ్యనంతాశ్చ కలా స్సంఖ్యాతుం నైవ శక్యతే"

విద్యలు అనంతములు. కళలు అసంఖ్యములు.

ఇందులో 32 విద్యలు, 64 కళలు ముఖ్యము లని శుక్రనీతిసారము, వాత్స్యాయన కామసూత్రములు మొదలగు గ్రంథములలో చెప్పబడియున్నది.

## విద్యలకును, కళలకును భేదము

ఏది చదివి నేర్చుకొనబడునదో అది విద్య యనబడును. ఏది చదువు లేక పోయినను, మూగవాడైనను అభ్యాసముచే నేర్చుకొనుటకు సాధ్యమగునో అది కళ యనబడును. ఇది విద్యలకును, కళలకును గల ముఖ్య భేదము.

## విద్యలవలనను, కళలవలనను ప్రయోజనము

విద్యలవలనను, కళలవలనను ప్రయోజనమేమి? జీవితపరమార్థము లైన ధర్మార్థ కామములను సాధించుటకు మనుష్యమాత్రుడు తగు ప్రయత్నము చేయవలెను, లేనియెడల పశువుతో సమానమని చెప్పబడెను. పశువునకు నాలుగుకాళ్ళు, మనుష్యునకు రెండేకాళ్ళు, ఇంతే తేడా. విద్యల వలన జ్ఞానము అభివృద్ధియై ప్రాణరక్షణోపాయములను తెలుసుకొనుట, ధనము సంపాదించు సామర్థ్యముగలిగి సుఖముగ జీవించుట, తత్త్వజ్ఞానముచే మోక్ష ప్రాప్తిని పొందుట అని మూడు ప్రయోజనములు కలవు. వీనికి - ప్రాణైషణ, ధనైషణ, పరలోకైషణ లని మూడు సాధనములు చెప్పబడియున్నవి.

1. ప్రాణైషణ:—జీవిత పరమార్థములను సాధించుటకు రోగములు లేకుండ తనప్రాణమును కాపాడుకొనుట అవసరము. రోగపీడితుడైనచో ధనమున్నను ప్రయోజనములేదు. అన్ని సంపత్తులును వ్యర్థములే.

2. ధనైషణ:—బొత్తిగా ధనము లేనివాడు ఆరోగ్యమును కాపాడుకొనుటయు కష్టమే. కటికిదరిద్రుడై జీవించుటకంటె మరణమే మేలు. అందుచేత "సతాం అవిగర్హితాని కర్మాణి" ఎల్లప్పుడును సమానులలో గౌరవముగా జీవించుటకు తగినవృత్తులచే ధనార్జనోపాయములను వెదుకవలెను. అందుకొఱకై స్వధర్మమునుబట్టి కృషి, పశుపాలనము, వాణిజ్యము, రాజసేవనము మొదలగు సుఖజీవనోపాయములు సంపాదించుకొనవలెను. ఇందునిమిత్తమై ఇన్నివిద్యలును, ఇన్నికళలును ఏర్పడియున్నవి.

3. పరలోకైషణ:—ప్రాణైషణ ధనైషణములను సంపాదించిన పిమ్మట పరలోకైషణ అనగా ప్రత్యక్షప్రమాణముచే తెలుసుకొనరాని పునర్జన్మవిషయమును గుఱించి ప్రయత్నించి తెలుసుకొనుట అవసరము. దీనికి అధ్యాత్మవిద్య యని పేరు.

## 32 విద్యలు

వేదములు: 4 — 1. ఋగ్వేదము, 2 యజుర్వేదము, 3 సామవేదము, 4 అథర్వవేదము.

ఉపవేదములు: 4 — 5 ఆయుర్వేదము, 6 ధనుర్వేదము, 7 గాంధర్వవేదము, 8 తంత్రములు.

వేదాంగములు: 6 — 9 శిక్ష, 10 వ్యాకరణము. 11 కల్పము 12 నిరుక్తము, 13 జ్యోతిషము, 14 ఛందస్సు

శాస్త్రములు: 5 — 15 మీమాంస, 16 తర్కము, 17 సాంఖ్యము 18 వేదాంతము, 19 యోగము.

ఇతరములు: 13 — 20 ఇతిహాసము, 21 పురాణము, 22 స్మృతి, 23 నాస్తికమతము, 24 అర్థశాస్త్రము, 25 కామశాస్త్రము, 26 శిల్పశాస్త్రము, 27 అలంకారము, 28 కావ్యము, 29 దేశభాష, 30 స్వరోక్తి, 31 యవనమతము, 32 దేశాది ధర్మశాస్త్రములు; అని ఇటుల విద్యలు 32 కలవు,

## చతుష్షష్టి మూలకళలు

కర్మాశ్రయము లగు కళలు ఇరువదినాలుగు:— 1. గీతము, 2 నృత్యము, 3 వాద్యము, 4 కౌశలలిపి పరిజ్ఞానము, 5 ఉదారవచన రచన, 6 చిత్రవిధి, 7 పుస్తకర్మ, 8 పత్రచ్ఛేద్యము, 9 మాల్యవిధి, 10 గంధయుక్తాస్వాద్యవిధానము, 11 రత్నపరీక్ష, 12 సీవనము (కుట్టుపని), 13 రంగపరిజ్ఞానము, 14 ఉపకరణక్రియ, 15 మానవిధి, 16 అజీవజ్ఞానము, 17 తిర్యగ్యోని చికిత్సితము, (పశువైద్యము), 18 మాయాకృత పాషండజ్ఞానము, 19 క్రీడా కౌశలము, 20 లోకజ్ఞానము, 21 వైచక్షణ్యము, (ఇంగితము తెలుసుకుట), 22 సంవాహనము, 23 శరీర సంస్కారము, 24 విశేష కౌశలము.

ద్యూతాశ్రయము లగు కళలు ఇరువది:— ద్యూతాశ్రయములు అనగా పందెముతో కూడినవి. అందు నిర్జీవములు పదునైదు, సజీవములు ఐదు. 25 ఆయుఃప్రాప్తి, 26 అక్షవిధానము, (పాచికలను ఆడుట), 27 రూపసంఖ్య, 28 క్రియామార్గణము, 29 బీజగ్రహణము, 30 నయజ్ఞానము, 31 కరణాదానము, 32 చిత్రాచిత్ర విధి, 33 గూఢరాశి, 34 తుల్యాభిహారము, 35 క్షిప్రగ్రహణము, 36 అనుప్రాప్తి లేఖస్మృతి, 37 అగ్నిక్రమము, 38 ఛలవ్యామోహము, 39 గ్రహగానము, (ఇంతవఱకు

నిర్జీవములు) 40 ఉపస్థానవిధి, 41 యుద్ధము, 42 రుతము, 43 గతము, 44 నృత్తము; ఇవి సజీవములు. వీని వివరములు ఇంకను చక్కగా తెలియుటలేదు.)

శయనోపచారము లగు కళలు పదునారు:— 45 పురుష స్వభావ గ్రహణము (పురుషుని భావమును గ్రహించుట) 46 స్వరాగ ప్రకాశనము (తనకు గల అనురాగమును ప్రకటించుట) 47 ప్రత్యంగ దానము, 48 నఖదంతయోః వ్విచారౌ (నఖ, దంతవిచారములు) 49 నీవీ స్రంసనము (బొడ్డుముడి జారుచుట) 50 గుహ్యాసంస్పర్శన అనులోమ్యములు (సంభోగము) 51 పరమార్థ కౌశలము, 52 హర్షణము, 53 సమానార్థతాకృతార్థతలు. 54 అనుప్రోత్సాహనము (తిరిగి సంభోగమునకు ప్రోత్సహించుట) 55 మృదుక్రోధ ప్రవర్తనము (ప్రణయ కోపము) 56 సంయక్రోధనివర్తనము, 57 క్రుద్ధప్రసాదము (కోపము తీర్చుట) 58 సుప్తపరిత్యాగము, (నిద్ర పోగొట్టుకొనుట) 59 చరమస్వాపవిధానము (తుదకు నిద్రించుట) 60 గుహ్యాగూహనము (వస్త్రధారణము).

ఉత్తరకళలు నాలుగు:—61 అశ్రుపాతం రమణాయ శాపదానం (కంటతడి బెట్టుకొని రమణుని శపించుట, లేక తిట్టుట) 62 స్వశపథక్రియ (తన్ను తాను తిట్టుకొనుట) 63 ప్రస్థితానుగమనము (వెంటనంటి పోవుట) 64 పునః పునః నిరీక్షణము (తిరిగి, తిరిగి చూచుట.)

## శుక్రనీతిసారప్రకారము చతుష్షష్టి కళలు

గాంధర్వవేదమునకు సంబంధించినవి 7:— (1) నృత్యము (2) వాద్యము (3) వస్త్రాలంకారసంధానము (4) అనేకరూపావిర్భావకరణము (5) శయ్యాస్తరణాది సంయోగములు గల పుష్పాదిరచన (6) ద్యూతక్రీడ (7) అనేకములగు ఆసనసంధానముతో కూడిన రతి జ్ఞానము.

(2) ఆయుర్వేదమునకు సంబంధించినవి 10: (174 పేజీ చూ.)

(3) ధనుర్వేదమునకు సంబంధించినవి: 5— (1) శస్త్రసంధానము (2) మల్లయుద్ధము (3) లక్ష్యయంత్రమునందు శస్త్రనిపాతము (4) వాద్యసంకేతమునందు శస్త్రనిపాతము (5) గజ, అశ్వ, రథగతులతో యుద్ధము.

(4) ఇతరములు 42—(1) ఆసనముద్రాదికళ (2) గజాశ్వాది సారథ్యము (3) మృత్తికా భాండక్రియ (4) కాష్ఠభాండక్రియ (5) పాషాణ భాండక్రియ (6) సువర్ణాదిధాతు భాండక్రియ (7 చిత్రాద్యాలేఖనము (8) తటాకవాపీప్రాసాద సమభూమిక్రియ (9) ఘటాది యంత్రాణాం వాదనము (10) వస్త్రరంజనము (11) జల,వా,య్వగ్ని నిరోధము(12)నౌకా రథాదియానానాంకృతి (13) సూత్రాది రజ్జుకరణము (14) పటబంధము (గుడ్డలను నేయుట) (15) రత్నవేధ (రత్నములకు రంధ్రములుచేయుట) (16) స్వర్ణాది వస్తువిజ్ఞానము (17) కృత్రిమస్వర్ణరత్నాదిక్రియ (18) స్వర్ణాది అలంకారకృతి (19) చర్మమార్దవక్రియ (20) చర్మనిర్హారక్రియ (తోళ్ళు తీయుట) (21) దుగ్ధదోహనాది విజ్ఞానము (పాలు పితుకుట మొదలు నెయ్యిచేయుట వఱకు) (22) కంచుక సీవనము (చొక్కాలు కుట్టుట) (23) జలతరణము (ఈదుట) (24) గృహభాండాది మార్జనము (పాత్రలకు మెరుగుబెట్టుట) (25) వస్త్రసమ్మార్జనము (26) క్షురకర్మ (27) తిలవీరం డాది స్నేహకర్మ (28) కర్షకజ్ఞానము (దున్నుట) (29) వృక్షరోహణము (చెట్లను ఎక్కుట) (30) మనోనుకూల సేవాజ్ఞానము (31) తృణవేణు పాత్రకర్మ (మేదరిపని) (32) కాచవస్తురచన (గాజువస్తువులు చేయుట) (33) జలసంసేచన సంహరణ (నీరుగంటి) (34) లోహాది శస్త్రకృతి జ్ఞానము (35) ఝూల్ చార్జ్యామా (జీనులు) కుట్టుట (36) శిశుసంరక్షణ (37) శిశుక్రీడనము (పిల్లలను ఆడించుట) (38) అపరాధిశిక్షణము (తలారి) (39) నానాదేశీయధర్మాణాం సమ్యగ్లేఖనం (చరిత్ర రచన) (40) తాంబూలరక్షాదికృతి (కిల్లీలు కట్టుట) (41) ఆదానాశుకారిత్వం (పుచ్చుకొనుటలో శీఘ్రత్వము) (42) ప్రతిదానం చిరక్రియ (ఇచ్చుటలో ఆలస్యము). మొత్తము. 64

## కళావిదుల చతుష్షష్టి కళలు

1 ఇతిహాసము. 2 ఆగమము, 3 కావ్యరచన, 4 అలంకారరచన, 5 నాటకరచన, 6 గాయకత్వము, 7 కామశాస్త్రము, 8 ద్యూతము, 9 దేశ భాషాది విజ్ఞానము, 10 వివిధ లిపికర్మ, 11 వాచికము, 12 అవధానము, 13 స్వరశాస్త్రజ్ఞానము, 14 శకునశాస్త్రము, 15 సాముద్రికము, 16 రత్న శాస్త్రము. 17 రథాశ్వ, గజ, ఆరోహణాది కౌశలము, 18 మల్లయుద్ధము,

19 పాకశాస్త్రము, 20 వృక్షదోహదము, 21 గంధవాదము, 22 ధాతువాదము, 23 ఖనివాదము (గనులు తెలియు శాస్త్రము) 24 రసజ్ఞానము (పాదరస విజ్ఞానము) 25 జలతరంగిణి, 26 అగ్ని స్తంభనము, 27 ఖడ్గస్తంభనము, 28 జల స్తంభనము, 29 వాక్స్తంభనము, 30 వయఃస్తంభనము. 31 వశ్యకర్మ, 32 ఆకర్షణము (జూదము) 33 మోహనము (స్మృతిలేకుండ చేయుట) 34 మారణము (చంపుట) 35 విద్వేషము (క్రోధములు పుట్టించుట) 36 ఉచ్చాటనము (దయ్యములను తోలుట) 37 కాలవంచనము, 38 ప్లవనము (నీళ్ళలో తేలియుండుట) 39 పాదుకా శుద్ధి, 40 వాక్సిద్ధి, 41 ఘటికాశుద్ధి, 42 ఐంద్రజాలము, 43 అంజనము, 44 పరదృష్టి వంచనము, 45 స్వరవంచనము, 46 మణిమంత్రసిద్ధి, 47 ఔషధసిద్ధి, 48 చోరకర్మ 49 చిత్రక్రియ 50 లోహక్రియ. 51 శిలాక్రియ, 52 మృత్క్రియ, 53 దారుక్రియ, 54 వేణుక్రియ 55 చర్మ కర్మ, 56 వస్త్రరచన, 57 అదృశ్యకరణి 58 దూతికరణి, 59 వేట 60 వాణిజ్యము, 61 పశుపాలనము, 62 కృషి, 63 ఆసవకర్మ, 64 లావక, కుక్కుట మేషాది యుద్ధకరణ కౌశలము.

## చికిత్సయందు కళల ప్రయోజనము

ఈ విద్యలు కళలలో ఆయుర్వేదమునకు యెక్కువగా సంబంధము గలవి కొన్ని కలవు. దర్శనములు మొదలగు విద్యలు జ్ఞానరూపమగు మానసిక వికాసమును గలుగజేయునవిగనుండును. కళలలో పెక్కులు చికిత్సా సాధనములుగా నుపయోగపడునవి గలవు. కళలు జ్ఞానాశ్రయములు, కర్మాశ్రయములు మాత్రమే గాక, క్రీడా విహారములందు ఉపయోగపడునవి మరికొన్ని కలవు. ఇట్టి కళలు ద్యూతాశ్రయము లనబడును. వీనిని మానసిక రోగచికిత్సలందును, రాజయక్ష్మ మొదలగు శారీరక వ్యాధుల చికిత్సలందునుగూడ ఆయుర్వేద వైద్యమునందు ఎక్కువగా నుపయోగించియున్నారు.

ఈ కళలన్నియు ఆయుర్వేదసహాయకకళ లనియు, ఆయుర్వేద అంగకళలనియు, ఔషధాదికల్పన లేక చికిత్స అను ప్రధానకళ అని మూడు విధములుగా విభజించి వర్ణించియున్నాము.

## i. ఆయుర్వేద సహాయకకళలు

కర్మాశ్రియములగు గీతములు, నృత్యములు, వాద్యములు మొదలగునవి ఆతురాయములలోగూడ చికిత్సకు సహాయభూతనులుగా ఉపయోగపడుచుండునట్లు చరక ఉపకల్పనీయాధ్యాయమునందు వివరింపబడినది.

నా సలహాపైని మేదోవృద్ధికి చికిత్సగా స్త్రీలకు నృత్యమును ఉపయోగించి చక్కని లాభము పొందినవారిని చూచి యున్నాను. వాద్యమును సంగీతమును క్షయవ్యాధిలో శ్రీమంతుల అనుదినచికిత్సయందు ఉపయోగించి హెచ్చులాభమును పొందియుండుట చూచియున్నాను.

చికిత్సఅంతయు రెండువిధములుగా విభజించియున్నారు. మొదటిది లంఘనచికిత్స, రెండవది బృంహణచికిత్స.

రోగుల మానసోల్లాసమునకై ఉపయోగించు కళలలో ప్రహేళిక, పుస్తకవాచకమ్, శుకశారికాప్రలాపము, మేషకుక్కుట లావకయుద్ధములు మొదలగునవి పరిచారకులు అభ్యసింపవలెను. ఉత్సాదన (ఒళ్ళునలచుట) సంవాహన (ఒళ్ళుపట్టుట) కేశమర్దన (తలంటుట) కౌశలము స్నేహస్వేద కర్మలయందు ఆయావ్యాధుల చికిత్సాప్రణాళికయందు చక్కగ వర్ణింపబడియున్నవి. ఇట్లే బృంహణకర్మ క్రీడాదుల మూలమునను విరామపూర్వకముగను, లంఘనకర్మ ఆయావ్యాధులకు తగినట్లు వ్యాయామాదుల పూర్వకముగను చికిత్సింపవలసియుండును. వాస్తువిద్య, శయనరచన, తర్కు (బట్టలు నేయుట) తక్షణకర్మ (వడ్రింగము) లు మొదలగు కళలుగూడ ఆయా కళలయందు కుశలురగువారలచే చికిత్సాలయములలో ఉపయోగింపబడును. ఇంకను వృక్షాయుర్వేదము ఆయుర్వేదముయొక్క ముఖ్యాంగమే నని చెప్పవలెను.

### ఆయుర్వేద అంగకళలు: 10.

ఇవిగాక (171వ పుట చూ.):—(1) మకరంద ఆసవ మద్యాదీనాం కృతిః (2) శల్యమూలాహృతి శిరావ్యధ జ్ఞానము, (3) పానాది రస సంయోగ అన్నాది సంపాచనము, (4) వృక్షాది ప్రసవారోపణ పాలనాది కళ (5) పాషాణధాత్వాదిహృది (రాళ్ళనుండి లోహములను తీయుట), 6) భస్మీకరణము (7) ఇక్షువికారాణాం కృతి కళ, (8) ధాతుసాంకర్య

పార్థక్యకరణము (సువర్ణాది ధాతువులను కలుపుట, మణుల విడదీయుట), (9) ధాత్వాది సంయోగాత్ పూర్వవిజ్ఞానము, (10) క్షారనిర్వాసనము (క్షారములను చేయునేర్పు) ఇవి అన్నియు ఆయుర్వేదమునందు అంగములుగా నుండిన కళలు.

## 3. ఔషధ కల్పనకళ

చికిత్సగూడ "జ్వరాదిరోగ శాంత్యర్థం ఔషధాదిక్కృతిః కళా" అని జ్వరాది రోగశాంతికొఱకు చతురతతో ఔషధాది కల్పనము గూడ ఒక కళగా వర్ణింపబడినది. ఇట్లు ఆయుర్వేదము వేదముల కుపవేదము. శాస్త్రములలో అనేకశాస్త్రసార మగు గొప్ప శాస్త్రము. కళలలో అనేక కళలను అంగములుగా కలిగిన ప్రధానకళ. దేశమునందు సంపత్తును వృద్ధి చేయు వ్యాపారములలోగూడ ముఖ్యమైనది. ఈప్రకారము ఏ రీతిని చూచినను దేశముయొక్క జ్ఞానమునకు సంపత్తునకు మూలాధారమైన ఈశాస్త్రము, ఈ కళ, ఈవృత్తి, ఈవ్యాపారము, ఈమోక్షజ్ఞానమార్గము, రాజులచేతను ప్రజలచేతను ఆదరింపబడిన దని చెప్పుటయందు ఆశ్చర్య మేమియు లేదు.

చంద్రుడు కళావిహీనుడైనచో ఎట్లు ప్రకాశించడో అట్లే విద్యావంతుడుగూడ కళావిహీనుడైనచో ఆ కళ రాణించదు.

ఈ ఆయుర్వేదకళ మనదేశమున పాతుకొనిపోయినది. భార్యాధికరణమునందు ఇంటి ఇల్లాలు చేయవలసిన విధులలో ఇతర పనులతో బాటు గృహవైద్యముగూడ ఆమె తలమీద పెట్టబడినది. "తథా లవణస్నేహయోశ్చ గంధద్రవ్య కటుకభాండౌషధానాం చ దుర్లభానాం భవనేషు ప్రచ్ఛన్నం నిదానమ్. *

సైంధవాది పంచలవణములు, నెయ్యి, నూనె, వస, మజ్జ మున్నగు స్నేహద్రవ్యములు; అగరు, చందనము మొదలగు గంధద్రవ్యములు, శుంఠీ, పిప్పలి, మిరియాలు మొదలగు కటుకద్రవ్యములను; యంత్రములను, దశమూలాది ఓషధులను; అప్పటికప్పుడు దొరకనట్టి దుర్లభములగు ఇతర ఓషధులను గృహమునందు గోప్యముగ నుండుచోటులయందు గృహిణి దాచి యుంచవలెను.

---

* వాత్స్యాయన కామసూత్రములు 4-1-28.

మూలక, ఆలుక, పాలంకి, దమనక, అమ్రాతక, ఏర్వారుక త్రపుస, వార్తాక, కూష్మాండ, అలాబు, శూరణ, శుకనాస, స్వయంగుప్త తిలపర్ణిక, అగ్నిమంథ, లశున, పలాండు ప్రభృతీనాం, సర్వౌషధీనాంచ బీజగ్రహణం కాలేవాపశ్చ. *

మూలక = ముల్లంగి, ఆలుక = పెండలము లేక బంగాళాదుంప, పాలంకి = పాలకూర, దమనక = దవనము, అమ్రాతక = పుల్లమామిడి, ఏర్వారుక = దోస, త్రపుస = ముల్లుదోస, వార్తాక = వంకాయ, కూష్మాండ = గుమ్మడికాయ, అలాబు = అనపకాయ, శూరణ = కంద గడ్డ, శుకనాస = తెల్ల అవిసెచెట్టు (కొందరు దుండిలపుచెట్టు అందురు) స్వయంగుప్త = దూలగొండి, తిలపర్ణిక = గుమ్మడిచెట్టు, అగ్నిమంథ = కూరనెల్లి, లశున = వెల్లుల్లి, పలాండు = నీరుల్లి మొదలగు నిత్యకృత్య ములయం దుపయోగించు కూరగాయల విత్తనములను సంగ్రహించి పెట్టి తరుణమునందు నారుబోసి పైరు చేయుటయు పథ్యాదులయందు అనుకూల ముగ ఉపయోగించుటయు భార్య చేయుపనులలో చేరియున్నదని ఈ సూత్రార్థము.

"ఆయు ర్విత్తం గృహచ్ఛిద్రం, మంత్ర మౌషధిసంగమం
దానమానావమానాశ్చ, నవ గోప్యా మనీషిభిః.♦

ఇవి అన్నియు బహిరంగపఱుపక కొంతవఱకు గుప్తముగా నుంచ వలెననియు ఇందు గలదు.

మఱియు ఆసవారిష్టములు ఇండ్లలో తయారుచేసి ఉపయోగించగా మిగిలినవి అమ్ముటయు, ఆ యా ఋతువుల యందు లభ్యములగు పుష్ప ఫలాదులనుండి పానకములుచేసి ఉపయోగించుటయు ఇవి అన్నియు ఆ యా గృహముల యందే స్త్రీలకు ఏర్పడిన నిత్యకృత్యములలో వివరముగా విధింపబడినవి. నూరు సంవత్సరములనుండి క్రమక్రమముగా విదేశ వైద్యము వచ్చి ఆక్రమించుకొనినను, ఇండ్లలోనుండి ఆయుర్వేదమును తరిమివేయలేక పోయినది. తలనొప్పికి శొంఠిపట్టు, జ్వరమునకు మిరియముల కషాయము మొదలగు నిరపాయకరములగు వైద్యములు, ప్రజలకు ఇప్పటికిని ఆధార ములై యున్నవి.

---

* వాత్స్యాయన 4-1-29. ♦ వాత్స్యాయనకామసూత్రములు: పేజి 457.

ఈ సులభచికిత్సలు ఇండ్లలో దాగియుండి అవసరము వచ్చినప్పుడెల్ల బయటకు వచ్చుచుండును. ఆయుర్వేదబీజములు భూమిలో లేకపోలేదు.

ఈప్రకారము రాజుయొక్కయు ప్రజలయొక్కయు పోషణచే కళలన్నియు అభివృద్ధియైన దినములలో ఐదువందల పదునెనిమిది కళలు (అష్టాదశాధికాని పంచశతాన్యుక్తాని) ఈఅరవైనాలుగు ముఖ్య కళలలో నిమిడి, అవాంతరకళలుగా ఏర్పడియుండి, ఒక కళకు ఒక కులము చొప్పున నేర్పడి ఒకరితో నొకరికి పోటీలేకుండ అభివృద్ధినొందియుండెను.

## కామశాస్త్రాంగ కళలు

1. గీతము. 2. వాద్యము. 3. నృత్యము. 4. ఆలేఖ్యము. 5. విశేషకచ్ఛేద్యము (ముఖముమీద అనేక ప్రకారములగు బొట్లు,చుక్కలు పెట్టుట) 6. తండుల కుసుమబలి వికారములు (పువ్వులతోను రంగులబియ్యముతోను భక్తిపూర్వకముగా చిత్రములను రచియించుట). 7. పుష్పాస్తరణము (పువ్వులతో పడకలను నిర్మించుట). 8. దశనవసనాంగరాగము (దంతములకు, వస్త్రములకు, శరీరావయవములకు రంగులు వేయుట). 9. మణిభూమికాకర్మ (రత్నములను కట్టడిసేర్పు). 10. శయనరచన (పడకలు వేయుట). 11. ఉదకవాద్యము (జలతరంగిణి). 12. ఉదకాఘాతము (పిచ్చికారీలతో నీళ్లను జల్లుట). 13. చిత్రయోగములు. 14. మాల్యగ్రథన వికల్పములు (పూలదండలను చేయుట మొ॥). 15. శేఖరకాపీడనయోజనము (తలకు పూలదండలు చుట్టుట మొ.) 16. నేపథ్యప్రయోగములు (శరీరమును అలంకరించుట మొ.) 17. కర్ణపత్ర భంగములు (చెవులకు అలంకారములుచేయుట మొ.). 18. గంధయుక్తి (పరిమళద్రవ్యములు చేయుట) 19. భూషణ యోజనము (నగలను అలంకరించుకొనుట). 20. ఐంద్రజాలము (ఇంద్రియములను మోసపుచ్చుట). 21. కౌచమారములు (వృద్ధునకు యౌవనము నిచ్చుకళ). 22. హస్తలాఘవము. 23. విచిత్రశాక, యూష, భక్ష్య, వికారక్రియా, పానక, రస, రాగ, ఆసవయోజనము. 24. శుచివానకర్మ (కుట్టుపని). 25, సూత్రక్రీడ (నూలుతో చేయు చిత్రములు). 26. వీణాడమరుకవాద్యము. 27. ప్రహేళికలు (కావ్యకళలలో చిత్రగతులు). 28. ప్రతిమాల (కడపట అక్షరము అందుకొని పద్యము చెప్పుట మొ॥). 29. దుర్వాచకయోగములు (కష్టమైన అక్షర

ములతో పద్యములు చెప్పుట). 30. పుస్తకవాచనము (శ్రావ్యముగ చదువుట మొ||). 31. నాటకాఖ్యాయికా దర్శనము. 32. కావ్య సమస్యాపూరణము. 33. పట్టికావేత్రవానవికల్పములు (పేము, వెదుళ్లతో మంచములు, పెట్టెలు అల్లుట). 34. తర్కు కర్మలు (కుందన కర్మలు మొ||) 35. తక్షణ కర్మ (వడ్రంగము). 36. వాస్తువిద్య (శిల్పశాస్త్రము మొ||) 37. రూప్యరత్న పరీక్ష. 38. ధాతువాదము (లోహములకు సంబంధించు శాస్త్రము). 39. మణిరాగాకరజ్ఞానము (స్ఫటికములు, కెంపులు మెరుగు పెట్టుట మొ||). 40. వృక్షాయుర్వేదము. 41. మేష కుక్కుట లావక యుద్ధములు. 42. శుకశారికాప్రలాపము. 43 ఉత్సాదన, సంవాహన, కేశమర్దన కౌశలము. 44. అక్షరముష్టికాకథనము (అక్షరములను దాచి కవిత్వము చెప్పుట. 45. మ్లేచ్ఛిత వికల్పములు (అక్షరములను తారుమారు జేసి అపశబ్ద భ్రాంతిని కలిగించునట్లు కవిత్వము చెప్పుట మొ||). 46 దేశ భాషా విజ్ఞానము. 47. పుష్పశకటకము (పూలతో బండ్లు చేయుట). 48. నిమిత్తజ్ఞానము (శకునములను చెప్పుట). 49. యంత్రమాతృక (విశ్వ కర్మరచితము). 50. ధారణమాతృక (అవధానములు). 51. సంపాఠ్యము (కలసి చదువుట). 52. మానసక్రియ (మనస్సులో నుండు ఆలోచనలు చెప్పుట). 53. కావ్యక్రియ. 54. అభిధానకోశము (నిఘంటువును వల్లించుట). 55. ఛందోజ్ఞానము. 56. క్రియాకల్పము (అలంకారశాస్త్రము. 57. చలితకయోగములు (భ్రమపెట్టు కవిత్వము). 58. వస్త్రగోపనములు, 59. ద్యూతవిశేషములు. 60. ఆకర్ష క్రీడ (పాచికలు). 61. బాలక్రీడలు ఇందు 61. క్రీడలు గలవు). 62. వైనయికీజ్ఞానము (గుఱ్ఱముల, ఏనుగుల అలవరుచు కొనుట). 63. వైజయికీ విద్య (యుద్ధముచేయుట). 64. వ్యాయామికీ జ్ఞానము (శరీర పరిశ్రమ.)

## శిల్పకళ - చిత్రలేఖనము

శిల్పకళను గూర్చి "ఫెర్గ్యూసన్" మొదలగు వారు హిందూస్థానమందలి సుందరమందిరముల చిత్రకల్పనలు ప్రపంచమునకు ఆదర్శభూతముగ నున్నవని వర్ణించియున్నారు. ముఖ్యముగా దక్షిణదేశమందు మైసూరు రాష్ట్రమున "బేలూరు" నందలి దేవాలయములను శృంగేరీమఠమున శారదాదేవ్యాలయమును ఎన్నదగినవి. ఈ దేవాలయమున 12 రాసుల

యందుండు సూర్యనికిరణములు ఒక్కొక్క రాశియందు సూర్యుడుప్రవేశించు నప్పుడు దేవాలయమునందలి ఆయానామములు గల 12 ద్వారముల గుండ లోపలకు ప్రవేశించును. ఈవిచిత్రనిర్మాణమును చూచుటకు ఖండాంతరములనుండి శిల్పశాస్త్రజ్ఞులు వచ్చి చూచుచుందురు. హిందూస్థానమున ఎల్లోరా, అజంతా, అమరావతి, నాగార్జునకొండ, సాంచి, ఆబూ, బీజాపూర్, తాజమహాల్ మొదలగు ప్రదేశములందలి కట్టడములు జగద్విఖ్యాతములై యున్నవి. ఇవియే తరువాతపుట్టిన మహమ్మదీయ సంప్రదాయక శిల్పములకు పునాదులైనవి. చిత్రకళానైపుణ్యమును విగ్రహవిలాసమును ప్రదర్శించుటకు ఆంధ్రదేశమున అమరావతియు, మధ్యరాష్ట్రమున అజంతా మొదలగు విహారములు చూడనగును. విజయనగరమునందు ఒక్కటే రాతియందు చెక్కిన పెద్దరథము గలదు. ఇరుసులు, చక్రములు అన్నియు ఒక్క రాతినుండియే చెక్కబడినవి. ఇట్టి రథములు మహాబలిపురమునందును కలవు.

## ప్రాచీన శిల్పకళయందు ఆంధ్రుల ప్రావీణ్యము

పై నుదాహరింపబడిన గుహాలును, స్తూపములనేకములు ఆంధ్రశిల్పులు నిర్మించినవే. సంగీతాది ఇతర లలితకళలయందు గూడ ఆంధ్రులు పూర్వమునుండియు అగ్రస్థానము వహించి ఇతరదేశములవారికి మార్గదర్శకులుగ నొప్పుచుండి రనుటకు పెక్కు నిదర్శనములు కలవు.

## కళాశాలలు

ఇప్పుడు విజ్ఞానవేత్తలు ఇట్టి కళలను మానవాతీతములని పొగడుచుందురు గాని - ఇట్టి కళలకు ఆధారమగు కళాశాలలు హిందూదేశమునందు లేవని ఆక్షేపించెదరు. కళాశాలలు లేనిదే ఇట్టి కళలు పుట్టుట అసంభవము. విద్యాశాలలు కళాశాలలు గూడ, ఈ కాలములో చేసినట్లు హెచ్చు ధనవ్యయము చేయక పోయినను, ఆ యా వృత్తుల నాశ్రయించి చక్కని విద్యలను, కళలను గూడ ఒకేసారి బోధించు మందిరములును, దేవాలయములును, చైత్యవిహారములును ఒక్కొకవిద్యార్థికి వాని వాని శక్తిని బట్టి విద్య గరపుసంస్థలుగా దేశము పొడుగునను వ్యాపించి యుండెను. ఈ మందిరములే వారికి కళాశాలలు. కళ యంతయు వారు చేయు పనిని అనుసరించి నేర్పబడును. కంఠపాఠము చేసి నేర్చుకొనునట్టిది కాదు. ఇదియే భారతీయ కళాభ్యాస విధానము.

180

# 9వ అధ్యాయము

## నీతిమార్గములు

[విషయసంగ్రహము:— సత్యప్రవర్తనము - అహింస - సూక్ష్మజీవులు - స్వార్థత్యాగము - కేవలస్వార్థము - దూరదృష్టి స్వార్థము - ఉభయస్వార్థము - పుష్కలత్యాగము - నిష్కామత్యాగము శ్రేష్ఠము - ధర్మము - బ్రహ్మచర్యము - బ్రహ్మజ్ఞానము - బ్రహ్మమునకు, ఆయుర్వేదమునకు సాదృశ్యము - జీవిత పరమార్థములు - ఆయుర్వేదముయొక్క ఉద్దేశము.]

ఈ యధ్యాయమున హిందూస్థానముయొక్క శాశ్వతకీర్తికి ఆధారభూతము లగు నీతిమార్గములను గూర్చి కొంచెముగా వివరించెదము. ఆ కాలమునాటి నీతి, మతాచారములను చరకసుశ్రుతాది ఆయుర్వేదగ్రంథకర్తలు తమ సంహితలలో అద్దమునందు ప్రతిబింబించినట్లు వర్ణించి యున్నారు. ఆ వర్ణనలను చక్కగా తెలిసికొను నిమిత్తము ఈ విషయముల వివరము ఆయుర్వేద విద్యార్థులకు అవసరమై యున్నది.

### సత్యప్రవర్తనము

ఈ దేశమునందు సమస్త సంపదలకంటె, తుదకు ప్రాణముకంటె, సత్యమే ప్రధానమని అనాదినుండి సంప్రదాయముగా వచ్చుచున్నది. "సత్యంవద, ధర్మంచర, సత్యాన్నప్రమదితవ్యమ్, ధర్మాన్నప్రమదితవ్యమ్ * "సత్యమును పలుకుము, ధర్మమును ఆచరించుము. సత్యమునుండి ఎన్నడును ప్రమాదమును పొందవలదు. ధర్మమునుండి ఎన్నడును ప్రమాదమును పొందవలదు" అనెడి విధులు ఆదినుండియు బోధింపబడుచు వచ్చుచున్నవి. "నాస్తి సత్యాత్ పరో ధర్మః" ♦ అను వచనమును భారతములో అనేక స్థలములయందు చూడవగును. వేయి అశ్వమేధములను, సత్యమును త్రాసునందుంచి తూచగా సత్యమే ఎక్కువ బరువగునని తెలుపబడియున్నది.†

* తైత్తిరీయోపనిషత్, శిక్షావల్లి. ♦ భారతము. శాంతి 162—64.
† భారతము. ఆది 74-102.

బౌద్ధ ధర్మములలోను క్రైస్తవధర్మములలోను సత్యపరిపాలనమే అనుసరింపబడినది. ఇట్లుండియు దుష్టులచే నిండియున్న ఈ ప్రపంచమున సత్యప్రవర్తనము కూడ ఒక్కొక్కపుడు కష్టకారణ మగుచున్నది. ఉదాహారణము:—ఒక ఘాతుకుని చేతులలోనుండి తప్పించుకొని దాగికొనుటకు పారిపోవుచు మన కంటబడిన వాని వెనువెంటనే వానిని చంపుటకు చేత కరవాలముతో వెంబడించి వచ్చు నా ఘాతకుడు "ఇప్పు డిట్లు పరుగెత్తుకొని వచ్చిన మనిషి ఏవైపునకు పోయెను?" అని మనలను ప్రశ్నించిన ఏమి సమాధానము చెప్పవలెను? సత్యమును చెప్పెదమా, నిరపరాధి యగు నాతని ప్రాణములు పోవును. ప్రాణిహింసకు సహాయముచేసినవారమగుదుము. సత్యము చెప్పక పోయిన అబద్ధమాడినట్లగును. ఇట్టి విషమపరిస్థితియందు అనుసరింపదగిన విధినిగూర్చి మనువు ఇట్లుచెప్పుచున్నాడు. "జానన్నపిహి మేధావీ జడవ ల్లోక ఆచరేత్" అనగా బుద్ధిమంతుడగువాడు తా నెరిగియుండియు లోకమున మూగవానివలె ఉండవలెను. ఈ విషయమునుగూర్చి మహాభారతమునందు మాట్లాడకుండగనే వదలించుకొనుట కశక్యమైన పక్షమున అప్పుడు పరుల ప్రాణరక్షణార్థమై ఆ సందర్భమున సత్యము పలుకుట కంటె అసత్యమును పలుకుటయే మేలైనదని విచారణచేసి నిశ్చయించిరి. * సత్యముకంటె సర్వభూతహితముగ మాటలాడుట ప్రశస్తమైనది.

ఇతరుల ప్రాణరక్షణార్థము అసత్యము పలుకవచ్చునను సిద్ధాంతము నంగీకరించి చరకుడు క్షయరోగ చికిత్సయందు గుడ్లగూబలయొక్కయు, భాసపక్షులయొక్కయు మాంసమును సంస్కరించి నెమిలి మాంసమనియు, కాకిమాంసమును తిత్తిరిపిట్టమాంసమనియు, ఇట్లే సర్పమాంసమును చేపమాంసమనియు, వానపాముల మాంసమును చేపల ప్రేగులనియు చెప్పి రోగికి ప్రియమును గలిగించి చికిత్సచేయవలెనని చెప్పియున్నాడు. ♦

దేనివలన సర్వభూతములకు అత్యంతమైన హితముగలుగునో అదియే సత్యమని నారదులు శ్రీశుకులకు చెప్పెను.† దీనినిబట్టి చూడగా సత్యమును, అహింసను రెంటిని త్రాసులోపెట్టి తూచవలసివచ్చినపుడు అహింస బరువుగనుండుటచే దానికే మనవారు ప్రాధాన్యము నిచ్చిరి.

---

* మహాభారతము—శాంతి – 109-15,16. ♦ చరకసంహిత రాజయక్ష్మ చికిత్స. † మహాభారతము, శాంతి 329 – 13.

## అ హిం స

"అహింసా సత్య మస్తేయం, శౌచ మింద్రియనిగ్రహః
ఏతం సామాసికం ధర్మం, చాతుర్వర్ణ్యేఽబ్రవీ న్మనుః *

అహింస, సత్యము పలుకుట, పరులసొమ్మును ఆశింపకుండుట, మనోవాక్కాయశుద్ధి, ఇంద్రియ నిగ్రహము అనునవి నాలుగు వర్ణముల వారికిని ఉండవలసిన గుణము లని మనువు చెప్పెను.

అందు ముఖ్యముగా "అహింసా పరమో ధర్మః" అని మానవధర్మముల అన్నిటిలోను అహింసయే ముఖ్యముగ హిందూమతమున పరిగణింపబడుచున్నది. జైన,బౌద్ధ,క్రైస్తవ, ధర్మగ్రంథములలోగూడ మనుస్మృతియందువలెనే అహింస అగ్రగణ్యమై యున్నది. సచేతన మగు ప్రాణికి ఏవిధమగు పీడకలిగింపక పోవుటయే అహింస. కాని గాలిలో, పండ్లలో, కూరగాయలలోను, జలము మొదలగు వస్తువులలోను అత్యల్పములగు అనేక జీవరాసులను చంపకుండ మనుష్యుడు ప్రవర్తించుట అసాధ్యము†

## సూ క్ష్మ జీ వు లు

శ్లో. సూక్ష్మయోనీని భూతాని, తర్కాగమ్యాని కానిచిత్
పక్ష్మణోపి నిపాతేన, యేషాం స్యాత్ స్కంధపర్యయః. ♦

కన్నులకు కనుపించకపోయినను మనము కంటిరెప్పను కదిల్చినంత మాత్రముననే తమ హస్తపాదాదులు విరిగి నశించిపోవునంతటి సూక్ష్మజీవులు ఈ జగత్తున కోట్లకొలది కలవు. ఇల్లు ఊడ్చునప్పుడు, పొయ్యిమంటచేయునప్పుడు లెక్కలేని అల్పప్రాణులు నశించుచున్నవి. ఇది ఇట్లుండగా హింసచేయకుము! హింసచేయకుము!! అని నోట అన్నంత మాత్రమున ఏమి ప్రయోజనము? ఇవిగాక "జీవో జీవస్య జీవనం"‡ అని ఒకప్రాణిని తిని మఱియొక ప్రాణి జీవించుట జగత్తునందు అనవరతము జరుగుచుండు విషయము. సారాంశమేమన, నీతియొక్క సామాన్యనియమముల వలన కొన్ని సమయములలో కార్యనిర్వహణము కాకపోవుచున్నది. ఐనను ప్రాణరక్షణమే అదర్శముగా గల ఆయుర్వేద మతమున

* మను అ. 10-63. † భారతము. శాంతి. 15—26,
♦ మహాభారతము. శాంతి.15—16, ‡ భాగవతము 1—13—46,

సర్వధర్మములలో అహింసయే ప్రథమగణ్యమైనదని ఈరీతిగా వర్ణింపబడి యున్నది.

"తత్ర అహింసా ప్రాణినాం ప్రాణవర్ధనానా ముత్కృష్టతమం."

ప్రాణవర్ధనమైన అన్ని మార్గములలోను అహింసయే శ్రేష్ఠతమ మైనది.♦

## స్వార్థత్యాగము

ఏ కాలమునందైనను దుఃఖము అందరకు కష్టమై తోచును. సుఖమును అందరు కోరుదురు. కాని పరస్పరవిరుద్ధములగు రెండు ధర్మములు ఒక్కకాలమునందు ప్రాప్తములైనప్పుడు తాత్కాలికముగా దుఃఖకరమైనను ధర్మము నాచరింపవలెనా? లేక తాత్కాలికసుఖమును గోరి అధర్మమును ఆచరింపవచ్చునా? అను ప్రశ్నలు సాధారణముగా లోకమునందు ప్రతివారికి గలుగుచుండును. ఇందునుగురించి ఐదువిధములైన సిద్ధాంతములు గలవు.

1. కేవలస్వార్థము
2. దూరదృష్టి స్వార్థము
3. ఉభయస్వార్థము
4. పుష్కల స్వార్థత్యాగము
5. నిష్కామ స్వార్థత్యాగము

## 1. కేవలస్వార్థము

మన హిందూస్థానమునకూడ చార్వాకులమార్గము దీని ననుసరించునది. వీరు "ఋణం కృత్వా ఘృతం పిబేత్" ఋణము చేసియైనను నేతిని త్రాగవలెను. చచ్చినపిదప ఏమియును లేదు. పంచభూతముల కలయికవలన చైతన్య మనెడి గుణము బయలుదేరుచున్నది. ఇదియే యాత్మ యనబడినను కావచ్చును. దేహమును తగులబెట్టినదానితో చైతన్య మనెడి అత్మసైతము కాలిపోవును. వ్యర్థమగు ఆత్మవిచారణమును చేయుక బుద్ధిమంతుడగు పురుషుడు ఈ దేహము జీవవంతమై యున్నంత పర్యంతము సుఖ మనుభవించవలెను.

♦ చరకము—సూత్ర అ. 30-15.

ఎక్కడిధర్మము? ఎక్కడి పరోపకారము? ఈ జగత్తున నేనుచూచు వస్తువు లన్నియు నే ననుభవించుటకేగాని ఆ వస్తువులకు మఱియొక ఉపయోగము లేనేలేదు. నే ననునదియే సమస్త నీతిశాస్త్రమునకును రహస్యముగ నున్నది. మిగిలిన దంతయు అసత్యమే. భగవద్గీతలోకూడ

"ఈశ్వరోఽహం అహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ"*

"నేనే ఈశ్వరుడను, నేనే అనుభవించువాడను, నేనే సిద్ధుడను, బలాఢ్యుడను, సుఖిని" అని ఈ శ్లోకార్థమును తమ సిద్ధాంతమును సమర్థించుటకై అన్వయించుకొందురు. అట్టివారు ఆధిభౌతిక సుఖవాదులలో మొదటి వర్గమువారని చెప్పవచ్చును. వీరిని కేవల స్వార్థులందురు. ప్రస్తుత పాశ్చాత్య శాస్త్రవిజ్ఞాన మంతయు కేవల స్వార్థ దృక్పథమునే చాలవఱకు అనుసరించుచున్నది.

## 2. దూరదృష్టి స్వార్థము

రెండవవర్గమువారు స్వసుఖముకొఱకే దూర మాలోచించి పరుల సుఖమునకు సహితము మనము ప్రయత్నపడవలెను అను ఉద్దేశముతో ఇతరులకు ఉపకారముచేయువారు. వీరు భవిష్యత్కాలమున బిడ్డలు తమను ప్రేమించి తమకు సుఖము నిత్తురు అను ఆశచే వారిని పెంచుదురు. తనకు గల పయోధర పీడచే తల్లి బిడ్డకు పాలిచ్చుచున్నదిగాని ప్రేమచే గాదని ఈ వర్గములోని వారి ఉద్దేశము. వీరిని దూరదృష్టిస్వార్థులందురు.

## 3. ఉభయస్వార్థము

మూడవ వర్గమువారు స్వార్థపరార్థము లనెడు రెండును మనుష్య స్వభావమునందు నైసర్గికప్రవృత్తు లనియు, పులివంటి క్రూరజంతువైనను తన శిశువుయొక్క సంరక్షణకై తన ప్రాణముల నిచ్చుటకు సిద్ధపడుచుండగ మనుజులయందు ప్రేమ, పరోపకారబుద్ధి మొదలగు గుణములు కేవలము స్వార్థము మూలముననే పుట్టినవనుట సరికాదు అని చెప్పుదురు. కాని జగత్తులో పరోపకారార్థమను పేరుతో కొందరు చేయు పనులు అనేక సమయములయందు తమ హితముకొఱకే వీరు చేయుచున్నారని ఏర్పడగలదు. ఒకడు తాను ధనము సంపాదించి తా ననుభవిం

---

* గీత 16 - 14.

చుట గూడ మొత్తముమీద సమాజమునకు ఉపకారమే అని చెప్పవచ్చును. "అలికి అన్నము పెట్టుట ఊరికి ఉపకారము" అను సామెత వీరికి చెల్లును.

ప్రతిమానవుడు ఇతరులకు నష్టము రానీయకుండ తాను లాభమును పొందిన యెడల, మొత్తముమీద సంఘమునకు కల్యాణమే అగును. కాని ఒకానొకప్పుడు స్వార్థమునకును పరార్థమునకును విరోధము వచ్చినప్పుడు, లోకుల సుఖమునకై తన సుఖమెంతవఱకు త్యాగము చేయవలెనో నిర్ణయించుట కష్టమగును. తఱచు స్వార్థముపైపునకే మనుజుడు ప్రవర్తించుట కలుగుచుండును. ఈవర్గమును అనుసరించు వారు సత్యమునకై ప్రాణములనిచ్చుట, రాజ్యములను గోల్పోవుట, మొదలగు పరిస్థితులయందే గాక, ద్రవ్యరూపముగ విశేషనష్టము గలుగునప్పుడు గూడ స్వార్థత్యాగము చేయలేరు. ఏదో విధమున తమమనస్సాక్షిని తృప్తిపరచుకొనుచు తను లాభమునే చూచుకొనుచుందురు. స్వార్థపరార్థముల రెంటిని తక్కెడలో బెట్టి తూచి వాని తారతమ్యములు గ్రహించి స్వార్థమునే తుదకు మిక్కిలి చాతుర్యముతో ఇతరులకు తెలియనట్లుగా వీరు చేయుదురు. భర్తృహరి నీతిశతకమునందు ఈ విషయమై ఇట్లు సిద్ధాంతమును చేసియున్నాడు.

మ. తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమ కార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
తమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్, వృథాస్వార్థభం
గము గావించెడు వార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్. *

## 4. పుష్కల త్యాగము

ఎక్కువమందికి ఎక్కువసుఖము (Greatest good of the greatest number) కలుగ జేయుట నీతిమంతుల కాదర్శమని కొందఱు చెప్పుదురు. సుఖము, హితము అను ఈ రెండు శబ్దముల అర్థములో చాల భేదము గలదు. సుఖము తనకు చెందినది. హితము సంఘమునకు సంబంధించినది. ఈభేదమును ఇదివఱలో వివరించియున్నాము. (5వ పేజిచూడుడు) పుష్కల స్వార్థత్యాగమును బోధించు ఈ నాల్గవ వర్గమువారికిగల త్యాగబుద్ధిని పరిశీలించిన యెడల అనేకలోపములు కనబడును. ఒకానొకప్పుడు ఒక

* ఏనుగు లక్ష్మణకవి.

లక్షమంది దుర్జనులసుఖముకంటె ఒక సజ్జనునకు గలుగు సుఖమే ఎక్కువది యని తేలును. లాభమును పొందిన లోకులయొక్క సంఖ్యనుబట్టి నీతిమార్గములను నిర్ణయించుట ఎల్లప్పుడును సరిగా నుండునని చెప్పరాదు. ఆ యా కార్యముల చేయువారి బుద్ధి లేక యుద్దేశము ఎటులున్నదని అవశ్యకముగా తెలుసుకొనవలెను. అమెరికాలో ఒక గొప్పపట్టణమునందు ఎల్లవారికి సుఖప్రాప్తి కొఱకు ఒకానొకప్పుడు ట్రామ్‌వేబండి వేయవలసి వచ్చెను. కాని ముఖ్యులగు అధికారులు కొందరు సమ్మతింపకపోయిరి. ట్రామ్‌వే కంపెని వారు ఆ అధికారులకు లంచమిచ్చి ట్రామ్‌వే పని వెంటనే పూర్తిచేసిరి. పట్టణమునం దెల్లరకు దాని మూలమున బహుసుఖమును లాభమునుగలిగెను. పిదప కొన్నిరోజులకు లంచపు సమాచారము వెల్లడియై న్యాయాధికారుల తీర్పునకు వచ్చెను. ట్రామ్‌వే నియామకము అనేకులకు అధికసుఖప్రద మైనను అంతమాత్రముచే లంచ మిచ్చుట న్యాయము కానేరదు.* అనితీర్పు చెప్పిరి. కాబట్టి పుష్కలత్యాగము సర్వత్ర న్యాయబద్ధమని నిర్ణయించుట సరికాదు.

## 5. నిష్కామ త్యాగము

నిష్కామ బుద్ధితో త్యాగము చేయుటలోను, కీర్తికొఱకుగాని మఱి యేదేని యితర ఫలముల కొఱకు గాని త్యాగము చేయుటలోను బాహ్య పరిణామ మొకవేళ ఒక్క విధముననే ఉండినను, ఇందు మొదటి దగు సాత్త్వికత్యాగము ఉత్తమమనియు; రెండవది యగు రాజసత్యాగము గర్హ్యమనియు ♦ చక్కగా విడదీయబడినవి. కాబట్టి స్వార్థత్యాగము దేశము, కాలము, కర్త, ఉద్దేశము మొదలగు అనేక అవస్థాభేదములచేత వ్యత్యాసముగా నుండును.

శ్లో॥ "అష్టాదశ పురాణానాం, సారం సారం సముద్ధృతమ్
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్"

పరోపకార మనునది పుణ్యము. పరపీడనము అనునది పాపము. ఇదియే అష్టాదశ పురాణముల యొక్క సారము. ఈ విషయమునుగూర్చి చరకుడు మిక్కిలి చక్కగా జెప్పియున్నాడు.

* తిలక్ గీతారహస్యము. ప్ర 4. ♦ గీత అ. 17 శ్లో 20, 21.

"నాత్మార్థం నాపి కామార్థం, అథ భూతదయాం ప్రతి."

భూతదయయే పరమార్థముగా గల త్యాగము ఆదర్శముగాని తక్కినవి నింద్యములు. సుఖదుఃఖములు అనిత్యము, ధర్మమే నిత్యము. ప్రాణములను పోగొట్టుకోవలసినట్టి సమయమునందైనను స్వధర్మము నెప్పుడును త్యజింపరాదు.

"నజాతు కామాన్న భయాన్న లోభాత్ ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః
ధర్మో నిత్య సుఖదుఃఖే త్వనిత్యే జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః."*

కాబట్టి స్వధర్మ పరిపాలన నిమిత్తము సర్వమును త్యజించుటయే నిష్కామత్యాగము.

## ధర్మము

హిందూసంప్రదాయమునందు ధర్మము అను మూడు అక్షరముల పదము ఎంతో అర్థమును కలిగి ఉన్నది. ఈ ధర్మశబ్దము ఇహపరలోక సంబంధమైన మంచి నడవడికను అంతను సూచించును. సాధారణమైన వాడుకలో రాజధర్మములు, ప్రజాధర్మములు, దేశధర్మములు, కులధర్మములు, తాత్కాలికధర్మములు, ఆపద్ధర్మములు, యుద్ధధర్మములు మొదలగు ఇహలోకసంబంధములగు నీతిమార్గము లన్నియు ధర్మశబ్దముచే చెప్పబడును. ఇంటికి వచ్చిన బిచ్చగానికి ఓడికెడు బియ్యము పెట్టుటగూడ ధర్మమన బడును. ఇచ్చట తనతోబాటు బీదవారలు కూడ పోషింపబడుట ఆవశ్యకము అను ఆదర్శమును ఈ ధర్మము (బిచ్చము) అనుపదము సూచించుచున్నది. ఇహలోకసంబంధమైన ధర్మమునకు వ్యావహారికధర్మములనిగాని, నీతి అనిగాని, చట్టములు అనిగాని చెప్పుచుందుము. దేనిచే సర్వసమాజము ఉద్ధరింపబడి పోషింపబడునో దానిని ధర్మమందురని ఈ క్రిందిశ్లోకమునందు గలదు.

"ధారణా ద్ధర్మ మిత్యాహు ర్ధర్మో ధారయతే ప్రజాః
యత్స్యా ద్ధారణసంయుక్తం స ధర్మ ఇతినిశ్చయః"♦

ధర్మశబ్దము "ధృ-ధారణే" అను ధాతువునుండి నిష్పన్నమగుటచే ధర్మముచేతనే ప్రజ లందరు బద్ధులు. దేనిచే సమస్తసంఘమును యథాస్థితిని

* మహాభారతము. విదురనీతి ♦ మహాభారతము కర్ణ. ౬౯ - ౫౯.

నిలుచునో అదియే ధర్మమని యర్థము. సమాజపు కట్టుబాట్లు లేనియెడల ఆకర్షణశక్తిలేనప్పుడు ఆకాశమునందు సూర్యచంద్రాది గ్రహములు ఎట్లు తమతమ మార్గములలో సంచరింపవో, చుక్కాని లేనప్పుడు నావ సముద్రములో ఎట్లు నడువలేదో, అట్లే సంఘముకూడ వర్తిల్లు మార్గము లేక క్లిష్ట పరిస్థితులలో పడిపోవును. సంఘమనునది ఒక యంత్రమువంటిది. ఒక గడియారములో ఏ భాగముచెడినను ఆ యంత్రము చక్కగా ఎట్లుల పనిచేయదో అదేప్రకారము ప్రతివ్యక్తియు సంఘములో ధర్మాతిక్రమణము లేక తమతమ పనులను చేయవలెను. లోకములో ఒకరితో నొకరు యుద్ధముచేయుచు ఒకరి నొకరు చంపుకొను సమయములందు గూడ కొన్ని యుద్ధధర్మములు పాటింపవలెను. భారతయుద్ధమున పృథ్విలో కుంగిపోయిన రథచక్రమును పైకెత్తుటకు కర్ణుడు రథమునుండి క్రిందికి దిగిన పిదప, అర్జునుడు తన్ను వధించుటకు ఉద్యుక్తు డగుటను జూచి, శత్రువు నిరాయుధు డగునపుడు చంపుట యుద్ధధర్మము కాదని కర్ణుడు చెప్పెను.

అంతట శ్రీకృష్ణుడు కర్ణుని జూచి "సభలో ద్రౌపది వస్త్రాపహరణ సమయమునందు నీ నడత అంతయు ధర్మముగా నున్నదా?" అని దెప్పిపొడిచెను.

శిష్టాచారములని చెప్పబడు సాంఘిక నియమములుగూడ ధర్మములనబడును. "ఆచారః పరమోధర్మః" * అధర్మాచరణముచే జనపదధ్వంసకవ్యాధులు వచ్చి దేశమంతయు నాశన మగునని చరకమునందు విమానస్థానము మూడవ అధ్యాయమున చెప్పబడినది. ప్రజల కుపయోగిపడు గ్రామములు, ఆహారపదార్థములు, నీరు, వాయువు మొదలగునవి చెఱచుట ఇచ్చుట అధర్మము.

అందరకును అన్నికాలములయందును ధర్మము ఒకటే విధముగా నుండదు. ఆటవికునకు వేటాడి జంతువుల చంపుట ధర్మము. కసాయివానికి మాంసమును అమ్ముట ధర్మము.

రాగప్రాప్తమైన స్వేచ్ఛాచరణమును సంఘముయొక్క సుఖము నిమిత్తమై అణగద్రొక్కుటయే ధర్మముయొక్క ముఖ్యోద్దేశ మని చెప్పవచ్చును.

* మను. 1 - 108.

"ఆహార నిద్రాభయమైథునం చ సామాన్య మేతత్పశుభిర్నరాణాం
ధర్మోహి తేషా మధికో విశేషో ధర్మేణ హీనాః పశుభిస్సమానాః."

ఆహారము, నిద్ర, భయము, మైథునము అనునవి మనుష్యులకును, పశువులకును సమానముగనే ప్రాప్తము లగుచున్నవి. ధర్మ మనునదియే మనుష్యులకును, పశువులకును గల విశేషము. అట్టి ధర్మము తెలియనివారు పశువులతోనే సమాను లగుదురు.

సాంఘిక నియమములబట్టియు, దేశ కాల పరిస్థితులనుబట్టియు మారుచుండు ధర్మాధర్మములను నిర్ణయించుచుండుట ఒకానొకప్పుడు చాల కష్టమగుచుండును. విశేషముగ మాటలాడెనేని వాచాలుడు, మితభాషి యైనచో మందుడు, మిక్కిలి వ్యయము చేసిన అతివ్యయకారి, కొద్దిగ వ్యయము చేసిన లోభి, ముందుగ నడచువాడు దుస్సాహసి, వెనుక నడచువాడు అసమర్థుడు, మిక్కిలి పట్టుదల (ఆగ్రహము) గలవాడు దీర్ఘక్రోధి, అదిలేనివాడు చంచలుడు, విశేషముగ ఆశ్రయించువాడు నీచుడు, అదిలేనివాడు గర్వి అని భర్తృహరి మొదలగువారిచే గుణదోషములు వర్ణింపబడియున్నవి. "అతి సర్వత్ర వర్జయేత్" అని ధర్మార్థ సుఖముల నాచరించునపుడు "సర్వ ధర్మేషు మధ్యమాం" అని వాగ్భటుడు చెప్పినట్లు (వా. సూ. అ 2. సూ 23) మధ్యమమార్గమును అవలంబించుచు ధర్మార్థసుఖములు ఒండొంటికి విరోధములేకుండునట్లుగ ప్రవర్తింపవలెను. అందుచే ఇహపరసుఖములు గలుగును.

## బ్రహ్మచర్యము

సామాన్యముగా బ్రహ్మచర్య మనగా ఉపనయనము మొదలు వివాహము వరకుగల కాలము అని అర్థము చెప్పుదుము. బ్రహ్మ మనగా వేదము లేక సృష్టికర్త. చర్య అనగా అనుసరించుట. వేదమును అభ్యసించు కాలము లేక సృష్టికర్తను గూర్చిన జ్ఞానమును సంపాదించు కాలము అని బ్రహ్మచర్యము అను పదమునకు సామాన్యమైన అర్థములు. కాని స్త్రీ సాంగత్యము లేకుండుట అని దీనినుండి యొక లౌకికార్థము ఏర్పడినది. నిజముగా బ్రహ్మచర్య మనగా పరమాత్మను తెలుసుకొనుమార్గము.

## బ్రహ్మజ్ఞానము

బ్రహ్మము అనగా ఏమి? కొంచెము టూకీగా ఇచ్చట తెలుసుకొన

వలెను. "బ్రహ్మము" అను శబ్దమునకు పెద్దది అను అర్థముగలదు. ఈసృష్టి అంతయు ఎవనినుండి పుట్టినదో, ఏది అన్ని కారణములకు ప్రథమ కారణమో అది బ్రహ్మము. ఇట్టి బ్రహ్మమును ఇట్టిది లేక ఇట్టివాడు అని వర్ణించుటకు వీలులేదు. వర్ణనాతీతమై ఊహచేమాత్రము తెలుసుకొనదగిన సత్ - చిత్ ఆనందస్వరూపుని బ్రహ్మమని వర్ణించియున్నారు.

అసత్ అనగా లేనిది. అది కాదు కనుక సత్తు.

అచిత్ అనగా అజ్ఞానము. అజ్ఞానము చీకటి వంటిది. అది కానిది జ్ఞానము. అది సర్వమును తెలియజేయు వెలుతురు వంటిది. అట్టి జ్ఞాన స్వరూపుడు బ్రహ్మము.

ఆనందము అనగా దుఃఖము లేకపోవుట. రోగభయము, మరణ భయము ఇత్యాది భయములుకూడ దుఃఖములు. ఈ దుఃఖము అవిద్య అనగా అజ్ఞానముచె గలుగును. ఆత్మ కాని దేహమును తాను అనుకొనుట అజ్ఞానము. ఆత్మ వేఱు, దేహము వేఱు. సుఖదుఃఖములు ఆత్మ నంటవు. జీవాత్మ పరమాత్మలయొక్క అద్వైతజ్ఞానమును గలిగి పిపీలికాదిబ్రహ్మపర్యంతము గల సర్వ ప్రాణికోటి యందును ఉండు ఆత్మ ఒక్కటే యనియు, వ్యవస్థాభేదము అనగా నామరూపములలో మాత్రము మనకు తెలియుచుండు భేదము అవిద్య లేక మాయ, అజ్ఞానము అని తెలుసుకొని భయ రాహిత్యమును పొందుట గొప్ప ఆనందము. ఆనందస్వరూపమే బ్రహ్మము.

ఇట్లు సత్ చిత్ ఆనంద స్వరూపుడని బ్రహ్మమును వర్ణించి యున్నారు.

"ఏకమేవాఽద్వితీయమ్" - బ్రహ్మము తప్ప వేరేదియును లేదు. అంతయు బ్రహ్మమే. తత్త్వమసి - తానే బ్రహ్మము, బ్రహ్మమే తాను అను నట్టి జ్ఞానము కలిగిన వానికి భయ మెక్కడనుండివచ్చును?

అస న్నేవ స భవతి । అస ద్బ్రహ్మేతి వేద చేత్ ।
అస్తి బ్రహ్మేతి చేద్వేద । సంత మేనం తతో విదు రితి. *

ఎవడు బ్రహ్మము లేదని భావించునో వాడును గొడ్రాలి కుమారుని వలె లేనివాడె యగుచున్నాడు. అట్లు తలపక యెవ్వడు బ్రహ్మము సర్వ

* తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లి షష్ఠానువాకము మంత్రము 1-6

ప్రపంచోత్పత్తికి బీజభూత మని తెలుసుకొను చున్నాడో వానిని సత్పురుషునిగా తెలుసుకొనుచున్నారు. అనగా ఎవ్వడు బ్రహ్మమే లేదని తలచునో వాడును లేనివాడే యగును. ఎవడు బ్రహ్మము యొక్క అస్తిత్వము తెలుసుకొనునో అట్టివానిని విద్వాంసులు బ్రహ్మవేత్తనుగా తలంచుచున్నారు అని దీని అర్థము.

నిర్వికార మగు ఒకే పదార్థముగా నుండిన బ్రహ్మమునకు చరాచరములగు సృష్టి అంతయు కావలయు నని సంకల్పము కలిగెను.

సోఽకామయత । బహు స్యాం ప్రజాయేయేతి ...

ఇదగ్ం సర్వ మసృజత ।. *

అని ఆ బ్రహ్మము అనేకముగా కావలయును అని సంకల్పించి ఈ కనబడుచున్న సమస్తజగత్తును సృజించెను.

తత్సృష్ట్వా । తదేవానుప్రావిశత్ । తదనుప్రవిశ్య ।

సచ్చ త్యచ్చాభవత్. ♦

ప్రపంచమును సృజించి దానియందు తాను ప్రవేశించి, అట్టి ప్రపంచము నందలి పదార్థములకు సత్ (కలదు), త్యత్ (లేదు) అను వ్యవహారమును కలుగునట్లు చేసెను.

అట్లు సృజింపబడిన ప్రపంచమున ప్రవేశించి, మూర్తిమంతమగు పృథివి,జలము, అగ్ని అను భూతత్రయమును, అమూర్తిమంతములగు వాయువు ఆకాశము అను భూతద్వయమును అయెను. చైతన్యరహితములగు పాషాణాదికములును, చేతనావంతములగు జంగమసృష్టియు ఈ బ్రహ్మమే అయెను. బ్రహ్మమునుండి వృద్ధిజెంది తిరిగి ఈసృష్టి అంతయు బ్రహ్మమునందే లీనమయి పునఃపునఃసృష్టి యగుచుండును. ఇదియే సత్యమని బ్రహ్మవేత్తలు పలుకుదురు. ఇట్లు బ్రహ్మమును తెలిసికొనుటయే బ్రహ్మచర్యము. పైన చెప్పిన వైదికసంప్రదాయమును ఆయుర్వేదము అనుసరించి

*♦ తైత్తిరీయోపనిషత్తు, ఆనందవల్లి, షష్ఠానువాకము, మంత్రము 1-6.

"బ్రహ్మచర్యం-అయనానాం" అని సన్మార్గములలోని కెల్ల బ్రహ్మచర్యము ఉత్కృష్టతమమైన దని చెప్పుచున్నది. నాస్తికులకు ఆయుర్వేద విద్యాభ్యాసమునందు తావు లేదు. చరకసంహిత సూత్రస్థానము కడపటి అధ్యాయమును చూడుడు. ఈ గ్రంథమును ముగించక పూర్వము గ్రంథము యొక్క సారాంశముగా నీ విషయమును గూర్చి మిక్కిలి నొక్కి యిటుల చెప్పియున్నారు.

"అథఖ ల్వేకం ప్రాణవర్ధనానాం ఉత్కృష్టతమం; ఏకం బలవర్ధనానాం, ఏకం బృంహణానాం; ఏకం నన్దనానాం, ఏకం హర్షణానాం, ఏకమయనానాం ఇతి. తత్రాఽహింసా ప్రాణినాం ప్రాణవర్ధనానా ముత్కృష్టతమం, వీర్యం బలవర్ధనానాం, విద్యా బృంహణానాం, ఇన్ద్రియజయో నన్దనానాం, తత్త్వావబోధో హర్షణానాం, బ్రహ్మచర్య మయనానాం, ఇత్యాయుర్వేదవిదో మన్యన్తే."

ప్రాణమును వృద్ధినొందించువానిలో అన్నము ప్రధానమని అది వఱకు చెప్పియుండియు, అహింసయే ప్రధానతమ మని ఇక్కడ చెప్పుచున్నాడు. బృంహణపదార్థములలో మాంసము ప్రధానమని తెలిసియు, విద్య అనగా యోగశాస్త్రపాండిత్యము శరీరమును మనస్సును రెండింటిని వృద్ధినొందించును గాన విద్యయే శ్రేష్ఠతమ మని చెప్పబడినది, ఆనందమును గలిగించువానిలో ఇంద్రియలోలత్వము గాక ఇంద్రియజయముచే గలుగు బ్రహ్మతత్త్వజ్ఞానము శ్రేష్ఠతమమనియు, ఆయుర్వేదవేత్తలు చెప్పుదురు అని స్పష్టముగా ఉద్ఘోషించుచున్నాడు. కాబట్టి కేవలము భౌతికవిషయము లనే గాక ఆధ్యాత్మికజ్ఞానమును బోధించు శాస్త్రము, ఆయుర్వేద మని గ్రహింపవలెను.

## బ్రహ్మమునకు ఆయుర్వేదమునకు సాదృశ్యము.

మూ. "సోఽనన్త పారం త్రిస్కంధ మాయుర్వేదం". *

ఆయుర్వేదము ఆద్యంతరహిత మనియు మూడుశాఖలు కలదనియు చెప్పబడినది. బ్రహ్మమున కెట్లు ఆద్యంతములు లేవో అట్లే ఆయువును అనాదియై అనంతముగ నున్నది. సచ్చిదానంద స్వరూపుడుగా వర్ణింపబడిన బ్రహ్మమునకు చైతన్యము స్వభావము. చైతన్యమే బ్రహ్మస్వరూపము.

* చరకము - సూత్రస్థాన - అధ్యాయ 1, మూలము 25.

బ్రహ్మమునకెట్లో ఆయువున కట్లే ఆద్యంతములు లేకపోవుటచేత ఆయుర్వేదము కూడ ఆద్యంతములు లేని విజ్ఞాన మగుచున్నది.

అనంతపారమగు ఆయుర్వేదము (హేతు, లింగ, ఔషధము లనెడి) త్రిస్కంధము అని చెప్పబడుటచే మూడు గొప్పకొమ్మలు గలదియై తన విత్తనముల వెదజల్లి తరతరములకు వృద్ధిచెందుచుండు గొప్పవృక్షముతో బోల్పబడియున్నది. బ్రహ్మముగూడ తలక్రిందుగా నుండు అశ్వత్థమునకు బోల్పబడి భగవద్గీత 15 వ అధ్యాయమున ఈ ప్రకారము వర్ణింపబడినది. ఈ బ్రహ్మవృక్షముయొక్క వర్ణన ఇంకను అనేకచోట్ల నిట్లే కానవగును.

"ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్."

అర్థము:— మొదలు పైనను కొమ్మలు క్రిందుగ ఉండి ఎప్పటికిని నశింపనిదియు వేదములు (జ్ఞానము) తన ఆకులుగా గలదియు, అగు ఈ అశ్వత్థ వృక్షమును తెలుసుకొనినవాడే వేదము నెఱిగినవాడు. మన కన్నుల యెదుట గాన్పించు జగత్తంతయు ఒక సూక్ష్మబీజమునుండి పుట్టిన గొప్ప వృక్షముగా వర్ణింపబడినది. తక్కిన వృక్షములవలె ఈ వృక్షము భూమి యందు పుట్టి పైకి వ్యాపించక, అవ్యక్తుడగు పరమేశ్వరునియందుండి పైనుండి క్రిందికి దృశ్యసృష్టిరూపముగ వ్యాపించినట్లు వర్ణింపబడినది.

"పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్య అమృతం దివి."

—పురుషసూక్తము.

మిక్కిలి దూరముగ నుండు నక్షత్రములు కూడ చేరియుండి మనకు కనబడు సృష్టిఅంతయు మొత్తముసృష్టిలో ఒక నాల్గవవంతే అనియు, దానికి పైన ఇంకను మూడువంతులు అదృశ్యమైన ఈ వృక్షభాగము గలదనియు దీని అభిప్రాయము. మానవశరీరమునందు కూడ సృష్టియందు ఎన్ని భావవిశేషములుగలవో అన్ని భావవిశేషములుగలవు. పురుషునియందుండు విశేషములు అన్నియు లోకమునందును గలవు అని చరకములో వర్ణింపబడియున్నది.

"యావన్తో హి లోకే భావవిశేషాః తావన్తః పురుషే,
యావన్తః పురుషే తావన్తో లోకే." *

* చరక. శా. అ. 5. 3.

మూలము(వేరులు)గల శిరస్సు ఊర్ధ్వభాగమునుండి, కాళ్ళు చేతులు అనెడి శాఖలు బ్రహ్మవృక్షమునందువలెనే మానవశరీరమునందుకూడ పైనుండి క్రిందికి వ్యాపించినట్లు మానవశరీరము వర్ణింపబడియున్నది. లోకమునకును, పురుషునకును సామ్యనిరూపణముజేసి ఎవడు సర్వ ప్రపంచమునందును తాను వ్యాపించి యుండునట్లును, ప్రపంచమంతయు తనయందున్నట్లును భావించి ఈబ్రహ్మతత్త్వము తెలిసికొనునో వాడు మనశ్శాంతినిపొంది శాశ్వతమగు దుఃఖ రహితమగు మోక్షమును పొందినవాడగును. ఇట్టి వానిని జీవన్ముక్తు డందురు.

జీవన్ముక్తుడు అనగా బ్రతికియుండగనే మోక్షమును పొందినవాడు.

"లోకే వితత మాత్మానం, లోకం చాత్మని పశ్యతః,

పరావరదృశ శ్శాన్తిః జ్ఞానమూలా న నశ్యతి"*అని చరకమునందు గలదు.

అర్థము:—సర్వ ప్రపంచమునందు తాను వ్యాపించియుండునట్లును, ప్రపంచమంతయు తనయందుండునట్లును భావించి పరము (ఆత్మ) ను, అవరములను (ఆత్మ వ్యతిరిక్తముగా నుండు ఇతర పదార్థములను) చక్కగా తెలిసికొనువానికి జ్ఞానమూలమగు శాంతి కుదురును. అది యెుకప్పుడును నశింపదు. మోహమూలమగు శాంతి తాత్కాలికమై నశించునదని భావము.

ఇదే విషయము భగవద్గీతయందు "సర్వభూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని, ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" ♦

అనగా భూతము లన్నింటియందును సమత్వబుద్ధి కలవానికి దృష్టి అంతయు సమమై యుండునుగాన, సర్వభూతములయందు తానును, తన యందు సర్వభూతములును ఉన్నట్లు చూచును. మరియు,

"పశ్యతి స్సర్వభావాన్ హి సర్వావస్థాసు సర్వదా,
బ్రహ్మభూతస్య సంయోగో నశుద్ధస్యోపపద్యతే." ‡

అనగా బ్రహ్మస్వరూపుడైనవాడు (జీవన్ముక్తుడు) సర్వకాలసర్వా వస్థలయందును లోకసంబంధమైన భావముల నన్నిటిని చూచుచున్నను, అట్టి శుద్ధసత్త్వునకు ఆ యా భావములకు సంబంధించిన సుఖదుఃఖములు కలుగవు. అనగా ముక్తునకు విషయసంబంధము కలుగనేరదని భావము.

ఈ కాలమునందు భౌతికసౌఖ్యములనే ఆదర్శప్రాయములుగా చూచుకొనెడి పాశ్చాత్యశాస్త్రజ్ఞులకు ఆయుర్వేదముయొక్క ఆధ్యా త్మిక దృష్టి కలుగుట కష్టమే. ఆయుర్వేదము అనంతపారము. అనంత

*చరక శా. అ. 5. 32. ♦భగవద్గీత అ.6. 29. ‡చరక శారీ. అ. 5. 33.

మనగా మోక్షము. పార మనగా ఉత్కృష్టమైనది. కనుక, ఆయుర్వేదము మోక్షరూపమైన ఉత్కృష్టఫలమును సంపాదించుటకు సాధనముగ నొప్పి యున్నది.

## జీవితపరమార్థములు

హిందూసంప్రదాయము ననుసరించి ధర్మార్థకామమోక్షము లనెడి నాలుగును జీవితపరమార్థము లని చెప్పుదురు. కాని ఒక్కొక్క శాస్త్రకారులు తమశాస్త్రముయొక్క ప్రాముఖ్యమును ప్రదర్శించుటకై, ఒక్కొక్క పరమార్థమును హెచ్చుగా పొగడుచుందురు. ధర్మశాస్త్రకారులు ధర్మమే ప్రధాన మందురు. అర్థశాస్త్రకారులు దేహబల, ధన, ధాన్యాదిసంపత్తులను, రాష్ట్రములను, సైన్యములను సంపాదించుటయే పరమార్థమని చెప్పుదురు. కామశాస్త్రజ్ఞులు ధర్మార్థకామములలో, కామమునకే ప్రాధాన్య మిచ్చెదరు. సుఖ(కామ)ప్రాప్తికై ఒకానొకప్పుడు కొన్నికష్టములు సంభవించినను, పరమార్థమైన సుఖసంపాదనకై వాటిని ఎట్లయినను తొలగించి సుఖము ననుభవించుట అవసరమని వీరు తలతురు.

షడ్దర్శనములలో, సాంఖ్యులు జ్ఞానమే పరమార్థ మనెదరు. యోగులు ఈశ్వరసన్నిధానరూపమగు యోగమే పరమార్థమందురు. న్యాయవైశేషికులు, సకలదుఃఖధ్వంసరూప మగు మోక్షమే పరమార్థమని యెంచుదురు. పూర్వమీమాంసకులకు స్వర్గరూపమగు సుఖము పరమార్థము. వేదాంతులలో, అద్వైతులకు సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే పరమార్థము. విశిష్టాద్వైతులకు భగవత్కృప రూపమగు మోక్షమే పరమావధి. నాస్తికులలో చార్వాకులకు ఇహలోకసుఖమే పరమార్థము. బౌద్ధులకు ధర్మమే పరమార్థము. జైనులకు అహింసయే పరమార్థము. ఆయుర్వేదవిదులకు మనోనైర్మల్యముచే పొందదగిన నిర్వాణపదవాచ్యమైన శాంతిరూపమగు జీవన్ముక్తియే పరమార్థము.

## ఆయుర్వేదముయొక్క ఉద్దేశము

ఇట్లుండియు, అర్థసుఖములకు విరోధము లేకుండా ధర్మమును, ధర్మసుఖము (కామము) లకు విరోధము లేకుండ అర్థమును, ధర్మార్థములకు విరోధము లేకుండ సుఖమును, ధర్మార్థసుఖములకు విరోధము లేకుండ

మోక్షమును, ఈప్రకారము ధర్మార్థకామమోక్షముల నాలుగింటిని సాధించుట ఆయుర్వేదముయొక్క ఉద్దేశము. కొందరు మోక్షమును గూడా సుఖములో చేర్చి ధర్మార్థ సుఖములు అనుత్రివర్గమే పరమార్థములందురు. పురుషార్థసాధనములకు జ్వరాది వ్యాధులు ఆటంకముగ నుండుటవలన, అట్టివానిని నివారించుటకై ఈ ఆయుర్వేద శాస్త్రము పుట్టియున్నది.

## 10-వ అధ్యాయము

# ప్రాచీన భారతదేశమున వైద్యులు - ఆతురాలయములు

[విషయసంగ్రహము:—ఆత్రేయసంప్రదాయము - ధన్వంతరి సంప్రదాయము - ద్విజులలో ద్విజులు - వైద్య విద్యార్థి లక్షణములు - కర్మపథాభ్యాసము - జీవకుడు - జీవకుని చికిత్సలు - జీవకచరిత్రనుండి తెలియుచున్న విషయములు - ఆతురాలయములు - చరకుని ఆతురాలయ వర్ణన - విశ్రాంతి గృహములు - అశోకుని రెండవశాసనము - సుశ్రుతుని సూతికాగారవర్ణన - ఆతురాలయములను గురించిన కొన్ని ప్రాచీన శాసనములు].

హిందూమహాయుగమున వైద్యుల చరిత్రయందలి కొన్ని పేర్లు మనకు తెలిసియున్నను, ఆ వైద్యులను గూర్చి చారిత్రక విషయములు ఇప్పుడంతగా కానరావు. కాని రెండుసంప్రదాయములు పరంపరగ వచ్చుచున్నవి.

1. ఆత్రేయసంప్రదాయము :— ఇందలి ముఖ్యులు అశ్వినీదేవతలు, భారద్వాజులు, అగ్నివేశులు, చరకుడు, భేడుడు, వృద్ధజీవకుడు, హారీతుడు మొదలగువారలు.

2. ధన్వంతరి సంప్రదాయము :—ఇందలి ముఖ్యులు, కాశీరాజగు దివోదాసు అను ధన్వంతరి, సుశ్రుతుడు, అగస్త్యులు, నవనాథసిద్ధులు మొదలగువారు.

## ద్విజులలో ద్విజులు

వైదికయుగములో ఆయుర్వేదమును ప్రతివిద్యార్థియు ఏడవసంవత్సరమునుండి విధాయకముగా ఇతరవిషయములతో పాటు నేర్చుకొనవలసియుండెను. వయసు వచ్చిన తరువాత ప్రత్యేకము వైద్యుడుగా తయారగుటకు నిర్ణయింపబడిన వారలకు అదివరకు జరిగిన ఉపనయనముగాక రెండవసారి ఉపనయనము చేయబడుచుండెను. అనగా ద్విజులలో తిరిగి ద్విజత్వము పొందినగాని వైద్యార్హత లేకయుండెను.

## వైద్యవిద్యార్థి లక్షణములు

వైద్యవృత్తియందు ప్రవేశించుటకు అర్హులగువారు చక్కని ముక్కు, పెదవులు, కండ్లు, పండ్లుగలిగి, సుందరమైన ముఖవర్చస్సు గలిగియుండవలెను. మంచివాగ్ధోరణి గలిగియుండవలెను. గోళ్ళు చక్కగా కత్తిరించుకొని, నిర్మల వస్త్రముల ధరించి, వినయవంతుడై, నీతిమంతుడై, బుద్ధిమంతుడై, చక్కని జ్ఞాపకశక్తి గలిగి, ఓర్పును ధైర్యమును గలిగి, మనోవాక్కాయ శౌచములు గలిగి, ఎల్లప్పుడును శ్రమల కోర్చుకొనువాడుగా నుండవలెను. "నాత్మార్థం నాపి కామార్థ మథ భూతదయాం ప్రతి" అని భూత చింతయే ఆదర్శముగా గలిగి చికిత్స చేయవలెను గాని స్వార్థమునకై చికిత్స చేయకూడదు. బీద వారలకు స్నేహితులకు బంధువులకు ఎల్లప్పుడును ఉచితముగా చికిత్స చేయవలెను.

## కర్మపథాభ్యాసము

కర్మపథమునందును శాస్త్రజ్ఞానమునందును సమానప్రజ్ఞ గలిగియుండవలెను. లేనియెడల ఒకటే రెక్కగల పక్షివలె పడిపోవును. అప్పటి వైద్యులజ్ఞానము ఆ కాలమునాటి చరక సుశ్రుతాది గ్రంథముల ఉత్కృష్టతను బట్టి తెలియగలదు. కాని బౌద్ధయుగమునాటి వైద్యుల చరిత్ర జాతక కథలనుండియు, భారతదేశమంతటను ప్రయాణముచేసి గ్రంథములు వ్రాసిన చైనాదేశవిద్యార్థులగు యూనుత్సాంగ్, ఇత్సాంగు మొదలగువారి క్రీ. పూ. అయిదవ శతాబ్దమునాటి చరిత్రలనుండి మనకు కండ్లకు కట్టినట్లు తెలియగలదు.

## జీ వ కు డు

ఆ కాలమునాటి బౌద్ధవిహారములలో ఉపయోగింపబడిన మందులు ఆహారములు వీని పట్టీలు కొన్ని ఇంకను గలవు. బుద్ధుని కాలమునాటి అనగా క్రీ. పూ. ఆరవశతాబ్దమునాటి జీవకుడు అను వైద్యుని చరిత్ర మనకు ఆశ్చర్యము కొలుపక మానదు. ఇతడు గౌతమబుద్ధుని సమకాలికుడు. ఆయునకు చికిత్స చేసెను. కౌమార భృత్యము అనగా బిడ్డలచికిత్సయందు మిక్కిలి చతురతగలవా డని బిరుదమును గలిగియుండెను. కాని జీవకుడు కాయచికిత్స యందును శస్త్రచికిత్సయందును గొప్ప ప్రజ్ఞగలవాడని చారిత్రిక నిదర్శనములు గలవు. అతడు మగధరాజ్యమునకు ముఖ్యపట్టణమగు రాజగృహ నగరమునుండి బింబిసార చక్రవర్తియొక్క కుమారుడగు అభయునిచే అప్పటికే ప్రసిద్ధిజెందియుండిన తక్షశిలానగరము నందలి వైద్యవిశ్వవిద్యాలయమునకు పంపబడెను. ఆ కాలమున రమారమి వేయిమైళ్ళదూరము వైద్యవిద్యను సంపాదించు నిమిత్తమై ఇతడు పోయియుండెననిన ఆశ్చర్యపడ నవసరములేదు. ఇచ్చట నతడు ఏడుసంవత్సరములు విద్యాభ్యాసముచేసి గురువు వద్ద సెలవు తీసికొనువప్పుడు, గురువు అతనిని ఈ విధముగా పరీక్షించెను. "ఈ గడ్డపార తీసికొని తక్షశిలానగరమునకు చుట్టును యోజనము దూరములో వైద్యమునకు పనికిరాని మూలికలను తెమ్ము" అని పంపించెను. అతడు తిరిగి తిరిగి యేదో ఒకవిధమున చికిత్సకుగాని ఆహారముగాని పనికిరాని వస్తువు లేదని "న హి కించిత్ జగత్యనౌషధం" అని చెప్పెననియు, అందుపైని గురువు తృప్తిపొంది అతనికి ప్రయాణపు ఖర్చులకు కొంతధనమిచ్చి వీడ్కొల్పె ననియు వ్రాసియున్నారు. జీవకుడు సాకేతనగరమునకు వచ్చువఱకు ప్రయాణపు ఖర్చులకు ధనము లేక పోవుటచే అచ్చట కొన్ని దినములుండవలసి వచ్చెను.

## జీవకుని చికిత్సలు

ఆ నగరమున ఒకధనికుడగు ఒకసెట్టి భార్య ఏడు సంవత్సరముల నుండి ఏదో తలలో బాధపడుచు ఎందరు వైద్యము చేసినను కుదురక కష్టపడుచుండెను. జీవకుని సమాచారము విని, వారు ఇతనిని ఆహ్వానింపగా ఇతడు కొన్ని మూలికలను సంపాదించి వానితో ఒకఘృతము తయారుచేసి నశ్యముచేయించెను. ఈ చికిత్సచే ఆమె రోగము నివృత్తి అయ్యెను. వైద్యదక్షిణగా 16000 రూపాయలను, ఒక గుఱ్ఱపుబండిని, నౌకరులను

ఆయనకు సమర్పించిరి. దీనితో రాజగృహాముచేరి తన పోషకుడగు అభియునకు తనకు సహాయముచేసిన ధనమును తిరిగి ఇచ్చివేసెను. పిమ్మట బింబిసార చక్రవర్తికే భగందరచికిత్స కొన్ని లేపముల సహాయముతో చేసి కుదిర్చెను. అంతట జీవకుడు రాజవైద్యుడుగా నియమింపబడెను. తరువాత గౌతమ బుద్ధునకును, వారి సంఘమునకును వైద్యుడాయెను. జీవకుడు చికిత్సచేసిన అత్యద్భుత చికిత్సలలో కొన్ని బౌద్ధగ్రంథములలో వర్ణింపబడినవి. రాజ గృహ నగరమునందు ఒక వైశ్యశిఖామణి కుమారునకు మితిమీరిన తలనొప్పి అనేక సంవత్సరములనుండి బాధించుచుండెను. జీవకుడు శస్త్రచికిత్సచే తలలో నొకభాగమును దొలిచి రెండుపురుగులను తీసివేసి వ్రణమును ఎప్పటి వలె కుట్టి ఏదో ఒక లేపమును పూసి కట్టుకట్టెను. ఇందువలన తలనొప్పి నిర్మూలమాయెను. పిమ్మట కాశీపట్టణమున ఒక ధనవంతుడైన వైశ్యుని కుమారుడు వ్యాయామము చేయుచుండగా ప్రేగులలో మెలికపడి ఆహారము జీర్ణించుకొనలేక మలబద్ధముగలిగి రక్తహీనుడై శల్యావశిష్టుడై యుండెను. అంతట వారు జీవకునకు చెప్పిపంపగా, ఇతడు శస్త్రచికిత్సచే ఉదర పాట నముచేసి, మెలిబడినప్రేగులను రోగిభార్యకు చూపించి, ప్రేగుల మెలి విడగొట్టి తిరిగి ఎప్పటివలె ఉదరకుహరమున స్వస్థలమున నిలిపి, చర్మము కుట్టి ఏదో ఒక లేపము పూసి మాన్పెను. అతనికి ఆ కాలమున వైద్యదక్షిణగా నేర్పడిన రు 16000 లు సమర్పించిరి.తరువాత జీవకుడు కుదుర్చిన గొప్పవ్యాధి యేమన, ఉజ్జయనీమహారాజగు "ప్రద్యోత" చక్రవర్తి కామిలా (పచ్చకామెర్లు) వ్యాధిచే బాధించుచున్నందున ఆస్థానవైద్యముగా, బింబిసారచక్రవర్తివద్దకు వారి సంస్థాన వైద్యులగు జీవకుని పంపగోరి ఆహ్వానము పంపిరి. రోగముకంటె రోగి మొండివాడని జీవకుడు తెలుసుకొనెను. ఆ వ్యాధికి ఘృతపానము చేయవలసియుండెను. ఘృతముపేరు చెప్పగానే, రోగికి వాంతి వచ్చుచుండు నట్లుండెను. అందుచేత ఘృతము పనికిరాదని రాజు శాసించెను. జీవకుడు ఎట్లెట్లో కష్టపడి రంగు, వాసన, రుచి అన్నియు మారునట్లు ఒక ఘృతమును తయారుచేసి, ఒకవేళ మహారాజునకు వమనమైనయెడల ఘృతమును కనిపెట్టి, ఏమి దండన విధించునో అను శంకచేత ఒకయుక్తిని పన్నెను. అదేమనగా, ఈ మందు లోపలికి ఇవ్వగానే, తాను ఒక పచ్చి మూలిక సంపాదించి వెంటనే విరుగుడుగా నివ్వవలెననియు, అందు నిమి త్తమై వేగముగ పరుగెత్తగల వాహనమును తయారుచేసి వీధిలో సిద్ధముగా

నుంచవలెననియు ఏర్పాటుచేయించెను. పిమ్మట ఔషధప్రయోగముచేసి, ఉపచారవిధానాదుల నొనర్చుటకు తగువారల నియమించి, వీథిలో తయారుగా నున్న ఏనుగు నెక్కి అతివేగముగా నగరము విడిచిపోయెను. చక్రవర్తికి రోగనివృత్తి అయ్యెను. కాని వైద్యుడు కనుపించలేదు. రాజా రహస్యము నంతను తెలిసికొని జీవకునకు జేరవలసిన బహుమానమును బింబిసారుని రాజధానికి పంపివేసెను. ఇట్లు కఠినమైన రోగములనేగాక బుద్ధ సంఘమునందు అనేక చికిత్సలు జీవకుడు చేయుచుండె నని 'చుల్లవగ్గ' 5-14-1 అను గ్రంథమునందు గలదు. ఒకసారి బుద్ధునికే ఆరోగ్యము తప్పిపోయెను. అప్పుడు విరేచనౌషధము ఇవ్వవలసివచ్చెను. అతి గౌరవముగా కాపాడబడుచుండు పవిత్రమూర్తియైన మునీశ్వరునకు లోపలికి తీసికొనుటకు అహితములైన మందులను ఇచ్చుటకు జీవకునకు ఇష్టములేకపోయెను. అందుచే విరేచనౌషధములను పద్మములలో నిమిడ్చి వాసనచూచుటకు బుద్ధుని కిచ్చెను. సుఖముగ విరేచనములైనపిమ్మట వేడినీళ్ళలో స్నానముచేయించి, సంపూర్ణముగ ఆరోగ్యము కలుగువరకు ద్రవపదార్థములను ఆహారముగా నిచ్చుచుండె రని వ్రాయబడియున్నది. మరొకసారి ఎవరో ఒక భక్తురాలు విందు చేసినప్పుడు సంఘమునందు అందరికిని అజీర్ణము పుట్టి దోష ప్రకోపముచే బాధలు పడుచుండ జీవకుడు వారి కందరకును చికిత్స చేసెనని కలదు.

## జీవకుని చరిత్రనుండి తెలియుచున్న విషయములు

(1) తక్షశిలానగరమునందు క్రీ. పూ. ఆరవశతాబ్దము నాటికే వైద్యవిశ్వవిద్యాలయము గల దనియు (2) వైద్యశాస్త్రమున నుత్తీర్ణు డగుటకు 7 సం॥ కాలము పట్టెడి దనియు (3) వైద్యుడు చికిత్సకు ప్రారంభించక పూర్వము తగు పరీక్షలు ఉండెడి వనియు (4) ఓషధీ విజ్ఞానము అప్పటికే చక్కగ నభివృద్ధిలో నుండి మూలికలయొక్క ప్రభావము బాగుగ తెలిసియుండెవనియు (5) సాకేత, కాశీ, రాజగృహ, ఉజ్జయిని మొదలగు రాజధానులయందు ప్రసిద్ధవైద్యులకు ఈ కాలమునందు కంటె అప్పుడు హెచ్చు బహుమానములు జరుగుచుండె వనియు (6) ఆ కాలము నాటికే ఉదరమును చీల్చుట, పుఱ్ఱెయెముకను దొలచుట మొదలగు శస్త్రచికిత్సలు చేయు నేర్పు ఉండె ననియు (7) వ్రణములు మాన్పు ఔష

ధములకు ఏ విధమైన లోటు లేక యుండెననియు (8) అప్పటికే జీవకునివలె ప్రసిద్ధి నొందిన వైద్యులకు ఒక రాష్ట్రమునుండి మరియొక రాష్ట్రమునకు చికిత్సార్థమై పోవలసి వచ్చుచుండెననియు దృఢపడుచున్నది.

## ఆ తు రా ల య ము లు

బౌద్ధయుగమునకు పూర్వమే ఆతురాలయములు, ప్రసూతిశాలలు, కుమారాగారములు అను పేర చికిత్సశాలలు ఉండెననియు అందు వైద్యుడు, పరిచారకుడు, ఔషధము, రోగి అను పాదచతుష్టయము యొక్క సంపత్తిని గూర్చి చక్కని వివరములు చరక సుశ్రుతముల ద్వారా మనకు తెలియుచున్నవి.

చరక సూత్రస్థానము 15-వ అధ్యాయమునందు 'దృఢం నివాతం ప్రవాతైకదేశం' అను వాక్యములతో ఆతురాలయముల యొక్క గృహాది వర్ణనలును కనుపించుచున్నవి. దృఢముగ నున్నట్టియు, పెనుగాడ్పులు వీవ నట్టియు, సుఖముగా నుండుటకై ఎంత కావలయునో అంతటి ప్రశస్తమైన గాలివీచునట్టియు, ఇటునటు సంచరించుటకు అడ్డములు లేనట్టియు, వెలుతురును అడ్డగించు ఎత్తైన కట్టడములు లేనట్టియు, అనారోగ్యకరములగు పొగ, ఎండ, తడి, దుమ్ము ప్రవేశించనట్టియు, అనిష్టమగు శబ్దస్పర్శరూప రసగంధములు లేనట్టియు, అవశ్యములగు ఉపకరణములు అన్నియు గలిగిన వంటశాల, స్నానభూమి, వర్చస్థానము (మరుగుదొడ్డి), వీటి అన్నిటితో రోగి చికిత్సకు ప్రారంభింపకముందే సిద్ధముగా నుండవలసిన ఆతురాలయమును వర్ణించియున్నాడు. వైద్యశాలయందు సమృద్ధిగ పాలిచ్చునట్టియు శ్రేష్ఠమైనదియు, రోగము లేనిదియు, దానికి కలిగిన దూడ లన్నియు బ్రతికి యుండునదియు, నిరుష్టమైన నీళ్ళతోను, మేతతోను, మేపబడి చక్కగ పోషింపబడిన శీలవతియగు గోవును పరిశుభ్రమైన కట్టడమునందు కట్టి యుంచవలెను అని చెప్పబడి యున్నది. ఇంకను చిత్రమేనగా - ఈ కాలమున గూడ సర్వసంపూర్ణ చికిత్సలు గల ఆతురాలయములలోగూడ ఆచరణములో లేని మానసిక వైద్యము గాత్రయంత్రములతో సంగీతము పాడువారి సహాయముతో, మనస్సున కుల్లాసముగ సంభాషించగలిగి పురాణ ఇతిహాసములు వినిపించుచు, దేశకాలానుగుణముగ రోగుల ఇంగితము నెఱింగి నడచుకొను పరిచారకులు ఆతురాలయముల సంస్థాపనములలో నుండిరని

తెలియుచున్నది. ఐతే గోవు అని ఏకవచనము ఉపయోగించుటచేతను, చికిత్సాలయమున నుండు సంభారములను చూచి ఆలోచింపగా ధనవంతుడగు ఒక్కొక్క రోగికే అతురాలయమునందు చికిత్స చేయుచుండిరని తోచుచున్నది. కాని క్రీ. శ. ఐదవ శతాబ్దమునందు తన కండ్లతో చూచినది చూచినట్లుగా ఫాహియాన్ అను చైనాయాత్రికుడు రెండవచంద్రగుప్త డను గుప్తచక్రవర్తి కాలమున గల ధర్మ వైద్యశాలలను వర్ణించియున్నాడు. ఇందు అనేకరోగములకు ఒక్కటే స్థలమున చికిత్స చేయుచుండినట్లు గలదు. ఇందును గురించి 39 వ పేజిలో చూడనగును.

## విశ్రాంతి గృహములు

తక్షశిల మొదలు రామేశ్వరమువఱకు నలుదిక్కులకు వ్యాపించి యుండిన రాజమార్గములనంటి అరక్రోసునకు అనగా ఒక మైలు రెండు ఫర్లాంగులకుఒకటిచొప్పున రోడ్డుప్రక్కలను సత్రములు, ఆతురాలయములు ఆసనములు, మంచములు, అన్న పానీయములు మొదలగువాటిని బాటసారులకు సమకూర్చి ధనికులు ఒకరినిమించి ఒకరు ధర్మార్థము కైంకర్యములుచేయుచుండిరని ఈ బౌద్ధచరిత్రములందు గలదు. దక్షిణాపథమున చెన్నపట్టణమునకు సమీపమున ఈ రస్తాలలో చాకలివాని సత్రమనియు, తెలికలవాని సత్రమనియు, రాయల సత్రమనియు, భోగముదాని సత్రమనియు అనేక పేర్లతో గ్రామములు నేటికిని గలవు. ఈ గ్రామములు అన్నియు ఇనాము గ్రామములుగా నుండి ఏవిధమగు సర్కారు పన్నులు ఇయ్యనక్కర లేకుండ బాటసారుల ఉపయోగార్థము వినియోగపడుచుండెను. ఇటివంటి స్థలములలో అనేక విధములగు గొప్ప వృక్షములు గల తోపులను, కోనేళ్లను దేవాలయములను ఇప్పటికిని చూడనగును.

## అశోకుని రెండవ శాసనము.

అశోక చక్రవర్తి తన రెండవ శిలాశాసనమునందు ఈ ప్రకారము ప్రకటించియున్నాడు. "నేను మానవులకేగాక పశువులకుగూడ అతురాలయములను రాష్ట్రము పొడుగునను స్థాపించియున్నాను." ఇందులకై సర్కారు తరఫున ఔషధములు తయారుచేయుటకుగాను మూలికలు, ఫలములు మొదలగు సర్వసంభారమును ఇచ్చు మూలికోద్యానవనములను స్థాపించియుండిరి.

భారతదేశమున లభ్యముగాని మూలికలను ఖండాంతరములనుండి తెప్పించి సర్కారు ఉద్యానవనములలో తొట్లలోపెట్టి అధికమగు ఎండ వానలు తగులకుండ ఆయా ఋతువులకు తగినట్లు ప్రత్యేకము నిర్మింపబడిన ఇండ్లలో పెంచుచుండిరని తెలియుచున్నది. రాజులేగాక ధనికులగు ప్రజలు గూడ ప్రసూత్యాలయములను ధర్మార్థము నిర్మించుచుండిరని తెలియు చున్నది.

## సుశ్రుతుని సూతికాగార వర్ణన

సుశ్రుతమునందు ప్రసూతిగృహము ఈ ప్రకారముగా వర్ణింపబడి యున్నది. "సర్వాగారం యథాసంఖ్యం తన్మయ పర్యంక ముపలిప్త భిత్తిం సువిభక్తపరిచ్ఛదం, ప్రాగ్ద్వారం దక్షిణద్వారం వాష్టహస్తాయతం చతుర్హస్త విస్తృతం రక్షామంగళసమ్పన్నం విధేయమ్." అవసరమైన సామానులు మాత్రము గలిగి, చక్కగా అలంకరింపబడిన గోడలు, తెరలు గలదియై నిర్మలమైన గాలి, వెలుతురు వచ్చుటకుగాను తూర్పునను దక్షిణమునను ద్వారములుగలదై, ఎనిమిది హస్తములు (16 అడుగులు) పొడుగును నాలుగు హస్తముల (8 అడుగులు) వెడల్పును, తక్కువగాకుండ మంగళకరమగు గృహము ప్రసూతి నిమిత్తమై నిర్ణయింపవలెను. ఇట్లే శిశుపోషణకై ప్రత్యేక ముగా ఆయా ఋతువులకు తగినట్లు సుఖకరములగు మంచములు, పడకలు, తివాసులు, దుప్పట్లు, చాపలు మొదలగునవి గలిగి, రమ్యమై చక్కని వెలుతురు, గాలి వచ్చునవిగా నుండవలెనని కుమారాగారముల గూర్చి విధింపబడినది.

## ఆతురాలయములను గురించిన కొన్ని ప్రాచీనశాసనములు

ఇప్పటికిని చెంగల్పట్టు జిల్లాలో "తిరుముక్కోడల్" అను గ్రామము నందు ఆతురాలయమును గూర్చియు, గుంటూరు మండలమున కృష్ణా తీరమున మలకాపురము గ్రామమునందుండిన. ప్రసూత్యాలయ మును గూర్చియు శిలాశాసనములు చూడనగును. ఆతురాలయము లందున్న మందులపట్టీలు సహా ఈ శాసనములలో చెక్కబడి యున్నవి. అందు వాసా హరీతక, గోమూత్రహరీతక, భల్లాతకహరీతక, బిల్వాదిఘృత, కల్యాణలవణ, లశునాద్యేరండతైలము ఇత్యాది మందులు నేటికిని ఉపయోగములో నున్నవి గలవు. ఇట్టి ఆతురాలయమునకు సంబంధించిన శాసనములు రెండు ఇటీవల

శ్రీరంగమునందు దొరకినవి. ఇందు ధన్వంతరి విగ్రహ ప్రతిష్ఠనుగూర్చియు రంగనాథ దేవాలయమునందు స్థాపించిన ధర్మ వైద్యశాలనుగూర్చియు గలదు. ఇవి 13-వ శతాబ్దము నాటివి. హిందూ చీనా దేశమునందలి జయవర్మ మహారాజు కాలపునాటి వైద్యశాలలను గూర్చి 60 వ పేజీలో చూడనగును. ఇట్టి ఆరోగ్యశాలలనుగూర్చి నంది, స్కాంద, సౌరాది పురాణములలో వర్ణింపబడియున్నది.

పైన వివరించిన ప్రకారము ఆయుర్వేదము, భారతీయ విజ్ఞానమునకును, భారతీయ విజ్ఞానము ఆయుర్వేదమునకును తోడ్పడు చుండెనని నిరూపించుటకు చరిత్రాత్మకములగు అనేక నిదర్శనము లుండగా, ఆయుర్వేదము శాస్త్రమే కాదనియు, ఈదేశమున సర్కారు సొమ్ము ఆయుర్వేద ప్రోత్సాహమునకై వ్యర్థపరచగూడదనియు చెప్పు వారి దృక్పథము ఇప్పుడైనను మారగలదని అభిలషించుచున్నాము.

---

ఆయుర్వేదశిక్ష - సూత్రస్థానమందు

ప్ర థ మ ఖ ం డ మ గు

**భా ర తీ య వి జ్ఞా న ము**

స ం పూ ర్ణ ము.

---

౨౧౯

# అకారాది విషయసూచిక

## స

